# ఈమె సరోజ

తల్లికి ముద్దు కుమార్తె · ఆటలలో చురుకైనది · చదువులో తెలివైనది



# అదే, అసలైనదే ఆమెకు కావాలి.

త్వరగా అందమైన, ముచ్చట గొలిపే అమ్మాయిగా ఎదవలెనని సరోజ తహ తహలాడుతోంది.

ఈ ఉద్దేశమును నెరవేర్చుటకు ఆమె తల్లి ప్రతి రోజు ఆమెకు ''హార్లిక్స్'' ఇస్తుంది—అత్యుత్తమమైన, సాటిలేని ''హార్లిక్స్''.

''హార్లిక్స్''లో గల ప్రోటీన్లు పిల్లల పెరుగుదలకు కావలసిన పుష్కలమైన శక్తి నిస్తాయి దానిలో శుద్ధమైన, పూర్తి మీగడ గల పాలు, ఉత్తమమైన గోధుమ మరియు ప్రకృతి సిద్ధమైన ఇతర పోషకవంతమైన పదార్థములు సమృద్ధిగా వున్నాయి

80 సంవత్సరముల పైగా తల్లులు ''హార్లిక్స్'' మీద ఆధారపడుతున్నారు మరియు డాక్టర్లు ''హార్లిక్స్''ను సిఫారసు చేస్తున్నారు.

మీరు, మీ కుటుంబములోని వారు ఉత్సాహముతో వుండండి — ప్రతి రోజు ''హార్లిక్స్'' త్రాగండి ''హార్లిక్స్'' ఉత్తమ పోషకత్వమును, అధిక శక్తిని ఇస్తుంది.




## అదే, అసలైనదే 'హార్లిక్స్'

HL.1842A

'హార్లిక్స్' అనే పేరు రిజిస్టర్ చేయబడిన ట్రేడ్ మార్కు

పట్టుపగ్గాలు లేని పశువు తనాన్ని పట్టి బంధించేది అయినవాళ్ళకి అందించేది పవిత్రబంధం!

అశోక్ మూవీస్

# పవిత్రబంధం

దర్శకుడు: వి. మధుసూదనరావు  నిర్మాత: టి. గోవిందరాజన్

రచన: ఆత్రేయ - సంగీతం: రాజేశ్వరరావు  ఫొటోగ్రఫీ: పి.ఎస్. రామకృష్ణారావు



# ఉత్తరాలు

## కథలు

ఈ వారం వత్రిక 5—2—71 లో కథ లన్నీ బాగున్నాయి. ముఖ్యంగా మహేష్‌గారి ముగ్గురు మూర్ఖులు కథ చాలా బాగుంది. మరుగున పడిపోతున్న రాజకీయ రహస్యాల్ని, ఆలోచనాత్మకంగానూ, హాస్యాస్పదంగానూ వ్రాయటంలో వారికి వారేసాటి.

శ్రీకృష్ణగారు తమ తేలలో వ్యాపారాన్ని పెంచుకున్నందుకు టాటా వారి కార్ఖానాను ప్రభుత్వం పరీక్షిస్తోంది అన్నారు. మరి ఆగాఖాన్ వ్యవహారాన్ని, సోవియట్ రష్యా [సాంస్కృతి కేంద్రం] వ్యవహారాన్ని కప్పి పుచ్చటానికి ప్రభుత్వం ఎందుకు ప్రయత్నించిందో? ఏమైనా ఇన్ని రాజకీయ పార్టీలను భరించే శక్తి మన దేశానికి లేదు.

మహేష్‌గారికి నా అభినందనలు.

శ్రీ భూపతి రాజాలక్ష్మి నరసింహరాజు, [రావువల్లి]

* * *

ఈ వారం అంటే 29—1—71 తేదీ మీ [మా] పత్రికలోని మూగపోయిన మురళి కథ చాలా బాగుంది. ఈ కథారచయిత క్రిష్ణ గారికి మా హృదయపూర్వక అభినందనలు. కోరిక కథకూడా బాగానే ఉంది. దీనిలో సుందరి పాత్ర మరవురానిది. అనేకాక సీరియల్స్ కూడా చాలా బాగున్నాయి. ఈ పత్రికలోనే డైమండ్ బ్రూచ్ ఎలా చెయ్యాలో చెప్పిన కృష్ణప్రియగారి అడ్రస్ చెబుతారా. ఈ బ్రోచ్ గురించి కొన్ని విషయాలు ఆవిడకు మేము వ్రాయాలి.

ఎన్. లలిత, డి. పూర్ణ [గురువాజీపేట]

* రచయిత్రి చిరునామా
కృష్ణప్రియ,
జి. అప్పారావు గారింట్లో,
వెంకట కృష్ణాపురం,
కల్పనా థియేటర్ వద్ద,
కాకినాడ.

* * *

ప్రతివారం వెలువడే ఆంధ్రవారపత్రికలో కథలు బాగుంటున్నాయి. ముఖ్యంగా ప్రశ్నావళి శీర్షిక క్రింద శ్రీమతి కె. రామలక్ష్మిగారి సమాధానాలు చక్కగా వుంటున్నాయి.

మిథునం [ఆకివీడు]

* * *

ఆర్. యం. చిదంబరం గారి కథానిక చిన్ని కృష్ణుడి చల్లని చూపు ఎంతో బాగున్నది.

యానంబాక నాగరాజు [కడప]

* * *

కథానాయిక కన్పించలేదు కథ రాసిన వై. రాంబాబుశాయిగార్కి, నా హృదయపూర్వక అభినందనలు తెలుపుచున్నాను—

ఎమ్. నూరుద్దీన్, [నందిగామ]

## సీరియల్

గుళ్ళపల్లి సుందరమ్మగారి అతివి లక్ష్యం సీరియల్ చాలా ఇన్టరెస్టింగ్‌గా వున్నది.

కొత్త సీరియల్ యర్రం చంద్రశేఖరంగారి మల్లెలు— గులాబీలు ఇప్పుడిప్పుడే రక్తి కట్టుతోంది. ఇందులోని శారద, శాంత పాత్రలు మరువరానివిగా వున్నాయి.

చిన్నమాదేవి, [మహబూబ్ నగర్]

* * *

'మల్లెలు యెర్రగులాబీలు' చాలా బాగుంది. రచయిత కల్పించిన రామం పాత్రలంటి మనుషులు నిజ జీవితములో ఎక్కడో నూటికి ఒకరయుంటారు. మొత్తముపై కథా ఆరంభములో బాగున్నది.

మాధవరావు [జయపురం]

## వ్యాసాలు

తే 29—1—71 ది, వారపత్రికలో పొగ త్రాగుటవల్ల ప్రమాదాలు గురించి సంక్షిప్తంగా-నైనా, ముఖ్య విషయాలు తెలియ పర్చారు. అంతటి దుర్వ్యసనం మరొకటి లేదు. జూదం ధననష్ట వ్యసనం అయితే యీ పొగ త్రాగుడు ధన— ఆరో… రిణి! అందువల్ల ఈ విషయానికి ప్రాముఖ్యత నిచ్చి, యీ దురలవాటును ప్రజలు అసహ్యంతో మానుకొనేలా ప్రముఖులచేత వ్యాసాలు వ్రాయించి, ప్రచురించి, ఆరోగ్యపు విలువలు

# మొరీషస్ వెళ్లడానికి 'పి' ఫారం అక్కర లేదు!

ఇప్పుడు మూడేళ్లలో ఒక సారి మీరు 'పి' ఫారం లేకుండానే మొరీషస్ వెళ్ల గలరు. గత మూడేళ్లలో మీరు వేరు విదేశ ప్రయాణం చేసి ఉండినా కూడ బాధ లేదు.

అంతే కాదు. ఎయిర్-ఇండియా మాత్రం ఇవ్వ గల ఒక ప్రత్యేక సదుపాయం కూడ మీకు లభిస్తుంది.

కనుక మా విమానంలో మొరీషస్‌కు ఎగిరి వెళ్లండి. అక్కడి రమణీయమైన 'బీచ్'లలో ఆనందంగా విహరించండి. ఫ్రెంచ్, చైనీస్ మరియు భారత దేశపు ఆహారములను రుచించి ఆనందించండి! ఎయిర్-ఇండియా ద్వారా మొరీషస్ చేరుకోడానికి 6½ గంటలు మాత్రమే పట్టుతాయి.

బొంబాయి నుండి ప్రతి మంగళవారం సర్వీస్ ఉంది **ఎయిర్-ఇండియా**



అందరూ గుర్తించేలా చేస్తారని ఆశిస్తాను. 1968 లో భారతదేశంలో తయారైన, సిగరెట్ల సంఖ్యకు నాలుగు రెట్లెక్కువ బీడీల సంఖ్య. పొగ త్రాగని వాడు నేడు, పుణ్యాత్ముడిలఫ్!

ఎం. ఎ. రావు, [ఖరగ్‌పూర్]

* * *

విజయనిర్మల ముఖ చిత్రంతో వెలువడిన ఈ వారం పత్రికలో హాపిస్ గారి జెంగలు సంచికకి ఎంతో వన్నె తెచ్చింది. సారథిగారి నిజాయితీమీద జాలేసింది.

సంజయ్ ఉవాచ ద్వార పత్రికయొక్క నిష్పక్ష పాతము కొట్టవచ్చినట్లు తెలుస్తూంది. ముగ్గురు మూర్ఖులు కాదు సుమా కథ కాదు సుమా! ద్వారా అధికార వర్గాలలో మంత్రుల స్వార్థపూరిత స్వభావాలు ఉదాహరణలతో సముతము విశదీక రిస్తున్న మహేష్ గారికి మా అభివందనల తెలియచేయ ప్రార్థన.

జి. దుర్గా రాజశేఖర్, ఎస్. వెంకటశాస్త్రి, ఎస్. రఘురామసింగ్ [సికింద్రాబాద్]

## ముగ్గురు మూర్ఖులు

నేను మీ పత్రికను పొగడుతూ వ్రాసినయెడల ఈ జాబు మీరు ముందుగా ప్రకటిస్తారను కొంటాను. కాని విమర్శ చేయాలని నా మనస్సు కోరుతున్నందువల్ల ఈ ఉత్తరంలోని సారాంశం చివరిగా అయినా వేస్తారని అనుకొంటాను. వెయ్యక పోయినా ఫరవాలేదు. కనీసం మీకైనా తెలుస్తుంది. ఇక అసలు విషయాని కొస్తాను. ముగ్గురు మూర్ఖులు అను శీర్షిక మీరు మన ప్రధానమంత్రి అయిన శ్రీమతి ఇందిరాగాంధిని దుయ్యబట్టడానికేనా ఏర్పరిచినది అని అనిపిస్తున్నది. మీకు ఆమె మీద ఎంతఅయినా కక్ష వుండవచ్చుగాక. ఒక అత్యున్నత పదవిలో వున్న ఆమెను మీరు వివేకహీనురాలు అని అనటం ఉచితం కాదేమో. [తేది. 12—2—71 తిరగెయ్యండి] మన కిష్టమైన వారినే పొగడడం [శ్రీ రాజాజీని, స్వతంత్ర పార్టీ భావాలను మీ పత్రిక తరచూ శ్లాఘిస్తూ వ్రాస్తుంది] గిట్టని వారి మీద చెడు రాతలు వ్రాయడం ఎంటి వాటికే మన పత్రికలు బానిసలయి పోయాయా అని నా బోటి పాఠకుడికి అనిపిస్తుంది. పైదే నిజమైతే మద్రాసు సభలో శ్రీ స్వామినాథన్ చెప్పినట్లు పత్రికా స్వాతంత్ర్యము మీద కొన్నిత కంట్రోలు వుండడమే మంచిదేమో. నా ఉద్దేశ్యం పత్రికలలో భావాలు రెండు ప్రక్కలా ప్రతిబింబించ గలిగి వుండాలంటాను. మంచిని, చెడును పత్రికలలో ప్రకటించి వాటి నిర్ణయాన్ని, పాఠకులకి వదిలితే బాగుంటుందేమో. ఒక్క ఇందిరాగాంధి మీద ద్వేషంవల్ల పేరొందిన పత్రికలింత అధో [నీచ] స్థాయికి దిగజారిపోయినాయా అని నా బోటి పాఠకుడికి బాధ కలిగిస్తుంది. కాబట్టి దయయుంచి చెడు విషయములు వదిలి, అందరికి ఉపయోగపడే విషయములు ప్రచురించగలరని ఆశిస్తూ ఈ ఉత్తరమును ముగిస్తున్నాను.

బి. వసంతరావు, [కావలి]

# ఉత్తరాలు

మహేష్‌గారు రాసిన కాదుసుమా కథ కాదు సుమా వ్యాసం చాలా ఆనందదాయకంగా వుంది. నిశిత విమర్శలకు జోహార్.

ఈమని చిదంబరశాస్త్రి [హిందూపురం]

* * *

మహేష్‌గారు బయట పెడుతున్న నగ్న సత్యాలు నాలాంటి రాజకీయ పరిజ్ఞానములేని వారికి రాజకీయ పరిజ్ఞానాన్ని కల్గిస్తున్నాయి.

సంగం నారాయణరావు, [వాల్తేరు]

## ముఖచిత్రం

పత్రిక చాలా బాగున్నది. విజయనిర్మల ముఖ చిత్రం ముచ్చటగా నున్నది.

అతని లక్ష్యం ఏమిటో ఇప్పుడు పూర్తిగా అర్థమైనది.

తోటకూర నాగేశ్వరరావు, [పాండిచ్చేరి]

## కార్టూన్

5—2—71 పత్రికలో 44 లో పురిచెర్ల కార్టూను చూడగానే చాలా బాధ వేసింది. రెండవ రాకెట్టుపై ఇండియా అని వ్రాయకపోతే ఆ కార్టూను ఒక మాదిరిగ నవ్వు తెప్పించేది కాని ఇండియా లని వ్రాసి ఆయన తనకుగల గాఢమైన దేశభక్తిని వ్యక్త పరచారు.

పట్టాభిరాం బి. ఏ., సూర్యప్రసాద్ బి కామ్., శేషా ప్రసాద్ బి. కామ్., రఘురాం [కాకినాడ]

* * *

21—9—71 సంచిక 18 వ పేజీలోని కార్టూను [తులసీరాంగారు వేసినది] లో— మానేస్తే వచ్చే జన్మలో దున్నపోతు కడుపున పుడతా నేమో......... అని ఉంది. ఇది తప్పు— దున్న పోతై పుడతాను అని ఉండాలి. పొగ తాగనివాడు దున్నపోతై పుట్టున్ అనిగాదా గిరీశం చెప్పాడు?

ఎ. వి. ఆర్. అన్నపూర్ణ, గుంతకల్లు]

## గేయం

పరిమళ గారి లేదేదీ కవితా వస్తువు చదివాను. నే నిప్పుడు ఏం వ్రాయాలి? ఏం వ్రాద్దామన్నా అన్నీ ఒకసారి ఎక్కడో, ఎప్పుడో, చదివినదే, విన్నదే ననితోస్తుంది. ఏ వస్తువు తీసుకున్నా సెకెండ్ హేండ్ గానే కనిపిస్తోందని వ్రాస్తున్నారు. అందులో ఎంత యధార్థమున్నా రచయిత్రి మరీ అంత నిరాశ చెందకూడదు. ఆమె నిట్టూర్పులు, నిస్పృహలు తోటి రచయితలలో అలజడిని, అశాంతిని కలిగిస్తా యని గుర్తించాలి. ఏ స్పాటు తట్టినా పాతగానే కనిపిస్తుందన్నారేగాని ఆ పాతలో కొత్తను సృష్టించి ప్రతి స్పాటులో ఒక నూతనత్వాన్ని చూపించటాని కెందుకు కృషి చేయరు. ఆ ఆలోచనే వచ్చివుంటే ఈ కవితే వ్రాసేవారు కాదేమో! ఏమైనా ఇలాంటి నిరాశా పూరితమైన కవితలు వ్రాయటం, నలుగురి దృష్టికి తేవటం ప్రతి రచయితలోని దిగులును పుట్టించటం రచయిత్రికి న్యాయంకాదని మనవి చేస్తున్నాను.

—అడపా రామూజీ, [విశాఖ]


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 26—2—'71
శ్రీసాధారణనామ సం॥ ఫాల్గునమాసం॥ బ॥పాడ్యమి
సంపుటము : 64 సంచిక : 25

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం
'ధ్రువతుడు'లో లక్ష్మి.


అఖిల భారత పుష్ప ప్రదర్శన
క్రొత్త కాంగ్రెసు
పాత కాంగ్రెసు
స్వతంత్ర
జనసంఘ్


ఓటు
బెంగాల్
భయం
కశిగు ప్లేట్లోనుంచి విడిచిపెడితేగాని ఎలా వోటు చెయ్యను?
ఆంధ్రప్రదేశ్‌లో లోక్‌సభ స్థానాలకి తెకులలేని అభ్యర్థులు


వోటరు
బూటకపు ప్రమాణాలు

# రాజధానిలో పారిశ్రామిక ప్రదర్శనం

ము ప్పై సంవత్సరాల క్రితం పబ్లిక్ గార్డెన్సులో పారిశ్రామిక ప్రదర్శనానికై అప్పటి నిజామ్, నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రారంభోత్సవం చేశారు. ఉస్మానియా పట్ట భద్రుల సంఘంచేత ఏర్పాటుచేయబడిన ఈ ప్రదర్శనం ముల్కీ [దేశీయ] పరిశ్రమలను ప్రోత్సహించడానికి ఉద్దేశింప బడింది చాలా చిన్నస్థాయిలోనున్నా ఆనాడు కూడా వినోదం కాలక్షేపం కోసం పట్టణ ప్రజలు ఈ ప్రదర్శన సందర్శనంకోసంవచ్చేవారు. 1948 సెప్టెంబరులో పోలీసు చర్య జరిగి అప్పటికి హైదరాబాదు రాష్ట్రం భారత యూనియన్‌లో పూర్తిగా విలీనమైన తరువాత ఈ 'ముల్కీ నుమాయిష్,' అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనమై గాంధి భవన్‌కు వెనుకగా నున్న విశాలమైన ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో ప్రతిసంవత్సరం జరుగుతూ వేలు లక్షల సంఖ్యలో చూపరుల నాకర్షిస్తూ రాజధాని నగర పౌరుల జీవనంలో మరుపురాని భాగమై పోయింది.

## అయినువారాల ప్రదర్శన

రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వం కూడా పదివారాలపాటు జరిగే ఈ ప్రదర్శనాన్ని తమ కార్యకలాపాలను ప్రచారం చేసుకోవడానికి, వివిధరంగాల్లో దేశ ప్రగతిని గూర్చి ప్రజలకు తెలియ జేయడానికి ఉపయోగించు కుంటాయి. ఇక స్థానిక పరిశ్రమల విషయము చెప్పనక్కర లేదు. కుటీర పరిశ్రమలు, భారీ పరిశ్రమలు, మన రాష్ట్రం మిగతా దేశ నలుమూలలనుంచి ప్రత్యేకమైన స్టాల్సు తీసుకుని విరివిగా అమ్మకం ప్రచారం సాగిస్తాయి. రాజధానిలోని ప్రతి కుటుంబం ఒక్కసారియైనా ప్రదర్శనానికి వెళ్లి రాలేకపోతే పెద్దలోటుగా భావిస్తారు. ప్రదర్శనాన్ని చూడటానికి వచ్చే వారి తోను, వారిని చూడడానికి వచ్చే వారితోనూ, ప్రతి సాయంత్రం ప్రదర్శన మంతా కిటకిట లాడుతూ వుంటుంది.

ఉస్మానియా పట్ట భద్రుల సంఘం ఏర్పాటు చేసిన ప్రదర్శన సంఘం ఈ ప్రదర్శనాన్ని యేటా ఏర్పాటు చేస్తుంది. దీనికి ప్రతి సంవత్సరం మంత్రిని అధ్యక్షుడుగా ఎన్నుకోవడం రివాజు. దీనివల్ల ప్రయోజనం లేక పోలేదు. ఒక మంత్రి అధ్యక్షుడుగా ఉన్నారంటే ప్రభుత్వం శాఖల నుంచి సహకారం ఏ కష్టం లేకుండా లభిస్తుంది. ఐదారు సంవత్సరాల క్రితం వరకూ ఈ ప్రదర్శనం ఏర్పాటు జరిగే విశాల స్థల విధానం గూర్చి ప్రభుత్వానికీ ఎగ్జిబిషన్ సొసైటీకి మధ్య వివాదం జరుగుతూ వుండేది. ఆ స్థలంలో నున్న పదిహేను ఇకరాలు ఎకరాలు భూమి ప్రభుత్వానిది. ఇతమై రెండు సంవత్సరాల క్రితం ఈ స్థలంలో ఎసెంబ్లీ భవనాన్ని నిర్మించాలని హైదరాబాదు ప్రభుత్వం నిశ్చయించింది. నిజాం నవాబు ఎసెంబ్లీ భవనానికి శంఖుస్థాపన కూడా చేశారు. కాని ఎందు చేతనో ఈ భవన నిర్మాణం చేపట్టడం జరుగలేదు. ఇంతలో హైదరాబాదు సంస్థాన భవిష్యత్తునే మార్చివేసే రాజకీయ మార్పులు చాలా జరిగాయి. మొదటి సార్వత్రిక ఎన్నికలు జరిగి ప్రజా ప్రభుత్వం ఏర్పడిన తరువాత పబ్లిక్ గార్డెన్సులో తయారుగా నున్న టవును హాలుని ఎసెంబ్లీ హాలుగా వాడుకొనడానికి నిశ్చయించారు. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత కొత్త సచివాలయ భవనం కట్టాలన్న తలంపు కలిగి నప్పుడు ఎగ్జిబిషన్ గ్రౌండ్సుపై ప్రభుత్వం కన్ను పడడంలో వింత లేదు కానీ, ఎగ్జిబిషన్ సొసైటీవారు అందరి పలుకుబడి గల సభ్యులు చేసిన ఆందోళన ఫలితంగా ప్రభుత్వం తన అభిప్రాయాన్ని మార్చు కున్నది. ప్రదర్శనం కోసం కొత్త స్థలాన్ని వెదుక్కోవలసిన అవసరం ప్రస్తుతానికి లేకుండా పోయింది.

ఎగ్జిబిషన్ సొసైటీ కూడా కేవలం ప్రదర్శనాన్ని ఏర్పాటు చేయడంతో తృప్తిపడక ఏటా వస్తున్న ఆదాయాన్ని నిర్మాణాత్మకంగా ఉపయోగించ నారంభించింది. తమ ఆదాయంలో ఈ సొసైటీ వారు స్త్రీల కోసము కమలా నెహ్రూ పాలిటెక్నిక్ ప్రారంభించారు. మూడంతస్తుల భవనంలో, ఈ పాలిటెక్నిక్ బాలికలకు సాంకేతిక శిక్షణ నిస్తూ సేవ చేస్తున్నది. స్త్రీల కోసం ఒక కళాశాలకూడా వీరు నిర్వహిస్తున్నారు.

## 7.5 లక్షల ఆదాయం

ఈ సంవత్సరం 14 లక్షల మంది ప్రదర్శనాన్ని చూడడానికి వచ్చారు. ప్రవేశ టిక్కెట్ల ద్వారా ఇతర పద్దులపైన నిర్వాహకులకు రూ 7.5 లక్షలు ఆదాయం వచ్చింది. మొత్తం 1600 విక్రయ శాలలు, ప్రదర్శన శాలలు ఏర్పాటు చేశారు. పూర్వం కంటే ఈ సంవత్సరం విక్రయ శాలల అలంకరణ ఆకర్షణీయంగా ఉంది. ఎక్స్‌పో 70ని దృష్టిలో పెట్టుకుని స్టాల్సు అలంకరణ జరిగిందని ఎగ్జిబిషన్ సొసైటీ గౌరవ కార్యదర్శి డాక్టరు కమల్‌చంద్ర భావిస్తున్నారు. ప్రతి సంవత్సరంలాగే ఈ సంవత్సరం కూడా అఖిల భారత ప్రాతిపదికపైన ఇన్వెన్షన్ పోటీ జరిగింది. ఈ పోటీల్లోను, అఖిల భారత పశు ప్రదర్శనం, పౌల్ట్రీషో, డాగ్ షోలో పాల్గొన్న వాటిలో అత్యుత్తమంగా ఎంపిక చేసిన వాటికి బహుమతుల నిచ్చారు. వీటి విలువ రూ. 43,000 క్రీడోత్సవాలు, పోటీలు, గులాబీల ప్రదర్శనం లాంటివికూడా జరిగాయి. కాని ఈ సంవత్సరం చిత్రకళా ప్రదర్శనం జరిగినట్టు లేదు. ప్రజలను బాగా ఆకర్షించే దేవాదాయశాఖవారి ఆలయం కూడా కనిపించలేదు. ఎగ్జిబిషన్ గ్రౌండ్సులోనే ఒక నాటక ప్రదర్శనశాలను నిర్మించాలనే సంకల్పం ఎగ్జిబిషన్ సొసైటీకి ఉంది. ఈ సంవత్సరం దీని నిర్మాణం జరగవచ్చును. హెల్త్ సెంటర్ ఈ సంవత్సరం ప్రదర్శనంలో ప్రత్యేకాకర్షణని చెప్పవచ్చును. ఈ సెంటరులో కొద్ది రుసుం చెల్లించి ఎవరైనా ఆరోగ్య పరీక్ష చేయించుకో వచ్చును.

ప్రదర్శనానికి వచ్చేటప్పుడు ప్రజలు—స్త్రీలు, పురుషులు, పిల్లలు— ఎంత ఉత్సాహంతో వస్తారో వెళ్లేటప్పుడు అంత బాధ పడ్తారు. స్వంతకార్లలో వచ్చి వెళ్లేవారి సంఖ్య చాలా తక్కువ. హెచ్చు మంది. ఆర్. టి. సి. వారి బస్సులపైనే తిరుగు ప్రయాణానికి ఆధారపడ్తారు. ఆర్. టి. సి. కూడా ప్రత్యేక బస్సులను ఏర్పాటు చేస్తుంది. ఐనా అవి చాలవు. పసిపిల్లలతో కూడా వచ్చేవాళ్ళ స్థితి దయనీయంగా ఉంటుంది. బస్సుల్లో ప్రవేశం పొందడం గగనమవుతుంది. దీనికితోడు వంటిమీద సొమ్ములు జేబుల్లో డబ్బును దొంగలనుంచి రక్షించుకోవాలి. బస్సు స్టాండుల్లో జేబు దొంగల ఉనికి ఈమధ్య మరీ ఎక్కువైంది. ఇక గృహోపమ్ముల

## డా॥ కె. ఎం. మున్షి

ఫిబ్రవరి 8వ తేదీ మరణించిన కన్హయ్యాలాల్ మాణిక్‌లాల్ మున్‌షి ఒక భారతీయ మేధావులకి ప్రతినిధి అనవచ్చు. ఆయన తమ మాతృభాష అయిన గుజరాతీలో పేరు పొందిన రచయిత, న్యాయవాద వృత్తిలో ఆయన ప్రథమశ్రేణికి చెందిన వారు. భారత రాజ్యాంగాన్ని తయారు చేసిన వారిలో ఒకరు, రాజకీయాలలో ఆయన చాలాకాలంగా ప్రముఖ పాత్ర వహించారు. తమ సతీమణి లీలావతీ మున్‌షితోబాటు సంఘసేవ ఎంతో చేశారు. భారతీయ విద్యాభవన్ ద్వారా గురుకులం అనిపించే విద్యాసంస్థని నెలకొల్పారు., భారత దేశ చరిత్రని పది పెద్ద పుస్తకాలు నిండేట్లు రాయించారు, ఇతర గ్రంథాల ద్వారా వివిధ విషయాలు తెలుసుకోవాలని కోరేవారందరికీ అందుబాటులో ఉండేటు సరసమయిన ధరలకి చక్కటి పుస్తకాలని వెలువరించారు. ఇంచుమించు ఒక దశాబ్దంగా చెరామరుగు అవుతున్న రాజకీయవాదుల అల్పత్వం కీ. శే. మున్‌షి వంటి వారి మరణంవల్ల మనకి మరొకసారి స్ఫురిస్తుంది. (ఒ. వి.)

శైన ప్రయోజనాల సంఖ్య బాగా ఉన్నప్పుడు వీరికి అడ్డు ఉండదు.

## ఎన్నికలూ ఆందోళనలూ

ఎన్నికలు వచ్చినప్పుడు సమ్మెలు, ఆందోళనలు, ప్రభుత్వోద్యోగుల బెదిరింపులు మామూలే. ప్రభుత్వోద్యోగుల కోరికలు అసమంజసమైనవి, ప్రభుత్వ శక్తికి మించినవని చెప్పే ప్రభుత్వం కూడా ఎన్నికల ముందు ఎంతో సానుభూతిని ప్రదర్శిస్తుంది. క్రితం శాసనసభా సమావేశంలోనే, అనావృష్టి మూలంగా పంటలు దెబ్బతిన్న ప్రాంతంలో రియాయితీలు ఇవ్వాలని సభ్యులు కోరితే, అలా కోరకండి. ప్రభుత్వ ఆయ వ్యయ పరిస్థితి ఏమంత సంతృప్తికరంగా లేదని చెప్పిన ప్రభుత్వం ఎన్ని సహాయ చర్యలను తీసుకుంటున్నదో చూడండి. చేనేత పారిశ్రామికులకు నూలుపైన పన్ను తొలగించారు. అమ్మకం పన్ను కన్సెషన్లు ఇచ్చారు. సమ్మె చేస్తామని బెదిరించిన ప్రైవేటు కళాశాలల అధ్యాపకులకు, కొన్ని నెలలకుగా రావలసిన వేతనాల బాకీలకు గాను రూ. 60 లక్షలదాకా నిధులను విడుదల చేశారు. ఐనా వారు సమ్మె చేస్తున్నారు. అది వేరే విషయం. ఇదే అదునునుకొని ప్రభుత్వోద్యోగులు కూడా ఆందోళన ప్రారంభించారు. ఇంత వరకు ఆంధ్ర తెలంగాణా అని కీచులాడుకున్న వారంతా కలిసి ఆలజడి ప్రారంభించారు. సచివాలయోద్యోగులు ఇతర సిబ్బంది ఈ వారం నగరంలో తమ కోరికల నంగీకరించమని నినాదాలు చేసుకుంటూ వూరేగింపు చేశారు. అన్ని తరహా ఉద్యోగులు కలిసి ఒక సంయుక్త కార్యాచరణ సంఘాన్ని నెలకొల్పుకున్నారు. కేంద్ర ప్రభుత్వ సిబ్బందితో సమానంగా తమ వేతనాలను పెంచాలనేది వీరి ప్రధానమైన కోరిక. కాని ఇంటి అద్దె అలవెన్సు, కరువుభత్యం హెచ్చుదల మొదలైనవి ప్రస్తుతం వారు కోరుతున్నారు. ఇతర రాష్ట్రాల్లోలాగా మన రాష్ట్రంలో కూడా సిబ్బందుల సమస్యలు శాశ్వతమైనవి. వీటికి అంతమంటూ ఉండదు. ప్రభుత్వం కూడా వేతనాలను సవరించేటప్పుడు ఏదో లోపం చేస్తూ ఉంటుంది ముందు వేతనాలను హెచ్చించాలని ఆందోళన జరుగుతుంది. ఆ తరువాత ఈ హెచ్చు వేతనాల్లోని లోపాలను అవక తవకలను సవరించాలని ఆందోళన ప్రారంభమవుతుంది. ప్రభుత్వం ఎప్పటికప్పుడు ప్రభుత్వ ఆర్థిక వనరుల స్థితి ఏమంత బాగా లేదనీ, ఉద్యోగుల ఆందోళన తగదని ప్రకటనలు చేస్తూనే, వారి కోరికలను ఎంతో అంత అంగీకరిస్తూ ఉంటుంది. ప్రభుత్వ ఆదాయం ప్రతి సంవత్సరం పెరుగుతటనే ఉంది. దానితో సిబ్బంది వేతనాల క్రింద ఖర్చు పెరిగి పోతున్నది. ఆదాయంలో 25 శాతం వేతనాల క్రింద పోతున్నదని ఒకప్పుడు ప్రభుత్వం ప్రకటించింది. దీన్ని ఉద్యోగుల సంఘంవారు ఏమాత్రం అంగీకరించలేదు. బహుశా ఇద్దరి వాదం నిజమైనదే. ప్రభుత్వానికి ఖర్చు పెరుగుతున్నది. సిబ్బందికి ధరల హెచ్చుదల మూలంగా జీవనం భారమై పోతున్నది. ఈ రెంటితోపాటు మరో నిజమేమిటంటే—ప్రభుత్వ కార్యాలయాల్లో జాగు, అసమర్థత, అవినీతి పెరుగుతున్నది.

—వి. నాగేశ్వరరావు ●

# ఇంజనీర్ల ఫిర్యాదు లేక మినిష్టరా మీటింగా?

రాష్ట్ర నీటిపారుదల శాఖామంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి కొందరు సూపరింటెండింగ్ ఇంజనీర్లను కొద్ది రోజుల క్రితం విజయవాడలో నిష్కారణంగా అవమానించడం పట్ల తీవ్ర ఆవేదనను, నిరసనను ప్రకటిస్తూ రాష్ట్ర ఇంజనీర్ల సంఘం ఒక తీర్మానం చేసింది.

మంత్రి అవమానించిన ఇంజనీర్లలో ఇంజనీర్ల సంఘం అధ్యక్షుడు కూడా వున్నందున శ్రీ సిద్దారెడ్డి తమ వ్యాఖ్యానాలను ఉపసంహరించుకోవాలని తీర్మానంలో కోరారు.

తీర్మానం ప్రతులను రాష్ట్ర గవర్నర్‌కు, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి ఇతర మంత్రులకు కూడా పంపడం జరిగింది. శ్రీ సిద్దారెడ్డి జనవరి 16న విశాఖపట్నం పోతూ విజయవాడలో కొంత సేపు ఆగారు. అయితే ఆయన విజయవాడకు వస్తున్నట్టు ముందుగా పర్యటన కార్యక్రమం విజయవాడలోని సూపరింటెండెంట్ ఇంజనీర్లకు పంపలేదని, 15వ తేదీ రాత్రి మాత్రం 16న శ్రీ సిద్దారెడ్డి, విజయవాడకు వస్తున్నట్టు, మంత్రి అంతరంగిక కార్యదర్శి ఫోన్‌ద్వారా తెలిపారని ఇంజనీర్ల సంఘం పేర్కొన్నది.

అయితే రాష్ట్ర ఇంజనీర్ల సంఘం వార్షిక సమావేశం ధవళేశ్వరంలో జరపడానికి అప్పటికే నిర్ణయించబడినందున, విజయవాడలోని సూపరింటెండెంట్ ఇంజనీరు రాష్ట్ర సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికైనందున ఆరోజున, వారు ధవళేశ్వరం వెళ్ళడం తప్పనిసరి అయిందని, అప్పటికి విజయవాడలో గల ఇతర ఇంజనీర్ల ద్వారా మంత్రి పర్యటనకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయించామని ఇంజనీర్ల సంఘం వివరించింది.

తరువాత జనవరి 20 న మంత్రి విశాఖపట్నంనుంచి విజయవాడ వచ్చారు. విజయవాడలోని ఇంజనీర్లందరూ మంత్రికి గన్నవరం విమానాశ్రయంలో స్వాగతం చెప్పి ఆయనతో పాటు ప్రభుత్వ అతిథిగృహానికి వచ్చారు. అతిథి గృహంలో మంత్రి అనేక మంది ఇతర వ్యక్తుల ముందు విజయవాడ సర్కిల్ సూపరింటెండింగ్ ఇంజనీరును, నాగార్జున సాగర్ కాల్వల సూపరింటెండింగ్ ఇంజనీరును బజారులో తిరగడం అయిందా? ఇంకా పెళ్ళిళ్ళకేనా వెళ్ళిరావడానికి? అని శ్రీ సిద్దారెడ్డి అడిగారు.

16న మీరు ఎక్కడికి వెళ్ళారని ఆతర్వాత శ్రీ సిద్దారెడ్డి వారిని ప్రశ్నించారు. తాము, ధవళేశ్వరం వెళ్ళామని నాగార్జునసాగర్‌కాల్వల సూపరింటెండింగ్ ఇంజనీర్ చెప్పారు.

మంత్రి: మీకు మంత్రి ఎక్కువా? సమావేశం ఎక్కువా? మీకు నా కార్యక్రమం రాలేదా?

ఎస్. ఇ.: మీ పర్యటనకార్యక్రమం ముందుగా నాకు చేరలేదు.

మంత్రి: మరి అయితే మీ అసిస్టెంటు ఇంజనీర్ నాదగ్గర కెట్లా వచ్చాడు?

ఎస్. ఇ.: నాకార్యదర్శి తరువాత అతనికి చెప్పాడు.

మంత్రి: విజయవాడ సర్కిల్ పి. డబ్ల్యు. డి. ఎస్. ఇ. కి నా కార్యక్రమం చేరిందా?

ఎస్.ఇ.: అది నాకు తెలియదు.

మంత్రి: (పి. డబ్ల్యు. డి. ఎస్. ఇ. వైపు చూస్తూ) నాకార్యక్రమం మీకు వచ్చిందా?

పి. డబ్ల్యు. డి. ఎస్. ఇ: అది నాకు చేరింది. అయితే నేను ధవళేశ్వరం పోవలసిన అత్యవసర కార్యక్రమం వుంది.

మంత్రి: మీరంతా బాధ్యతా రహితులు. ఎస్. ఇ. లు మందబుద్ధులు (ఇడియట్‌లు),,, దుర్మార్గులు (రోగ్‌లు), ఇక్కడవున్న ఎస్. ఇ. లు అంతకంటే భ్రష్టులు.

ఎస్. ఇ.: (నాగార్జున సాగర్ కాల్వలు): మీరు ఏమైనా అనండిగాని ఇడియట్లు, రోగ్స్ అని, అనడం సరికాదు. మమ్మల్ని అట్లా అనడానికి వీలులేదు.

మంత్రి: (కారులోకి ఎక్కుతూ) సరే! నేను చూస్తాను. (ఇ. వి.




'ఏమండీ, ఏమన్నాన్నే! యిందాకట్నించీ పిలుస్తూంటే వినబడదా ఏమిటండీ!' పైటకొంగుకు చేతుల్లు తుడుచుకుంటూ వచ్చింది మీనాక్షి.

'ఆ! ఏమిటే,' అంటూ దిద్దుతూన్న పేపరు ప్రక్కనపెట్టి, తలెత్తారు రామ శర్మగారు.

'ఇప్పటికైనా పలికారు. సరేగానీ, ఈ పూటకింక భోంచేస్తారా? టైమెంత యిందో తెలుసా?' ప్రక్కనేవున్న మంచం మీద కూర్చుంటూ అంది మీనాక్షి.

'ఏంటైందేమిటే? పన్నెండున్నరేగా? ఇదుగో యింకో అయిదు పేపర్లు. దిద్దేగానే లేస్తాను.' అంటూ కళ్ళజోడు వోసారి తుడిచి తగిలించుకుని, తిరిగి పేపర్లు దిద్దడంలో మునిగిపోయారు శర్మగారు.

'ప్రొద్దున్న కాఫీతాగిన మనిషి, యింత వరకూ భోజనానికి లేవలేదు', ఆయనవైపే వీక్షణం చూచి, ఏమిటో యీ మనిషి అన్నట్టు వో నిట్టూర్పు విడిచింది మీనాక్షి. ఔనుమరి! యిన్నేళ్ళుగా కాపరం చేస్తున్నా ఆయన్ని అర్థంచేసుకోలేకపోతోంది ఆవిడ.

'ఎప్పుడూ స్కూలూ, పిల్లలూ వుంటే చాలీయనకి. కనీసం ఆదివారమైనా రెస్టు తీసుకోరు. పేపర్లు దిద్దుకోవడమో, లేక పోతే ఏ పిల్లాడోవచ్చి యిది అర్థంకాలేదు మాస్టారూ—అంటే వాడికి విడమరచి తలకెక్కేట్టు చెప్పడమో, అదీ లేకపోతే, స్కూల్ లైబ్రరీలో పిల్లలకి అవసరమైన పుస్తకాలు యింకా ఉండాలంటూ ఆవిషయం మాట్లాడ్డానికి ప్రసిడెంటుగారింటికి వెళ్ళడమో ఏదో ఒకటి. అంతేగాని, యింటి విషయాలు పట్టించుకోవాలని ఏమాత్రం ఉండదు. పైగా యీ టీచరుద్యోగమే ఘనమైందనీ, అది దొరకడం అదృష్టమనీ, ఆయన అభిప్రాయం. ఏమిటో, జిహ్వాకో రుచీ, పుర్రెకో బుద్ధీ. ఒకరు చెప్తే వింటారా? ఆయనిష్టమే ఆయన్ది. ఏపనీ పట్టించుకోరు. నెల తిరిగొచ్చేసరికి ఆ జీతంరాళ్ళుమాత్రం తన చేతిలో పడేసి చెయ్యి దులిపేసుకుంటారు. అంతా తను దిద్ది, యీ సంసారాన్నిలా గుట్టుగా లాక్కొస్తూందిగానీ లేకపోతే యిద్దరాడపిల్లల పెళ్ళిళ్ళలా అయ్యేవి? మగపిల్లాడు డిగ్రీ ఏం చదివేవాడు?...'

'ఇందాక నన్నన్నావ్? యిప్పుడు నువ్వు చేసిందేమిటే? రెండుసార్లు పిలిచినా, పలకనంతగా ఏం ఆలోచిస్తున్నావ్?' అన్న రామశర్మగారి మాటలకి, ఉలిక్కిపడి, ఆలోచనలోంచి తేరుకుంది మీనాక్షి.

'ఆలోచించడానికేంవుందిగానీ, లేవండి భోజనానికి' అంటూ లేచి వంటింటి వైపు వెళ్ళింది మీనాక్షి.

ఆవిడ వెనకే వెళ్ళారు శర్మగారు. భోజనం ముగించి వచ్చి వాలుకుర్చీలో పడుకుని, ఆవాళిటి పేపరు తిరగేయడం ప్రారంభించారు.

'టెలిగ్రామ్!' అన్న కేకకు ఒక్కసారిగా తృళ్ళిపడ్డారు శర్మగారు. వంటగది నుండి బయటికి వస్తూన్న మీనాక్షి ఉలిక్కిపడి తలుపును ఆధారం చేసుకుని నిలబడింది.

మనసులోనే దడని అణుచుకుంటూ సంతకంచేసి, టెలిగ్రామ్ తీసుకున్నారు. చదివినంతసేపూ చేతులు వణికాయి. చదవగానే బరువు దించినట్టుగా తేలిగ్గా నిట్టూర్చారు. అంతవరకూ కొయ్యబారి పోయినట్టు తలుపుకు జేరబడిపోయిన మీనాక్షి 'ఎక్కడ్నుంచండీ! త్వరగా చెప్పండీ' అంది వణుకుతూన్న కంఠంతో.

'కంగారేమీ లేదే. అబ్బాయిదగ్గరినుండి. యెల్లుండి వస్తున్నాట్ట !' అన్నారు శర్మగారు.

'వచ్చేవాడు రాకూడదూ ? టెలిగ్రామ్ కూడా దేనికి ? గుండెల్లో దడపుట్టి చచ్చాను' విసుగుతోపాటూ కోపంకూడా ప్రతిధ్వనించింది ఆమె మాటల్లో.

'క్రిందటిసారి వచ్చినప్పుడు చెప్పాడుకదే వాడు ? ఈసారి వచ్చేముందు తెలుపుతాను. ఆఫీసు కాగితాలు రామచంద్రంగారి దగ్గరినుండి తీసికొచ్చి వుంచితే నేను తీసుకెళతాను. ఎక్కువ శెలవు ఉండదు అందుకని—అని. ఆ కాగితాలేవో మనం తెచ్చి వుంచితే సరి.' దండెంమీది కండువా తీసుకుంటూ అన్నారు శర్మగారు.

'ఎక్కడికి ప్రయాణం?' అడిగింది మీనాక్షి.

'అడిగావూ ? యిక పని అయినట్టే' నవ్వుతూ చెప్పుల్లోకి కాళ్ళు దూర్చారు శర్మగారు.

'అడగకపోతే నాకెలా తెలుస్తుంది? ఎక్కడికెళ్తుందీ చెప్పారు గనకనా?' నిష్ఠూరంగా అన్న మీనాక్షి మాటలకు లోలోపల నవ్వొచ్చింది శర్మగారికి.

'అయిందా దెప్పడం ? అయినా యింట్లో ఏం తోస్తుంది చెప్పు? అలా రామచంద్రంగారింటికి వెళ్ళి ఆ కాగితాల సంగతి కనుక్కొస్తాను. తలుపేసుకో.' అంటూ వీధివైపు నడిచారు.

'రేపు కనుక్కోకూడదు కాబోలు ! లేడికి లేచిందే పరుగు' గొణుక్కుంటూ, తలుపు గడియ వేసింది మీనాక్షి.

నొళ్ళు అలసటగా ఉండి, మంచంమీద నడుం వాల్చింది. నిద్రయితే రాలేదుగాని, ఏవో ఆలోచనలు మాత్రం చుట్టుముట్టాయి.

'అమ్మాయి వసుంధర ఏం చేస్తూ వుంటుందో ? అదేమిటోగానీ, ఎప్పుడూ అదే గుర్తుకొస్తుంది. దాని మీదికే మనసు పోతుంది. పిల్లలతో చేసుకోలేక ఏం అవస్థ పడుతూందో ఏమో ! కొంపలో పెద్దదిక్కు వుంది గనకనా? ఒక్కత్తీ అన్నీ దేవుళ్ళాడాలి పెళ్ళవకముందు ఒక్కపనీ చేతయ్యేదికాదు. అయినా పని కావడానికి ఏనాడైనా దానిచేత చేయిస్తేగా? నడిస్తేనే అరిగిపోతుందేమో అని భయపడే తను యింక పనులేం చేయిస్తుంది? అంత అబ్బురంగా పెంచినా చివరికి పెళ్ళిచెయ్యక తప్పలేదుకదా? ఆ పల్లెటూళ్లో వో సినిమాయా, షికారా? ఎప్పుడూ యింట్లో ఎలా పడివుంటోందో? దగ్గిరేకదా? పిల్లల్ని తీసుకుని నెలకోమారైనా రావే అంతే రాదుగా? పైగా ఆయన ఒప్పుకోరు. నేను లేకపోతే ఆయనకేం తోస్తుంది?—అంటుంది. ఆమాటా నిజమే. చిన్నప్పటి నుండీ యిదే దగ్గరున్నట్టు అసలెక్కడికీ పంపడు వాళ్ళాయన. పంపినా, వోరోజు, రెండ్రోజులు. అంతకుమించి ఉండనివ్వడు. పోనీ, అత్తగారికి యిదంటే ప్రాణం. వో నెల్రోజులు ఉండమని పంపిద్దాం అన్నధ్యాసే ఉండదు అల్లుడికి. అయినా పెద్దవాళ్ల యిష్టాలు చిన్నవాళ్లు తీర్చాలని ఎక్కడుంది ? పోనీ...పంపనందుకూడా తనకి బెంగలేదు. అది ఎక్కడున్నా సుఖంగా వుంటేచాలు. అది సుఖపడుతోందని తనకి తోచడంలేదు. మూడొందలు వస్తేమాత్రం ఏం సరిపోతుంది? ఆ చాలీచాలని జీతంతో, ముగ్గురిపిల్లల్ని ఆ సంసారాల్ని నెట్టుకొస్తోందో ! పుట్టింటినుంచి ఏదీ యిచ్చే ఆశలేదు. వచ్చినప్పుడు వోచీర పెట్టడమే తమకి గగనం. ఊరికే చీరలూ సారెలూ ఎక్కడ్నుంచి వస్తాయే? మనకేమైనా ఆస్తులా పాస్తులా ? అంటారాయన ! ఆయనకేం, అంటారు. మరి తనలా దులిపేసుకోలేదే ! ఆడపిల్ల పుట్టింటిమీద ఎంత ఆశ పెట్టుకుంటుంది ? ఉన్నా లేకపోయినా వో చీరైనా పెట్టకపోతే చూచేవాళ్లు ఏమనుకుంటారు? అదేమాట ఆయనతో అంటే — ఏమనుకుంటారేం ? అనుకుంటే అనుకోనీ. మనకి శక్తిలేదు. ఏదో ఉన్నదానిలో కట్నం యిచ్చి పెళ్లిచేసి, వోయింటిదాన్ని చేశాం. ఎల్లకాలం పెట్టుపోతలు జరపాలంటే మనతో జరిగేపనా? అయినా పెద్దదానికి ఏం పెట్టేస్తున్నాం? పెళ్లయ్యాక పట్టుమని పదిసార్లైనా వచ్చిందా ? ఒకసారైనా జాకెట్టుముక్క పెట్టామా ? అది మెట్టిన కుటుంబం మంచిది గనక ఏమీ అనుకోరు—అంటారాయన. ఔను, అంటారు. ఆయన మనసంతా పెద్దకూతురిమీదే. అంటే ఆయనకి కోపం వస్తుందిగాని, చక్కా మొగుడూ పెళ్లాం యిద్దరూ సంపాదిస్తున్నారు. ఇంక వాళ్లకు పెట్టేదేమిటి? ఆమాటే వోసారి తను ఆయనతో అంటే,—చాల్లేవే,యిద్దరూ సంపాదిస్తే మాత్రం? ఆ సంపాదనమీద ఎంతమంది బ్రతకాలో తెలుసా? అత్తా, మామా, యిద్దరు మరుదులు, యిద్దరు ఆడబడుచులు. వీళ్లు మొగుడూపెళ్లాం. కొడుకూ నీ చిన్నకూతురికేం తక్కువ ? మూడొందలు సంపాదిస్తున్నాడు అల్లుడు. సొంతయిల్లు, రెండెకరాల పొలం చాలదా? దీనికన్నా బాగా జరుగుతోందా సీతకి? — అన్నారు. మాటకదిపితే సీతని వెనకేసుకు రావడం. వసుంధరంటే ప్రేమ లేదాయనికి. తను ఉండిమాత్రం ఏం పెట్టగలుగుతోందీ ? ఈసారైనా దసరాకి రమ్మని వ్రాసినా, యింకా జవాబైనా రాలేదు...' ఆలోచిస్తూనే కునుకు పట్టేసింది మీనాక్షికి.

* * *

'వాడు వస్తాడు, వస్తాడు అంటూ మొన్నంతా కాళ్లరిగేలా ఆ రామచంద్రంగారి యింటిచుట్టూ తిరిగారు కాగితాలకోసం. ఏదీ వాడురాలేదేం? వాడిపని గనక అలా తిరిగి సాధించారు. అదే వసుంధరకొడుక్కి మార్కులు వేయించమంటే, చేతిలో వున్న పనే చెయ్యలేదు.' అక్కసంతా వెళ్ళగక్కుతూ అంది మీనాక్షి.

'నీకేమున్నా మతిపోయిందేమిటే? వాడు ఏం పని వుండిరాలేక పోయాడో? అయినా నష్టమేముంది ? పోస్టులోనే ఆ కాగితాలు పంపిస్తేసరి. అయినా, మాట్లాడితే చాలు, వసుంధర కొడుకు మార్కులసంగతి తెస్తావెందుకు? మార్కులు వేయింనుకుని పాసయిందీ వో చదువే ? నా కిష్టం ఉండవు అలాంటిపనులు. నా కిష్టంలేని పనిని ఒక్కనాటికి చెయ్యను.' స్పష్టంగా అన్నారు శర్మగారు.

మీనాక్షిముఖం ఎర్రబడిపోయింది. 'ఔను, ఎందుకు చేస్తారు? మీ కిష్టమైతేనే ఏదైనా చేస్తారు. ఆసంగతి [illegible] మరి పెద్దమ్మాయి పెళ్లి విషయంలో [illegible] కంటా[illegible] బలవంతం మీద పెళ్లి జరిగింది, లేకపోతే అంతమంది [illegible] ఆ యింటికి దాన్ని యిచ్చేవాళ్లా? ఆ రెండుకు? [illegible] నిలదీసి ప్రశ్నించింది [illegible] ఒక క్షణం ఆశ్చర్యంగా చూచ[illegible] వైపు శర్మగారు. ఆవిడలా ప్రశ్ని[illegible] కోలేదాయన.

'వా[illegible] తెలిసే సదావివి మీనాక్షి

# మమత-మనుగడ

సమాధానం యిచ్చేశక్తి నాకు లేదు. కాని సీత పెళ్లి విషయంలో ఎవరికెంత పాత్ర వుందో నీ అంతరాత్మకి తెలుసు.' మెల్లగా అన్న ఆయన మాటలకు మీనాక్షి ఏమీ మాట్లాడలేదు. మనసంతా ఉడికిపోతోంది.

మళ్లీ శర్మగారే అన్నారు. 'పోనీ. జరిగిపోయిన సీత పెళ్లి సంగతి యిప్పుడెందుకు? ఏదో అది హాయిగానే ఉంది, ఆ మంచి మనుష్యుల మధ్య. మనం దాన్ని గురించి అనుకుని బాధపడ్డందేనికి?'

'అంతే, అంతే. అలా అనక యింకేమంటారులెండి.' గొణిగింది మీనాక్షి.

'మీనాక్షీ!' అంటూ పక్కింటి సుందరమ్మ పిలవడం, మీనాక్షి వెళ్లడంతో, ఆ సంభాషణ ముగిసినా, శర్మగారి మనసు మాత్రం వికలమైంది. ఆరోజంతా ఏమిటోగా అయిపోయింది. స్కూల్లో పాఠాలు కూడా సరిగా చెప్పలేక పోయారు. దానికి తోడు ఆ రాత్రి మీనాక్షి చెప్పిన విషయం—

'ఏమండీ! వసుంధర ఉత్తరం రాసింది. అర్జంటుగా వో వంద పంపమంది' మెల్లగా అంది మీనాక్షి. మంచంమీద అటు తిరిగి పడుకున్న శర్మగారు యిటువైపుకు తిరిగారు. కానీ ఏవిధమైన సమాధానం రాలేదాయన నోటి నుండి.

ఆయన ప్రక్కనే కూర్చుని, ఆయన ముఖంలోకి చూస్తున్న మీనాక్షి ముఖంలో నిరాశ అలుముకుంది.

'ఏం పని బడిందో రాయలేదు. ఏదో ముఖ్యమైన పని లేనిదే వ్రాయదు.' మళ్లీ అంది మీనాక్షి. శర్మగారు వింటూనే ఉన్నారు. ఆయన మెదడు ఆలోచిస్తూనే వుంది. మనసు మాత్రం మూగవోయి మౌనంగా ఉండిపోయింది.

'ఎలాగో వోలాగ సర్దాలిమరి. ఏమంటారు? సమాధానం ఆశిస్తోంది మీనాక్షి ప్రశ్న.

ఒక క్షణం ఆగి అన్నారు శర్మగారు.

'ఏమంటాను? ఏమంటానో నీకు తెలియదా?'

'అలా అంటే ఎలాగండీ? నిజమే. మన దగ్గర డబ్బు లేదు. అలా అని ఊరుకుంటే ఎలా? కొంచెం దాని పరిస్థితి గమనించాలిగా?' ఆయన కళ్లల్లోకి చూస్తూ అన్న మీనాక్షిని అలాగే చూస్తూ, 'చూడు మీనాక్షీ! దాని పరిస్థితి అంటున్నావు. మరి మన పరిస్థితి ఎవరు చూస్తారు? ఉన్నఫళంగా వందరూపాయలు తెమ్మంటే ఎక్కడ్నుంచి తేను? బేంక్‌లో ఉన్నాయిగనకనా? ఎవడి కాళ్లు పట్టుకోను? పట్టుకున్నా యిస్తారని నమ్మకమేమిటి? అయినా ఏం చూసి అప్పిస్తారు? యిల్లా? వాకిలా? ఆక్కడికీ అప్పులకేం తక్కువలేవు. అవి తీర్చలేకే సతమతమవుతున్నాను.' అన్నారు శర్మగారు.

'ఇంతకీ డబ్బు పంపలేనంటారు. అంతేగా? వో మాటడుగుతాను, కోపం తెచ్చుకోరుగా? ఇదే అవసం సీతకి వస్తే, యింత నిర్లక్ష్యంగా వూరుకునేవారా మీరు?' మెల్లగా అన్నా, మీనాక్షి మాటల్లో వున్న వాడి గమనించకపోలేదు శర్మగారు.

'మంచి ప్రశ్న వేశావు. మీనాక్షీ! యినేళ్లనుండీ నన్నర్థం చేసుకున్నదిదేనా? సీత ఒకటీ వసుంధరొకటీనా నాకు? నువ్వే చెప్పు నన్నేంచెయ్యమంటావో' దీనంగా అంటున్న భర్తను చూచి జాలిపడలేదు. మీనాక్షి.

'ఇదేనా మీరిచ్చే సమాధానం? సరే. మీరైతే తేలిగ్గా తీసిపారేయగలరేమోగాని, నేనలా ఉండలేను. ఇవిగో యీ గాజులు తీసికెళ్లి తాకట్టుపెట్టి, డబ్బు తీసుకురండి' అంటూ చేతికున్న గాజుల జత తీసి ఆయనకందించింది.

ఏమీ చెప్పలేని స్థితిలో ఉండిపోయారు శర్మగారు.

చేతిలో గాజులు! ఎదురుగా భార్య! భార్య కళ్లల్లో పేరుకున్న కన్నీరు!

శర్మగారి మనసు కరిగి లోలోపలే నీరైపోయింది.

'చూడు మీనాక్షీ! యివి నీదగ్గరే వుంచు.' అంటూ ఆమె చేతులకు గాజులు తొడిగేశారు.

'అయితే యివి తాకట్టు పెట్టడం కూడా మీకిష్టం లేదన్నమాట! సరే, సరే మీ యిష్టం. మీ మాటకు ఎదురుచెప్పే సాహసం నాకెక్కడిది?' కటువుగా అని, బుగ్గల మీదకు జారుతూన్న కన్నీటికి, ఆనకట్టగా కొంగు కప్పుకొంది మీనాక్షి.

రెండునిముషాల భయంకర మౌనాన్ని చీలుస్తూ, 'మీనాక్షీ! పదకొండవుతోంది టైము. పడుకో. డబ్బు సంగతి రేపు చూస్తాను.' అంటూ మెడవరకూ దుప్పటి బిగించారు శర్మగారు.




# జనాభా లెక్కల సేకరణ, 1971

## మార్చి 10 నుండి 31 వ తేదీ వరకు

ఈ తేదీల మధ్య వివిధ నగరాలలోను, మారుమూల గ్రామాలలోను, పర్వత ప్రాంతాలలోను, వన్య ప్రదేశాలలోను, సముద్రాలపైన, సముద్రతీర ప్రాంతాలలోను వున్న యావన్మంది ప్రజలు లెక్కింపబడతారు.

ఈ జనాభా లెక్కల సేకరణ కార్యక్రమము మార్చి 10 వ తేదీన ప్రారంభమై 31 వ తేదీన సమాప్త మవుతుంది. ఈ లెక్కలలో ఎవరూ మిగిలిపోకుండా, ప్రతి ఒక్కరూ చేర్చబడేటట్లు చేయడానికై ఏప్రిల్ 1—3 తేదీల మధ్య మరొకమారు లెక్కించడం జరుగుతుంది. మీ కుటుంబంలోని పెద్దలు పిన్నలు—యావన్మందీ లెక్కింపబడేటట్లు తప్పక చూడండి.

జనాభా లెక్కలు సేకరించే వుద్యోగి గురుతరమైన బాధ్యతను నిర్వర్తించవలసి వుంది. కర్తవ్య నిర్వహణలో అతనికి అన్ని విధాలా సహాయపడటం మన విధి.

**జనాభా లెక్కల సేకరణ కార్యక్రమ డైరెక్టరు,**
**ఆంధ్ర ప్రదేశ్.**

ఒక్కసారి ఆనందం ఉప్పొంగిపోగా, కన్నీరు తుడుచుకుని భర్త వంక తృప్తిగా చూచి, మేనువాల్చింది మీనాక్షి.

ఆ మర్నాడు స్కూలు వదలగానే, హెడ్మాస్టరుగారి రూమ్‌కి వెళ్లారు శర్మగారు. అయిదు నిముషాలు ఆ మాటా యీ మాటా మాట్లాడి, అసలు సంగతి ఎత్తారు. హెడ్మాస్టరు జాలిగా, 'ఏమీ అనుకోకండి. మా అబ్బాయికి అవసరం వస్తే రెండొందలు నిన్ననే మనియార్డరు కట్టాను. అడిగినందుకు నా దగ్గర లేకపోయింది.' అన్నారు.

నిరాశకు ఆశ్రయం యివ్వడం శర్మగారికి అలవాటే గనుక మామూలుగానే సెలవు తీసుకుని బయటపడ్డారు.

రోడ్డు మీద నడుస్తున్నారేగాని ఆయన మెదడుని ఆలోచనలు దొలిచేస్తున్నాయి.

'ఏం జీవితం యిది? ఇదీ వో బ్రతుకేనా ? దేవుడిలాంటి నికృష్టపు జీవిని ఎందుకు పుట్టిస్తాడు? ఈ నలభై ఏళ్ల జీవితంలో ఏనాడైనా తను ఆనందంగా గడిపిన రోజుందా? ఏమో, గుర్తు రావడం లేదు. తనకి తల్లి ఎలా వుంటుందో తెలియదు. అమ్మ ఒడిలో హాయిగా నిద్రించడానికి నోచుకోలేదు తను. అమ్మ గుండెల్లోని మాధుర్యాన్ని చవిచూడలేదు. నాన్న ఉన్న ఆస్తంతా జూదంలో వోడి, దిక్కు లేకుండా నడివీధిలో తనని నిలబెట్టి, తన దారిన తాను పైలోకానికి వెళ్లిపోయాడు. మామయ్య మాటల్లో కాఠిన్యం ఉన్నా, మనసులోని మమత తనకి తెలుసు. అందుకే తనని యింతవాణ్ణిచేసి, వో దారంటూ చూపించాడు. ఈ బడిపంతులు ఉద్యోగం, జీవితానికి వెలుగు నివ్వలేకపోతున్నా, మనసుని మాత్రం ఆనందంతో నింపుంది. తను జీవితంలో ఏదైనా సాధించాను అనుకుంటే, అది యీ ఉద్యోగ విషయంలోనే. ఈ ఉద్యోగంలో తప్ప, మనిషికి యింత ఆనందం యింకెక్కడ దొరుకుతుంది? పసిపాపల ఆట పాటల్ని చూసే అదృష్టం ఎంతవారికి కలుగుతుంది? 'మాస్టారూ !' అన్న పిల్లల పిలుపులో ఎంత మాధుర్యం ఉంది! ఆ పసి మనసుల్లోని దేవుడిముందు తామెంత? వారికి నేర్పేదేమిటి? వారిలో వున్న మెరుగులు దిద్దడం తప్ప ?

# మమత-మనుగడ

చాలు, తన జీవితానికి ఆనందం చాలు. పంతుళ్ల జీవితాలకు, పిల్లలు పెట్టే నమస్కారాలు తప్ప యింకేవీ ఉండవు అంటుంది మీనాక్షి. కాని, ఆ నమస్కారాలలోని విలువ మీనాక్షికేం తెలుసు ? ఎంత గౌరవం వాటిల్లో ? ఎంత మమత ? ఎంత ఆప్యాయత ? చాలు...చాలు. అది చాలు తనకి. ఈ ఉద్యోగమే లేకపోతే ఏమైపోయేవాడో తను. ఈ బ్రతుకు గతుకుల్లో పడి ఏనాడో నలిగిపోయేవాడు.'...ఆలోచిస్తున్న శర్మగారు, రామనాథంగారిల్లు రావడం గమనించి, అటు వైపు అడుగులు వేసారు. 'ఏదో సిగ్గుగా, నామోషీగా వుంది తను వచ్చిన పని తలుచుకుంటే. రామనాథంతో తన పరిచయం యీనాటిది కాదు. చిన్నప్పుడు యిద్దరూ ఒకే బడిలో చదువుకున్నారు. ఒకరికొకరు ప్రాణంగా బ్రతికారు. అందుకనే అతని దగ్గర తనకి చనువెక్కువ.' ఆలోచనలకి బ్రేక్ పడింది.

'ఏరా! యీ మధ్యసలు కనపడ్డం మానేసావ్!' వరండాలో కుర్చీలో కూర్చున్న రామనాథంగారు పలకరించారు.

'ఏదీ, తీరుబడి దొరకడంలేదు,' అంటూ ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంటూ, 'నువ్వూ బొత్తిగా కనపడ్డం మానేశావ్' అన్నారు.

'ఇదిగో, పొలం తగాదా తీరనేలేదు. ఎటూ తేలకుండా ఉండిపోయింది. ఆ గొడవల్లో అసలు ఏ మాత్రం నాకు ఖాళీ ఉండడంలేదు.' కళ్లజోడు సవరించుకుంటూ అన్నారు రామనాథంగారు.

'ఎలా చదువుతున్నాడు సూర్యం ? హైస్కూలు విడిచిపోగానే యీ మాస్టార్ని మరిచిపోయాడా ఏమిటీ, వాడూ కనిపించడం మానేసాడు' చెట్ల మీద అరుస్తున్న పక్షుల్ని చూస్తూ అంటున్నారు శర్మగారు.

'వాడు యింట్లో ఒక్క క్షణం ఉండడు. ఎల్లుండి ఎక్స్‌కర్షన్ వెళతారట. ఆ హడావిడిలో అసలు కళ్లకే కనబడ్డంలేదు.' రామనాథంగారి మాట పూర్తవకముందే సూర్యం వచ్చాడు 'నమస్కారం మాస్టారూ!'అంటూ.

'ఏవోయ్! కాలేజీలో చేరాక పను లెక్కువయినట్టున్నాయే' నవ్వుతూ అడిగారు శర్మగారు.

'ఏం చెప్పాలో తెలియక చిన్నగా నవ్వాడు సూర్యం.

తల్లి పిలుపుతో లోపలికి వెళ్లాడు సూర్యం. చల్లకొచ్చి ముంత దాచడమెందుకని, డబ్బు సంగతి ప్రస్తావించారు శర్మగారు.

'ఏవీ అనుకోకురా శర్మా! సూర్యం నిన్ననే వంద తీసుకున్నాడు. పొలం తగాదాలో బాగా ఖర్చయిపోయింది. సమయానికి దగ్గర లేకుండాపోయింది' నొచ్చుకుంటూ అన్నారు రామనాథంగారు.

'ఫరవాలేదు లేరా ! నీ దగ్గర లేనప్పుడేం చేస్తావ్? సరే వస్తాను మరి' అంటూ బరువుగా సాగిపోయారు శర్మగారు.

అంతా అయోమయంగా వుందాయనికి. ఎటూ పాలుపోవడంలేదు. 'తన చేతనయినంతవరకూ ప్రయత్నించాడు. అంతకన్నా తను మాత్రం ఏం చేయగలడు? డబ్బు దొరకలేదు. మీనాక్షికి ఏం సమాధానం చెప్పాలి? పోనీ వో రోజు ఆగినా దొరుకుతుందన్న ఆశ లేదు. వసుంధర మాత్రం, అవసరంలేనిది ఎందుకు వ్రాస్తుంది ? మీనాక్షి దృష్టిలో తను వో అసమర్థుడు. అసలు తనకు డబ్బు తేవడం యిష్టం లేదనుకుంటుంది. ఎవరినీ అడిగి వుండడనీ, ఏ ప్రయత్నమూ చేసి ఉండడనీ అనుకుంటుంది. నిజం చెప్పినా నమ్మదు. గాజులు తాకట్టు పెట్టమంటుంది. అవి యిక యింటికి రావు. హు! తను ఎందుకూ పనికి రానివాడు. లోకంలో తనలాంటివాడు బ్రతకడం అనవసరం......'

'మాస్టారూ!'

వెనక్కు చూచారు శర్మగారు. సూర్యం!! ఆయాసపడుతున్నాడు. 'మీరీపాటికి యింటి వరకూ వెళ్లిపోయి వుంటారనుకున్నాను! మాస్టారూ! ఇవిగో వంద రూపాయలు' అంటూ ఫేంటు జేబులోంచి నోట్లు తీసాడు.

ఆశ్చర్యంతో మతి పోయింది శర్మగారికి.

'ఏమిటి మాస్టారూ! అలా చూస్తున్నారు? నా కెలా తెలిసిందనా? నాన్నని అడుగుతూంటే విన్నాను. తీసుకోండి మాస్టారూ! ఎక్స్‌కర్షన్‌కి యింకోసారి వెళ్లొచ్చు. మీకు అవసరం కదా! తీసుకోండి' గబ గబా అంటున్న సూర్యం కళ్లల్లోకి అలాగే చూస్తూ ఉండిపోయారు శర్మగారు, ఆ శిష్యుడి మనసులోని మంచితనాన్ని,

మమతని కొలవడానికి ప్రయత్నిస్తూ.

'ఏవిటి మాస్టారూ! నా దగ్గర తీసుకో కూడదా? మీరుగాని తీసుకోకపోతే నా మీద ఒట్టు' చిన్నపిల్లాడిలా అన్నాడు సూర్యం.

కళ్లతోనే కృతజ్ఞత తెలుపుతూ, మౌనంగా డబ్బు అందుకున్నారు శర్మగారు.

'వస్తాను మాస్టారూ !' తృప్తిగా చిరునవ్వు నవ్వుతూ వెనక్కి వెళ్లిపోతున్న సూర్యాన్ని చూస్తూ కన్నీటిని తుడుచుకున్నారు శర్మగారు.

* * *

'ఏవండీ డబ్బు దొరికిందా?' యింట్లో అడుగుపెడుతూనే అడిగింది మీనాక్షి.

'ఆ!' ముక్తసరిగా జవాబిచ్చి లోపలికి నడిచారు శర్మగారు. మీనాక్షి మనసు తృప్తితో నిండిపోయింది. శర్మగారికిమాత్రం ఒక ప్రక్క ఆనందం మరోప్రక్క విచారం. తన గురించి ఎక్స్‌కర్షన్ మానుకుని డబ్బుయిచ్చిన సూర్యాన్ని తలుచుకుంటే ఆనందం, గర్వం, మరోప్రక్క అతని ఆనందాన్ని చెడగొట్టేడేమో తను, అన్న భయం, విచారం.

ఈ ఆలోచనలతోనే ఆ రాత్రి పదిన్నరైనా నిద్ర పట్టలేదాయనికి. తలుపు చప్పుడయ్యేసరికి లేచివెళ్లి గడియ తీసారు.

'అరే! వసుంధరా! రామ్మా! ఏమిటమ్మా పిల్లలో రాత్రిపూట ప్రయాణం పెట్టుకున్నావ్!' అన్నారు కూతుర్ని చూచి.

'ఆయన కేంప్ వెళ్లవలసి వచ్చింది. గవర్నమెంట్ టి. ఎ. తరవాత యిస్తారు గాని, ముందు ప్రయాణానికి డబ్బు అవసరం వచ్చి మీకు వ్రాసాను. కాని వాళ్ల ఫ్రెండ్ సర్దాడులెండి. ఆయ నొచ్చేవరకూ వుండొచ్చని వెంటనే వచ్చేశాను.' అంటూ సూట్‌కేసు లోపల, పెట్టింది, బెడ్డింగు లోపలకు తీసుకురమ్మని రిక్షావాడికి డబ్బు లిచ్చేసి పంపించేసింది వసుంధర. 'వెధవ రైలు. గంటలేటు' విసుక్కుంటూ అంది.

నిద్రపోతున్న చిన్నపిల్లను శర్మగారు తీసుకుని మంచంమీద పడుకోబెట్టారు. అది లేచిపోయి ఏడుపు ప్రారంభించేసరికి, మీనాక్షి మేలుకుంది.

కూతుర్ని చూసుకున్న సంతోషం అంతా యింతా కాదు. తెల్లవార్లూ నిద్రలేకుండా, కూతుర్ని నిద్రపోనివ్వకుండా ఏవో కబుర్లు చెబుతూనే వుంది మీనాక్షి.

శర్మగారికి మనసు తేలికపడగా, సుఖంగా నిద్రపోయారు.

మర్నాడు స్కూలుకు వెళ్లేముందు 'మీనాక్షి! పెట్లోవుంది డబ్బు యివ్వు. సూర్యానికి యిచ్చేసి వస్తాను.' అన్నారు.

'మతిగాని పోయిందేవిటండీ ? పిల్ల యింటికివస్తే, ఏ ముచ్చటా జరిపించడానికి లేకుండా డబ్బు యిచ్చేసి వస్తారా ? రెండు రోజుల్లో పండగకూడానూ !' అన్న మీనాక్షి మాటలకి ఏమనాలో అర్థంకాలేదు శర్మగారికి.

'మీనాక్షీ! ఆ డబ్బు ఎక్కడిదనుకున్నావ్ ? సూర్యం ఎక్స్‌కర్షన్ మానుకుని మన అవసరాని కిచ్చాడు. మనకవి యిప్పుడు అవసరం కాదుగా? యిచ్చేస్తే అతని పనన్నా జరుగుతుంది.' అన్నారు.

'బావుందండీ! మనకి డబ్బిచ్చి తనుఅట్టే ఉండిపోతా డేవిటండీ! ఈ పాటికి ఎక్కడో తెచ్చుకునే వుంటాడు. ఎలాగూ తెచ్చారు గనక నామాట వినండి' అంటూ లోపలికి వెళ్లిపోయిన మీనాక్షిని చూస్తూ వుండిపోయారు శర్మగారు. ఔను. యింకేం చేయగలరు ? భార్య మనసులోని కూతురిపట్ల మమతనిచూచి మెచ్చుకుంటారా ? సంకుచి

# మమత-మనుగడ

తత్వాన్ని చూచి నవ్వుకుంటారా? బొమ్మకి చలనం వచ్చినట్లు భారంగా నడిచారు బయటికి.

ఆయన వాలకంచూచి కాబోలు పో శిష్యుడు 'మాస్టారూ! అలా ఉన్నారేం? లేవండి' అన్నాడు, స్కూలువదిలి పిల్లలందరూ క్లాసువదలి వెళ్లిపోయినా, కుర్చీలోంచి లేవని శర్మగారిని చూచి.

ఏదో ఆలోచిస్తున్న ఆయన ఉలిక్కిపడి, చుట్టూ కలయజూచి మెల్లగా లేచారు. 'ఔను ఎందుకిలా ఉన్నాడు తను? ఏమో.. తన బ్రతుకింతే...' నిట్టూర్చి నడక సాగించారు శర్మగారు.

పెట్టెలోని వందరూపాయలకు ప్రతిగా, వసుంధరకి కొత్త చీరా, పిల్లలకి కొత్త బట్టలూ, కుట్టించి, పండగరోజు వాళ్ల చేత కట్టించి, సంతోషించింది మీనాక్షి.

'డబ్బు లేనప్పుడివన్నీ యెందుకమ్మా' అన్న కూతురి మాటలకు వెంటనే, 'డబ్బు లేదని మానతామటే. ఒకప్పుడు ఉందా! రేపు వస్తుందా? ఏదో ఉన్నదానిలోనే నా తృప్తి.' అంటూ సన్నగా మందలించింది వసుంధరని, మీనాక్షి.

ఆ మాటలు ప్రక్కగదిలో పేపరు చదవడానికి ప్రయత్నిస్తున్న శర్మగారికి, పో గంట క్రితమే పండక్కి పుట్టింటికొచ్చిన సీతకీ వినబడుతూనే వున్నాయి.

తండ్రి ముఖంలోకి చూచింది సీత. తన వాడినముఖాన్ని పేపరువెనుక దాచుకున్నారు శర్మగారు. తండ్రి మనసు, ఆయనపడే బాధ సీతకి తెలుసు. సీత ఏదో ఆలోచనలో పడింది. అంతలోనే ఏదో నిర్ణయించుకున్న దానిలా, తన పెట్టెతెరచి పర్సు తీసింది. అదంతా గమనిస్తున్న శర్మగారికి ఏమీఅర్థంగాక, మళ్లీ పేపరువైపు దృష్టి మరలించారు.

'నాన్నా!' పిలిచింది సీత.

ఏమిటీ? అన్నట్లు చూచారు శర్మగారు.

'మర్చేపోయాను నాన్నా! చీరకొనుక్కోమని ఆయన డబ్బిచ్చారు. నేను బజారుకి వెళ్లాలంటే బాబుతో కుదరదు. మీకు నచ్చిన దేదైనా సరే తీసుకురండి.' యాభై రూపాయిలు అందిస్తూ అంది సీత.

'చీరలసంగతి నాకేం తెలుసమ్మా' అన్నారు మెల్లగా శర్మగారు.

'ఫరవాలేదు. మీకు నచ్చిం దేదైనాసరే. పండగపూట చీరలేకుండా ఎలా?' అన్న సీతకు యింకేమీ చెప్పలేక, డబ్బు తీసుకుని బయలుదేరారు.

ఆయన తిరిగి వచ్చేసరికి యిల్లంతా నిశ్శబ్దంగా ఉంది. వసుంధర పిల్లల్ని తీసుకుని, ప్రక్క వీధిలోవున్న వాళ్ల ఆడబడుచుగారింటికి వెళ్లింది. మీనాక్షి వంటింట్లో పని చేసుకుంటోంది. సీత కొడుక్కి డ్రస్ చేస్తోంది.

'ఇదుగో సీతా! నాకు నచ్చిందేదో తెచ్చాను. నలభై ఎనిమిది. ఎలావుందో చూడు.' అంటూ పేకెట్ అందించారు.

మీనాక్షి ఆమాటలు వింది. తల వంకించింది కూడాను. ఈ యిద్దరూ ఆవిషయం గమనించలేదు.

'చాలా బాగుందినాన్నా.' అంటూ చీరను పరీక్షించింది సీత.

శర్మగారు బాత్‌రూమ్‌వైపు వెళ్లారు. సీత వంటింట్లోకి వెళ్లింది.

'అమ్మా! నాన్న నాకు చీరకొని తెచ్చారు. ఎలావుంది?' అంది తల్లితో.

'తెస్తారని నాకు ముందే తెలుసు. అందుకనే నేను వసుంధర ఒక్కత్తికే కొన్నాను. ఆయనకు నచ్చింది నీకు తెచ్చారు. పైగా వసుంధరకి యిప్పుడు చీరెందుకు అని విసుక్కున్నారు.' నిష్ఠూరంగాఅన్న తల్లి మాటలకు నిశ్చేష్టురాలయింది సీత. మెల్లగా బయటికి రాబోతూ గదిలో నిలబడి తననే చూస్తున్న తండ్రిని చూడగానే దుఃఖం కట్టలు త్రెంచుకుంది. చేతిలోని చీర క్రింద పడిపోయింది.

అబద్ధం ఎందుకు చెప్పావ్ అన్నట్లున్నాయి శర్మగారి చూపులు.

'నాన్నా!' అంటూ తండ్రి చేతుల్లో వాలిపోయింది సీత 'నాన్నా! వసుంధరకి చీర కొని, నాకు కొనలేక పోయినందుకు అమ్మ బాధపడుతుందని అలా చేసాను. కాని నిన్ను బాధపెట్టవలసి వస్తుందనుకోలేదు' వెక్కుతూ అంది సీత. సీత తలనిమురుతూ ఉండిపోయారు శర్మగారు. కూతురి మనసును గ్రహించిన ఆయన మనసు ఆర్ద్రమయింది. వెచ్చని ఆనందభాష్పాలు సీత తలను తడిపివేసాయి. ●

## పోలీసు మనిషే!

బాగా మస్తుగాపీక మొయ్యా తాగిన ఓ పోలీసు కానిస్టేబుల్ దగ్గర వున్న సంయుక్త సోషలిస్టు పార్టీ ఎన్నికల బూత్ (గుడారం) మీద విరుచుకు పడి, దాన్ని మంటపెట్టి తగలేశాడట. వార్తవిని విచారించడానికి వచ్చిన డిప్యూటీ కమీషనర్ ఆఫ్ పోలీసును దుమ్మెత్తి పోశాడట. నానా కష్టం మీద ఓ నలుగులురు పోలీసులు అతన్ని బంధించ గలిగారట. పోలీసూ మనిషేకదా!! ఈ విడ్డూరం పూనాలో జరిగింది.

### ఐ. జి. కారు గల్లంతు!

బెంగుళూరులో కార్ల మోటారు సైకిళ్ల దొంగతనాలు శృతిమించి రాగాన పడ్డాయి.




నగరంలో పోలీసు ఇన్స్పెక్టరు జనరల్ గారి కారు ఎవరో దొంగిలించారట.

## విద్యార్థుల ఆగ్రహం

29వ తేదీ [జనవరి] న మంగళూరు ప్రభుత్వ కళాశాల విద్యార్థులకు కోపం వచ్చింది. ఆ కాలేజీ విద్యార్థులకు ఓ బస్సువోనరుకూ వచ్చిన తగాదా దీనికి మూల కారణం అన్నారు. తత్సంబంధంగా ఓ యిద్దరు విద్యార్థులను పోలీసు నిర్బంధంలోకి తీసుకుని, వదలక పోవడంతో స్థితిపెచ్చుపెరిగి పోయింది. వీధులన్నీ నిర్మానుష్యం అయిపోయాయి. ఈ కాండలో విద్యార్థులు రాళ్ళు, రప్పలూ, ఇటికలేగాక సోడాబుడ్డను కూడా విరివిగా వాడారట. అంతే గాక ఆసిడ్ బల్బులు [ద్రావకం పోసిన బెలూ నులవంటివా!] కూడా వుపయోగించారట. కనబడిన కొట్లూ, షాపులూ, అంగడులూ, బస్సులూ, వాహనాలూ అన్నిటి మీదా రాళ్ళు వగైరాలు పడ్డాయి. నాలుగ్గంటల సేపు జరిగిన యీ వుత్ప వంలో పోలీసు అధికారులతో కలిసి 20 మంది గాయపడ్డారట. 8 పోలీసు బళ్ళు, కద్రి కొండల ప్రాంతంలో ఓ సిటీ బస్సు నాశనం చేశారుట. కద్రికొండల ప్రాంతంలో చిక్కిన సిటీ

# ఒక వారం విపరీతం ఫాలాక్షుడు

బస్సును ఓ గోతిలోకి నెట్టి నిప్పంటించారట. కేంద్ర టూరిష్టు హోమునుకూడా ధ్వంసం చేశారట. పోలీసులు వీరిని అణచడానికి కాల్పులు ప్రారంభించారు. పోలీసులు తరుమగానే గమ్మున కాలేజీలోకి పారిపోయి, రెట్టింపు బలగంతో తిరి గొచ్చి మళ్ళీ వుత్సాహంతో రాళ్ళవాన కురిపించనారం భించారట విద్యార్థులు. మంగళూరు ముఖ్య వీధుల్లో తిరిగిన ఏ వాహనం కూడా రాళ్ళవాన నుంచి తప్పుకొననే లేదట. మఫ్టీలో వున్న ఓ పోలీసు కానిస్టబుల్ని విద్యార్థులు పట్టుకుని ఆకాలేజి ప్రిన్సిపాలుగారి రూములో 10 గంటలకాలం నిర్బంధంలో వుంచారట. ఈ యుద్ధంలో బి. కాం. చదువుతున్న జగన్నాధ శెట్టి అనే విద్యార్థి పోలీసు కాల్పులకు ఆహుతి అయ్యాడట.

ఈ సందర్భంలో ఆకళాశాల ప్రిన్సిపాల్ శ్రీ యం. ఏ రామ చంద్రరావు మాట్లాడుతూ, 29 తేదీ వుదయం 9—45 గంటలకు తాను కాలేజికి వచ్చే సరికి ఓ నాలుగు పోలీసు వ్యానులు, నలభై మంది పోలీసులు గేటు ప్రాంతంలో వున్నారని, లోపలి విద్యార్థుల మీద పోలీసులు రాళ్ళు విసురు తున్నారని ఏవిధమైన హెచ్చరికా లేకుండా—లాటీచార్జీ గాని భాష్పవాయు ప్రయోగం కాని లేకుండా యకా యకి కాల్పులు సాగించారని అన్నారట.

### దారిమధ్య దారుణం!

శబరి మలై [కొండ] అయ్యప్పన్ స్వామి దర్శనం చేసుకుని తిరిగివస్తున్న నారాయన్‌నాయర్ అనే అతన్ని ఎవరో వ్యక్తి దారి మధ్యలో పట్టుకుని కత్తితో పొడిచి చంపి, అంతతో ఆగక ఆయన భార్యనూ చంపి, కొడుకును గాయపరచి పారి పోయాడట. ఆ వ్యక్తి ఎవరో, ఆ కిరాతకం ఎందుకు చేశాడో మాత్రం తెలియలేదు.

### కొచ్చిన్ బెంగుళూర్ ఎక్స్‌ప్రెస్‌లో 45 ఏళ్ల వ్యక్తి శవం!

కొచ్చిన్ నుంచి జాలారుపేట మీదుగా బెంగ్ళూరు వస్తున్న ఎక్స్‌ప్రెస్ బండిలో ఓ 45 ఏళ్ళ వ్యక్తి శవం వుందట. విచారణ మీద ఆవ్యక్తిపేరు కృష్ణన్ ఆలీ, మైసూరు స్టేషనులో లోకో షెడ్స్‌లో పని చేస్తున్నాడని తేలినా, అదసలు హత్యా, ఆత్మహత్యా, లేక మామూలు మరణమా! ఎలాగ, ఎందుకు, అన్న విషయాలింకా తేలలేదు.

### అంగీకరించని ప్రేమ!

23 ఏళ్ళ అక్తర్ ఆలీ మహమ్మద్ అనే అతనూ జోన్ మెక్లీన్ అనే ఆమెను ప్రేమిస్తే ఆతని తలిదండ్రులు ఆ ప్రేమను అంగీకరించక జోన్ మెక్లీన్‌ని, [ఆమె అయిదేళ్ళ కూతుర్ని] [జోన్‌మెక్లీన్ వివాహిత] దారుణంగా చంపివేశారట. ఈ నేరం ఋజువై ఆతలిదండ్రులకు చట్టం శిక్ష వేశాక అక్తర్ ఆలీ మహమ్మద్ మనస్సు విరిగి, ఓ చెట్టుకు వురి పోసుకుని చనిపోయాడట. ఇది స్వాన్సియా [వేల్స్]] లో జరిగింది.

### అబలపై అత్యాచారం!

బెంగళూరు హోసకోటకు చెందిన ఓ గ్రామంలో పిచ్చప్ప అనే అతవిభార్య రేవమ్మ వంటరిగా వస్తుండగా అదే వూరుకు చెందిన సుబ్బరాయప్ప, కృష్ణప్ప అనే యిద్దరు వ్యక్తులు ఆమెను బలాత్కరింప బోయి, కుదరక పీక నులిపి చంపి శవాన్ని వొనూతిలో పారేసి చక్కాపోయారట.

### ఆత్మహత్యా కేంద్రాలు!

ఆత్మ హత్యలను వుత్సాహపరుస్తూ కొన్ని కేంద్రాలను నిర్మించడం చాలా అవసరమని దీని ఆవశ్యకత నార్వేకు ఎంతైనా వున్నదని ప్రొఫెసరు ఇన్‌గ్మరు హెడెనియస్ ఢిల్లీలో ప్రకటించారట. అసలు యీరకం కేంద్రాలు అవసరమేనని ఆయన అన్నారట. జీవితంలో బ్రతుకులో రుచిలేక, అలసి పోయిన వారికి ఇవి సహాయకారి కాగలవని ఆయన చెప్పాడట. ఆత్మహత్యే శరణ్యం అని నిర్ణయించుకున్న వ్యక్తిని ఆ కేంద్రములో డాక్టర్లు మనశ్శాస్త్రవేత్తలు పరీక్షించి, అతని బాధలు నివారించ ప్రయత్నించాలని, అదిలేని నాడు, కుద రని పక్షంలోనూ, అతి సునాయాసంగా ప్రాణాలు తీసుకోవడానికి మంచి మార్గాలు వారికి చెప్పాలని ఆయన అన్నారట. ఈ రకమైన పద్ధతుల వల్ల ఆత్మహత్యకు పాల్పడేవారు దారుణమైన పద్ధతుల్లో (రైలుక్రింద పడడం, కరెంటు తాకడం, మేడల మీంచి దూకడం వగైరా) ప్రయత్నించరనీ ఆయన అన్నారట— నవీనతే!!



# ఒకవారం విపరీతం

## సెక్సు-రూల్సు

ఒసాకా (జపాన్)లో రాత్రి పూట టెలివిజన్ ప్రసారం అయిపోయాక, రేడియో కట్టేయ పోతుండగా జామ్మని సెక్సు సినిమాలు వస్తున్నాయట. ఇది కేవలం టెలివిజను పద్ధతులుగల కొన్ని హోటళ్ళు చేసున్నవని అయ్యుండచ్చని పోలీసు అభిప్రాయ పడ్డది. వీరిని విచారించి అరెస్టు చేయాలన్నా వారు చూపిస్తున్న సినిమాలు జపాను సెక్సు రూల్సు దాటిన మేరకు అసభ్యకరంగా లేవని కూడా వారు విచారించారట.






## ఆవేశం!

రెండో తేదీన ఎన్నికల ప్రచార సందర్భంలో మద్రాసు ట్రిప్లికేన్‌లో ముఖ్యమంత్రి కరుణానిధి మాట్లాడుతుంటే యమ్మే చదువుకుంటున్న సుందర రాజన్ అనే విద్యార్థి బియ్యే చదువుతున్న




అళగు అనే విద్యార్థి వేళాకోళం చేయ సాగారట. పక్కనున్న కుళందై అనే శ్రోత కాస్త నిశ్శబ్దంగా వుండండి బాబా, అనేసరికి గమ్మున జేబులోంచి కత్తి తీసి ఆ కుళందైని సుందర రాజన్ను పొడిచి వేశాడట.

## లైవ్స్ ఆఫ్,

1వ తేదీన కలకత్తాలోనూ, చుట్టు పక్కల్లోనూ జరిగిన రభసల్లో ఓ సి. పి. యం. వ్యక్తి మరో యిద్దరు చనిపోవడం, ముగ్గురు పోలీసులు విపరీతంగా గాయపడటం జరిగిందట. 35 ఏళ్ళ జోగిందర్ రాయ్ (సి. పి. యం.) ఎన్నికల ప్రచార విషయాన్ని గోడమీద రాస్తుండగా కొందరతని మీద పడి పొడిచి పారిపోయారట.

ఖర్దా పోలీసు స్టేషనుకు చెందిన సర్కార్ అనే పోలీసు కానిస్టేబుల్ సోనేపూరునుంచి వస్తుండగా ఎవరో అడ్డి ఆయన్ను విపరీతంగా గాయపరచారట.

2వ తేదీన నార్త్ కలకత్తా, శ్యాంపూరులో సి. పి. ఎం. వారు నక్సలైటువారు, మారణాయుధాలతో సాగించిన సమరంలో మొత్తం అయిదుగురు చనిపోయారట.

కాసీపూరు యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కాపలాదారుని తుపాకి ఎవరో ఎత్తుకు పోయారట.

విప్లవకారుల్లో కొంతమంది కలకత్తా స్టేట్ స్టాటిస్టికల్ బ్యూరో ఆఫీసులో జొరబడి తుపాకులు చూపి, మీ ఆఫీసు ఫైళ్ళన్నీ తగలెయ్యాలి. తప్పుకోండి, అని, అన్నంత పని చేశారట ●

# న్యాయం ఎదురుతిరిగింది

భద్రగిరి
సుధీర్ కుమార్



పాపం! ఉదయం లేస్తూనే పిల్లి ఎదురయ్యింది పార్వతీశం గారికి. ఒక్కక్షణం ఆయన కలవరపడిన మాట మాత్రం నిజం. అసలే రాత్రంతా పీడ కలలు. అంతకు ముందురోజే పెద్ద కేసొకటి ఓడిపోయాడు. ఆయనకి శకునాలమీద నమ్మకం హెచ్చు. ఆ మాటకి వస్తే తన బుద్ధిబలంమీద కావలసినంత నమ్మకం ఉంది.

'ఈ రోజు ఎలా గడుస్తుందో ఏమో! అయినా చెప్పుకోతగ్గ కేసులు లేవు.' అనుకున్నాడాయన.

పదిన్నరకి టంచనుగా కోర్టుగుమ్మం ఎక్కేసరికి మేజిస్ట్రేట్‌గారు సి. ఎల్. పెట్టారన్న వార్త—ఆయన పాలిట శుభవార్తే మరి!

సాయంత్రం షికారుకి బయలుదేరబోతున్నాడు. గుమ్మంలోనే ఎదురయ్యాడో అపరిచిత వ్యక్తి.

'వకీలుగారు మీరే ననుకుంటాను' అన్నాడతను.

'అవును. ఏం కేసుమీద వచ్చారు?'

'నన్ను రామారావంటారండి. మేము తెలగాలం. చెప్పుకోతగ్గ ఆస్తిపాస్తులు లేవు, ఏదో ఐదెకరాల పొలం తప్ప. నా తల్లిగారు, నేను, మా చెల్లెలూ యిదే మా కుటుంబం.'

కాస్సేపాగాడతను.

'ఊహూ... ఇదేదో సివిల్ కేసులా ఉంది. అయినా నమస్కారబాణం విసరకుండా

నేరుగా యింట్లోకేవచ్చి నరానరి నేంతే కథలోకే దిగాడే. మనిషికూడా విసురుగా మెట్లెక్కినట్టు జ్ఞాపకం.'

పార్వతీశంగారి బుర్ర బాకులా పని చెయ్యటం మొదలుపెట్టింది

'మా చెల్లెలు నీరజ ఫస్టియర్ బి.ఏ. వెలిగిస్తోంది. మీ అబ్బాయి ఉన్నాడు కదూ, అతనికీ జూనియర్. అన్నట్టు ఈ సంవత్సరంతో అతని చదువు పూర్తయిపోతుందను కుంటాను' మళ్ళీ కాసేపాగి ప్లీడర్ గారి ముఖంలోకి తీక్షణంగా చూసాడతను.

పార్వతీశంగారికి సహనం తగ్గిపోతోంది.

'చూడండి. నా వృత్తిల బోల్డు పను లున్నై. మీరు వీలైతే రేపొద్దున్నేరండి. లేకపోతే అసలు కేసేమిటో టూకీగా చెప్పెయ్యండి' అన్నాడాయన.

'ఆ పాయింటుకే వస్తున్నానండి. ఏం లేదూ, మా చెల్లెలూ మీ పుత్రరత్నం ప్రేమించుకున్నారుట. ఇప్పుడది మూడు నెలల గర్భవతి కూడానూ. కోర్టు కెక్కమన్నారో లేక పెద్ద తరహాగా పెళ్ళి చేస్తారో తేల్చుకుందామని వచ్చేను.

లాయరుగారి ముఖం నిప్పునార్పేసిన చుట్టలా ఒక్కసారి క్షీణించింది. అయినా తత్తరపాటుని తెలియనివ్వకుండా,

'మా అబ్బాయి మంచితనం మాకు తెలుసు. ఒకవేళ అతను చేసింది తప్పే ననుకోండి. మగాడన్నాక ఎన్నోపనులు చేస్తాడు. అన్నిటి గూర్చి న్యాయాన్యాయాలు ఆలోచించి వో కొలిక్కి తేవాలంటే కష్టం. మీ అమ్మాయి తన హద్దుల్లో తాను ఉండి ఉండదు. కనుక తప్పు ఆమెదే. కులాలువేరని తెలిసీ పెళ్ళి చెయ్యాలంటూ మీరు రావటం నాకు ఆశ్చర్యంగా ఉంది. అనవసరంగా బయటికెడుస్తే 'అరిటాకు'కే నష్టం. తరువాత మీ యిష్టం' అని గడుసుగా జవాబిచ్చేరాయన.

'మీకూ వో ఆడపిల్ల ఉంది. కనుక మీరిలా మాట్లాడటం సబబుగా లేదు. వాళ్ళిద్దరూ చేసింది తప్పు కాబట్టి మనిద్దరం ఈ రోజు మాట్లాడుకోవాల్సి వచ్చింది. మాదీ పరువూ, ప్రతిష్టగల కుటుంబమే. తప్పు అందరూ చేస్తారు,

# న్యాయం...

కానీ సరిదిద్దుకోవటంలోనే ఉంటుంది ఘనత.

నాకున్న ఐదెకరాలూ మీ అబ్బాయికే కట్నంగా యిచ్చేస్తాను. మిగతా కానుకలకి లాంఛనాలకీ లోటేమీ రానివ్వను. ఆడదానికి అన్యాయం చెయ్యకండి బాబూ. ఒక్కగా నొక్క చెల్లెలు నాకు. దాని జీవితం నాశనం చెయ్యకండి'

'కట్నం క్వశ్చన్ కాదండి. కులం గోత్రం — ఇవే మాకు ముఖ్యం. మనం ఏర్పరచుకున్న సాంప్రదాయాలు కులాంతర వివాహాలని, మతాంతర వివాహాలని ఒప్పుకోవు. మన సంఘమూ హర్షించదు. అనవసరంగా నలుగురిలో నవ్వుల పాలవ్వటం తప్పితే యింకేం జరగదు.

మనమంతా నిమిత్తమాత్రులం. మనం మాత్రం చెయ్యగల్గేదేం ఉంది చెప్పండి? ఇలాంటి విషయాల్ని అసలు చర్చించవే కూడదు అలాగని ఊరుకో కూడదు సుమండీ ఏదో మనకి చేతనయినంతా కప్పుకు పోవడానికి సిద్ధపడాలి.'

పార్వతీశంగారు పొడిదగ్గొకటి దగ్గి గొంతు తగ్గించేడు.

'నాకు తెలిసిన డాక్టర్ని రికమెండ్ చేస్తాను. వెళ్ళి కలుసుకోండి. ఈ గొడవ లేవీ బయటకి పొక్కనివ్వడు. అంతా 'కామ్'గా జరిగిపోతుంది.'

రామారావు ముఖం పాలిపోయింది. రక్తమంతా ఒక్కసారి గడ్డకట్టుకు పోయినట్లనిపించింది. అశక్తత అతని నవనాడుల్లోనూ చోటు చేసుకుంది. అంతసేపూ బింకంగా మాట్లాడిన అతనిగొంతు దీనత్వంతో నిండిపోయింది.

'మచ్చని మాపుకోవడానికి మీ దగ్గరకి రాలేదు బాబూ నేను, అసలు మచ్చంటూ లేకుండా చేసుకోవాలని తాపత్రయపడుతున్నాను. ప్రకృతి ప్రాబల్యం మగవాడి మీద ఉండదు. అందుకే తప్పంతా ఆడది మోస్తుంది.

కాలుజారిన కన్నెపిల్లని ఈ సంఘం నీచాతినీచంగా అవమానిస్తుంది. అందుకు కారణమైన మగవాణ్ణి చూసి చిలిపిగా నవ్వుతుంది.

ధర్మశాస్త్రాలు చదివి, న్యాయానికి రూపురేఖలు దిద్దాల్సినవాళ్ళు మీరు కనుక యివన్నీ మీకు చెప్పాల్సినవాణ్ణి కాదు నేను. ఇంతకుముందే గుర్తు చేసాను కదూ, మీకూ ఒక ఆడపిల్ల ఉందని. ఆ అమ్మాయినన్నా దృష్టిలో పెట్టుకని నా చెల్లెలు జీవితాన్ని బాగు చెయ్యమని అర్థిస్తున్నాను మిమ్మల్ని. ఒక్కసారి మీ కుటుంబ వ్యక్తులతో సంప్రదించి నాకు తెలియజెయ్యండి. మళ్ళీ తరువాత కలుస్తాను'

రామారావు మెల్లగా, దారిని వెతుక్కుంటూ పోతున్న గుడ్డివాడిలా అక్కడనుండి కదిలేడు.

'కొత్త సమస్యొకటి వచ్చి పడింది. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా వ్యవహారం బెడిసికొడుతుంది. ఈ వెధవింత పనిచేసి యింటిమీదకి తీసుకొస్తాడని తనెప్పుడూ ఊహించలేదు. ఇట్లాంటి కాకపోయినా అట్లాంటయినా సరుక్కూ రావాలి. కుటుంబం పరువూ మాటలా!'

'ఏమేవ్, ఒకసారిలా వస్తావా?'

భార్యామణిని పిలవేడాయన. ఆ 'ఏమేవ్' వచ్చింది.

ఆవిడ పేరు ధనమ్మ. పార్వతీశంగారు ఆవిడ చేతిలో కీలుబొమ్మ.

'నీ కొడుకు చేసిన నిర్వాకం విన్నావా? ఎవరో అమ్మాయిని ప్రేమించేట్ట.'

ఆయన మాటలకి ఆవిడ అడ్డు తగిలింది.

'ఆ! అన్నీ విన్నాను. వాడివేమైనా దండించాలని చూస్తున్నావా? అయినా నాకు తెలియక అడుగుతానూ, మీరు మాత్రం ఏనాడైనా ఇలాంటి విషయాల్లో తక్కువ తిన్నారా? వాడూ మీ కొడుకేగా, మీ పోలికలే వచ్చేయి. కానీ మీ తెలివి వాడికి అఘోరించలేదు కనుక వాడిలా అగచాట్లు పడుతున్నాడు. చూడండీ, తప్పు చేసింది వాడు కాదు. వాడి 'వయస్సు'.

అయినా ఆడపిల్లల్ని అలా వీధిలోకి వొదిలేసుకుంటార్టండీ? తగుదునమ్మా పెళ్ళి చెయ్యాలంటూ ఇంటి మీదికొస్తాడూ? వాళ్ళు కాదు, వాడి జేజెమ్మొచ్చినా ఇలాంటి పెళ్ళిళ్ళు ఈ యింట్లో జరగవ్. నిప్పులు కడుక్కునే వంశం కాదూ మనది.'

# ఇతర డస్ట్ టీల అన్నిటికంటె ఎక్కువ కప్పుల టీ ఇచ్చును

నేడే వాడి చూడండి. ఇతర డస్ట్ టీలన్నింటికంటె ఎక్కువ కప్పుల టీ లిప్టన్ రూబీ డస్ట్ టీ ఇచ్చును. అంతేకాదు, రూబీ డస్ట్ టీ నుండి చిక్కదనము, సువాసనగల టీ కప్పులను అతి త్వరలో పొందగలరు. అందుచేతనే లిప్టన్ రూబీ డస్ట్ టీ "డస్ట్ టీలలో చక్రవర్తి" అనుటలో విచిత్రమేమియులేదు.

## లిప్టన్

# రూబీ డస్ట్

## డస్ట్ టీలలో చక్రవర్తి




ప్యాకెట్లలోవున్న టీ మాత్రమే తాజాతనము, సువాసన నిలిచివుండును

LIPTON

లిప్టన్స్
అంటే
మంచిటీ

పార్వతీశంగారికి యింకేం మాట్లాడాలో తోచలేదు. కోర్టుకీ, ఇంటికీ ఉన్న తేడా తెలపాయనకి. అయినా బలం పుంజుకుని —

'మనకీ ఓ ఆడపిల్ల ఉంది. దాని సంగతి మర్చిపోకు' అన్నాడు.

ధర్మ తాటిచెట్టెత్తున మొలిచి మీదకి లేచింది.

'అందరి ఆడపిల్లల్లాంటి ఆడపిల్ల కాదండీ నా కూతురు. ఎన్ని కట్టుబాట్లలో పెంచానూ, ఎంత అణకువ, ఎంత ఓర్పు! ఈ ఊరంతా వెదికినా నా బిడ్డలాంటిది ఉంటుందటండీ? అదీ చదివింది ఎస్. ఎస్. ఎల్. సి. వరకు. ఏనాడైనా దాన్ని గూర్చి ఎవరైనా చెడ్డగా చెప్పగా విన్నారూ? ఏదో పాతికో యిచ్చి పారేసి వ్యవహారం తేల్చెయ్యండి. అంతేగాని మన అమ్మాయితో యింకెవ్వర్నీ పోల్చకండి. ఎంతైనా ప్లీడరు కదూ, మీకున్న వ్యవహారజ్ఞానమేదో యిప్పుడు చూపించండి. పెరటిచెట్టు మందుకి పనికిరాదన్న సామెత ఋజువు చెయ్యకండి.'

పార్వతీశంగారు యింకేం మాట్లాడలేదు. ఆయన నుదురు సముద్ర తీరంలోని ఇసుకలా ముడతలు పడింది. ఆయన మనస్సుకూడా సముద్రంలాగే అల్లకల్లోలంగా ఉంది

# న్యాయం...

'సమస్య జటిలంగా ఉంది. వాడో పెద్దో తేల్చక తప్పదు. ఈ వేధనకైనా బుద్ధుండొద్దూ? కులం గోత్రం ఏవీ చూసుకోనక్కర్లేదా? పోని ప్రేమించాడనే అనుకుందాం.. అయినా యింతదాకా తెచ్చుకోవాలా? తనుమాత్రం యిలాంటి పనులెన్ని చెయ్యలేదు? ఏనాడైనా మరీ యింతగా ప్రాణంమీదకి తెచ్చుకున్నాడా? అయినా అప్పుడు తాతగారు ఉండేవారు. ఒకటీ, అరాతర 'రాసక్రీడలు' ఆయన చెవిలోపడటం నిజమే. ఇలాంటివి డబ్బులో పూడ్చేసిన కంట్రాక్టరాయన.

'పోనీ కొడుకుని అడిగి చూద్దామా అంటే నోట్లో వేలుపెడితే కొరకలేననే అంటాడు. అందులోనూ తల్లి వత్తాసు ఉంది. సాటి ఆడదనైనా ఆలోచించలేదు తన భార్యామణి. కొడుకునే వెనకేసుకొచ్చింది. న్యాయాన్యాయాలు ఆలోచించటానికి సమయంకాదిది. పరువూ, ప్రతిష్ఠ ముఖ్యం.

'తాను గెల్చుకున్న కేసులు అన్నిట్లోనూ ముద్దాయిలందరూ నిర్దోషులేనా?' తల్లి పుట్టిల్లు మేనమామ కెరుకన్నట్టు వాళ్ళ జాతకాలు తనకి తెలుసు. అయినా దోషుల్ని సయితం నిర్దోషులుగా కోర్టుచేత ముద్రలు వేయించేడు. ఎందుకు, డబ్బుకోసం. ఈ ప్రతిష్ఠకోసం. అలాంటివాడే తనకొడుకూ అనుకుంటే సరి.'

'సరే యింతకీ ఈ గొడవని పరిష్కరించటం ఎలా? ఓ ఐదొందలు పారేస్తే... కన్నెపిల్లశీలం ఖరీదు అంతేనా? దానికేం ఉంది, ఆ వెనుక 'దన్ను' ఉంటే ధర పెంచాల్సి ఉంటుందేమో. ఏమైనా పరువుని కాపాడుకోవడం ముఖ్యం. ఈ రోజిలా వాళ్ళముఖాన పారేస్తే రేపు ఒక మంచి కేసులో లాగెయ్యవచ్చు.

పార్వతీశంగారు తలయెత్తి చుట్టూరా పరీక్షగా చూసేరు. గోడలమీద గాంధీ, నెహ్రూ, వల్లభాయ్ పటేల్, శాస్త్రి తదితర దేశనాయకుల ఫోటోలు తగిలించి ఉన్నాయి. వారంతా కొమ్ములు తిరిగిన లాయర్లు. అందుకనే ఈ జాతికి జీవచైతన్యాన్ని కలుగజేసి స్వాతంత్ర్యంకోసం పాటుపడి న్యాయానికి నిలబడ్డారు.

ఒకసారి చిత్రమైన కేసుని తను తీసుకున్నాడు. అరవైఏళ్ళ ముసలం బస్సుక్రిందపడి ప్రాణాల్ని పోగొట్టుకుంది. ఆవిడ రాంగ్‌సైడ్‌లో వచ్చిందని, వెనుక చక్రంక్రింద పడిందని, ఇంకా ఇలాంటి పాయింట్లతోనే అఖండంగావాదించి కేసు గెలిచేడు. ఫలితంగా వెయ్యి రూపాయిల్ని కళ్ళజూసేడు. ఆరోజు హుషారుగా ఇంట్లోకి అడుగు పెట్టగానే మొట్టమొదట గాంధీగారి ఫోటోయే కళ్ళకి కన్పించింది. బోసినవ్వుగాంధీ ఆ రోజు ఒక వ్యంగ్యంగా తన గుండెల్లోకి చూసేరు. ఆ గాంధీయే ఈ నాడు లోతుకుపోయిన కళ్ళతో, కన్నీళ్ళచేత బరువెక్కిన కనురెప్పలతో తనకేసి జాలిగా చూస్తున్నారు.

'నిజమే బాపూ! ఈనాడు మాలాంటి పెద్దవాళ్ళ యిళ్ళల్లో గోడలమీద అలంకారానికి మాత్రమే పనికివస్తున్నావు. కాని మా హృదయపు గోడలమీద మాత్రం నీ ఛాయలు లేనేలేవు. నిప్పులాంటి నీ చూపు నన్ను దహించివేస్తోంది. నేనుమాత్రం ఏం చెయ్యను? పరిస్థితులకి, ప్రస్తుత జీవనానికి బానిసను.'

గాంధీ ఫోటో తీసి డ్రాయర్లోకి విసిరేసేడు.



'బావూ! గోడమీదకంటే ఈ చోటే నీకు సరియైన నివాసస్థానం. పవిత్రమైన నీ చూపులు ఈ ప్రపంచాన్ని చూసి తట్టుకోలేవు.'

పార్వతీశంగారు ఖాళీ కాబడిన గోడ మీద కేలండరు తగిలించేరు.

'అయినా డబ్బుకి లొంగేరకాలేనా వీళ్ళు? మరి లొంగకపోతే గత్యంతరం'...?'

పార్వతీశంగారు ముఖాన్ని అరచేతులతో తుడ్చుకున్నాడు. ఆయన బుర్రలో క్షణకాలంసేపు వో మెరుపు మెరిసింది. బ్రతక నేర్చిన నవ్వొకటి ఆయన ముఖాన వెలిగింది.

'ఇహ తిరుగుండదు ఈ ప్లానుకి. ధనం—కాకపోతే జులుం! ఆ అమ్మాయి కేరక్టరు మంచిదికాదని 'బ్రోతల్' కేసొకటి బనాయింపజేస్తే సరి. ఎలాగూ సబ్ ఇన్స్పెక్టరు తన క్లాసువాడే. ఆ మాత్రం సాయం చెయ్యలేడూ? ప్రతీ తప్పూ సాధ్యమైనంత ఒప్పుగా న్యాయశాస్త్రరీత్యా చూపెట్టగల శక్తి తనకుంది. వ్యవహారం ముదిరితే గత్యంతరం యింతే మరి. అప్పుడిహ యింకేం గొడవాఉండదు పిడికెడు పిప్పులమీద బిందెడు చన్నీళ్ళు చిమ్మరించి నట్లుంటుంది'

ఈసారి వెయ్యేనుగుల బలంతో గోడ కేసి చూసేడు.

అది 'కర్ణవధ' చిత్రం. కర్ణుడు భూమిలోకి క్రుంగిపోతున్న రథచక్రాన్ని పైకి లాగటానికి వీపు చక్రానికి చేరవేసి ఇరుసుని భుజంతో పైకెత్తటానికి పాట్లు పడుతున్నాడు. అస్తమిస్తోన్న సూర్యుడికి అభిముఖంగా అతనిముఖం తేజోవంతమై విరాజిల్లుతోంది. నుదురు చిట్లి ముడతలుపడింది. పాపం, కొద్ది సేపట్లో తనగుండె చిట్లబోతోందని వినుకడతము. నుదుటి ముడతలలో చెమట ఊరిఉంది. ఆ చెమట వెనుక విధాత వ్రాసిన వ్రాతలు పరీక్షగా చూస్తే కనబడ వచ్చునేమో!

అర్జునుడు బాణం సంధించి సిద్ధంగా ఉన్నాడు. అతనికళ్ళు అసూయతోనూ, ద్వేషంతోనూ విచ్చుకుని ఉన్నాయి. కృష్ణుడు 'పని తొందరగా కానిమ్మ' న్నట్లు అర్జునుడికేసి చేయి ఊపుతున్నాడు.

'అర్జునుడు అన్నివిధాలా అదృష్టవంతుడే. అతనికోసమే ద్రోణాచార్యుడు ఏకలవ్యునివద్ద బొటనవ్రేలిని తీసుకున్నాడు. ఇంద్రుడు కర్ణునివద్ద కవచకుండలాల్ని అభ్యర్థించాడు. వీళ్ళిద్దరిలాగానే బ్రతికున్నప్పుడు తాతగారు, ప్రస్తుతం సంఘంలో తను తెచ్చుకున్న గౌరవం తనకి అడుకుంటున్నాయి. నిజానికి కుంతి కర్ణుణ్ని చేరదియ్యలేదు కనుక అతడు దురదృష్టవంతుడు. అలాగే ప్రస్తుతం నీడలేని నీరజకూడా!

కర్మ సిద్ధాంతం ప్రాతిపదికమీద శ్రీకృష్ణుడు అర్జునుడితో కర్ణుణ్ని చంపమని చెప్తున్నాడు తాను న్యాయశాస్త్రం పేరిట ఒక న్యాయసూత్రాన్ని బాణంలా వదలబోతున్నాడు.

పార్వతీశంగారు ఆ కేలండరుకేసి విలాసంగా వో చూపు విసరి వికృతంగా నవ్వుకున్నాడు.

* * *

పట్టుమని పదిరోజులైనా గడవలేదు మళ్ళీ ఒక అవాంతరం వచ్చి పడింది పార్వతీశంగారికి. ఈ సారిమాత్రం ఆయన వకీలు మేధస్సు పని చెయ్యనని మొరాయించు క్కూర్చుంది.

ఆయన ముద్దుల కూతురూ, ధనమ్మగారి సుగుణాలరాశి భార్గవభర్త లిద్దరూ కలలోకూడా ఊహించలేని ఘనకార్యాన్ని చేసి పరువూ, ప్రతిష్ఠలే పేరెత్త నివ్వకుండా చేసింది. పోతూ, పోతూ వో ఉత్తరంమాత్రం వదేసిపోయింది. నాన్నగారికి,

నేను చేసినపనిని మీరెవ్వరూ హర్షించరని, నన్ను సహించుకుంటారని నాకు తెలుసు. నన్ను పువ్వుల్లో పెట్టి పూజించగలవ్యక్తీ, నన్నమితంగా ప్రేమించే వ్యక్తీ, నాకు జీవితాంతం నీడనివ్వగల సమర్థుణ్ని నేనెన్ను కున్నాను.

ఆయన తల్లిదండ్రులకి కూడా మా వివాహం యిష్టంలేదు. కానీ ఆయన కాళ్ళమీద ఆయన నిలబడే ఉన్నారు కాబట్టి యింకెవ్వరినీ ఆశ్రయించాల్సిన అగత్యం లేకపోయింది మాకు

సాటి అడదానికి మీరుచేసిన అన్యాయం, అందుకు అమ్మ యిచ్చిన ప్రోద్బలమూ,

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పి పంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాగల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీలయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణించ బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు

షరా: వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# శకటోదకుని ప్రబోధం



ధర్మపథం * బులుసు వెంకటరమణయ్య

జానశ్రుతి అనే మహారాజు మహా వృష ప్రాజ్యాన్ని పాలిస్తూ ఉండేవాడు. అతడు గొప్పదాత. దయాహృదయుడు. త్యాగమూర్తి అనీ కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకున్నాడు. ప్రపంచం అంతటా అతనిపేరు మారుమోగింది. అతడు నడుపుతూఉన్న ధర్మశాలలు, అన్నసత్రాలు, విశ్రాంతి గృహాలు ఇన్నీ అన్నీ కావు. ఇలా చేస్తూ తానేదో ఘనకార్యం సాధించాననీ, తాను కృతార్థుణ్ణయ్యాననీ అనుకున్నాడు. దానితో అతనికి గర్వం ఏర్పడింది. తనకు త్యాగం మూలాన గొప్పపుణ్యం వస్తుందనీ, దానివల్ల మనశ్శాంతి లభిస్తుందనీ అతడు అనుకునేవాడు. తనవంటి ధార్మికుడు మరొకడు లేడని అనుకునేవాడు.

జానశ్రుతి ఒకనాటి రాత్రి తన సౌధోపరిభాగంపైన కూర్చుని వెన్నెలలో విశ్రాంతి తీసుకుంటూ వుండగా ఆకాశమార్గంగా రెండు హంసలు పోతూ ఉండేవి. రాజును చూచి ఒక హంస "ఈ జానశ్రుతి మహాదాత; గొప్పకీర్తిని సంపాదించాడు" అంటూ పొగడింది. రెండవ హంస 'ఎందుకలా మెచ్చుకుంటావు? దానాలు చేస్తే సరా? ఇతనికి ఆత్మజ్ఞానం లేదు. బండీ తోలుకొని జీవించే రైక్వుడు ఆత్మజ్ఞాని. ఆ రైక్వుడికి ఇతడు తీసికట్టు' అని అన్నది.

వాటిభాషను ఎరిగిన రాజు హంసల సంభాషణ విని చాలా సిగ్గుపడ్డాడు. అతని గర్వమంతా పటాపంచలై పోయింది. ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు. ఎలాగో రాత్రి గడిచిపోయింది.

ఉదయం కాగానే రాజు ఒక రాజభటుణ్ణి పిలిచి, రైక్వుడు ఎక్కడ వున్నదీ తెలుసుకొని రావాలని ఆజ్ఞ యిచ్చాడు. భటుడు వెతికాడు గాని, అతని జాడ దొరకలేదు. ఆ సంగతి వాడు ప్రభువునకు తెలియజెయ్యగా — ఆయన 'ఓరీ! రైక్వుడెక్కడ?' అని అడిగితే ఎవ్వరూ చెప్పలేరు. నీవు బ్రహ్మజ్ఞానులు వుండే ఏకాంత ప్రాంతాలకు పోవాలి. అలాటి చోటులో తప్పక ఆయన కనబడతాడు' అని హెచ్చరించి మళ్ళీ పంపాడు. సేవకుడు అన్వేషించగా, అన్వేషించగా ఒక మారుమూల కుగ్రామంలో ఒక బండీ క్రింద నిర్వికారంగా కూర్చున్న రైక్వుడు కానవచ్చాడు. భటుడు ఆ సమాచారాన్ని మహారాజుకు చెప్పాడు.

జానశ్రుతి ఆ మర్నాడే రైక్వుణ్ణి చూడడానికి బయలుదేరాడు, ఆ మహాత్ముడికి ఇవ్వడానికని ఎన్నో బహుమానాలు పట్టుకొని.

తన దగ్గరకు ఆట్టహాసంగా వస్తున్న జానశ్రుతిని రైక్వుడు దూరంనుంచే చూసాడు. ఆధ్యాత్మికానుభూతిని పొంది, మనోనిశ్చలతనుపొందే సంకల్పంతో అతడు వస్తున్నట్లు గ్రహించాడు.

మహారాజు తాను తెచ్చిన అమూల్యమైన కానుకలను రైక్వునిఎదుటఉంచి, చేతులు జోడించుకుని నిలవబడి, ఆ కానుకలను గ్రహించాలనీ, తనకు ఆనందాన్ని చేకూర్చే తత్త్వజ్ఞానాన్ని బోధించాలనీ ప్రార్థించాడు.

నిర్మోహుడూ, ప్రశాంత స్వరూపుడూ అయిన శకట చోదకుడు ఆ కానుకలను గ్రహించలేదు. అతడు 'అయ్యా! వీటిని నాకిచ్చి, నావల్ల ఆత్మజ్ఞానాన్ని కొందామని నీవనుకుంటున్నావు. ఆత్మజ్ఞానం అంగడిలో అమ్మబడే పదార్థంకాదు. ఎన్ని రాజ్యాలిచ్చినా దాన్ని కొనలేవు. నీ అమూల్య వస్తువులకు ఇక్కడ విలువ లేదు.' అని మందలించాడు. జానశ్రుతి

(23వ పేజీ చూడండి)

## న్యాయం...

నాకు తెలుసు. న్యాయశాస్త్రం పేరిట మీరు చేసిన అన్యాయం ఒక అభిమానవతియైన అబల ప్రాణాల్ని బలిగొన్నదని నాకు తెలుసు. ఈ సంఘానికి ప్రతినిధులు మీరంతా! మారుతోన్న సాంఘిక వ్యవస్థని, వ్యక్తిలోని మానసిక వికాసాన్ని గుర్తించక పరువు ప్రతిష్ఠలకోసం మానవత్వాన్ని కోల్పోయిన మనుషులు మీరు.

నన్ను పెండ్లి చేసుకుంటున్న వ్యక్తి నాకన్యాయం చెయ్యడని, ఆయనకి, అన్నయ్యకి సంస్కారంలో కొన్ని యోజనాల దూరం ఉందనీ నేను భావిస్తున్నాను. నేను నిర్మించుకుంటున్న సౌధం ఒకవేళ నా తలరాతవల్ల నేలకూలిపోతే నీరజ ఉసురే నాకు తగిలిందని నమ్ముతాను. కాని ఆ క్షణం వచ్చినప్పుడుమాత్రం నా కాళ్ళ మీద నిలబడే ఉంటాను.

నేను చేస్తున్న ఈ పనివల్ల మీకు పెద్దగా హాని కలుగదనే భావిస్తున్నాను. ఎందుకంటారా — నాకు చెల్లెళ్ళెవ్వరూ లేరు, వాళ్ళకి పెళ్ళిళ్ళు కావని అనుకోవటానికి!

అయినా ఆడదాన్ని గనుక పుట్టింటివారి ఆశీర్వాదాన్ని అన్నివేళలా అందుకోవాలని ఆశిస్తున్నాను. ఈ ఒక్కపనైనా మీరు చెయ్యగల్గితే నీరజ ఆత్మ శాంతిస్తుందేమో!

మీ శారద.

గుడ్లు వచ్చి పిల్లని వెక్కిరించింది. పార్వతీశంగారు నమ్ముకున్నన్యాయశాస్త్రం ఈసారి మాత్రం ఆయన్ని ఆదుకోలేకపోయింది. శారదకి మైనారిటీతీరిపోయింది. అందుకే ఈ క్రొత్త సమస్యకి పరిష్కారమంటూ తోచలేదాయనకి.

కర్మ్ముడు ఎగతాళిగా గుండె లోతుల్లోకి చూసేడు. వెన్నెపొంగ, స్వామిని చిత్తచోరుడూ అతనికేసి చిలిపిగా, జాలిగా చూసేడు.

పార్వతీశంగారు ఉక్రోషం పట్టలేకపోయాడు. మరుక్షణంలో కేలండరు ముక్కలుముక్కలై నేలమీద పడిపోయింది.

ఆహార పదార్థాలలోనూ, పానీయాల్లోనూ—బిస్కెట్లు, చాక్లెట్లు, మత్తు పానీయాలూ—, మున్నగువాటిలో విస్తారంగా వుపయోగింపబడే తియ్యని రసాయనాలను సైక్లామేట్లు అంటారు. శాస్త్రీయంగా వీటిని సైక్లామిక్ ఆమ్లము యొక్క సోడియం, కాల్షియం లవణాలని చెప్ప వచ్చు సాధారణంగా చక్కెర కన్నా ముప్పదిరెట్లు తియ్యదనాన్ని కలిగివుండే పదార్థాలుయివి ఏమాత్రం ఆహారపు విలువలేని పదార్థాలివి.

ఆహార రూపంగ శరీరంలో ప్రవేశించే ఈ పదార్థాలు ఏమార్పు లేకుండా శరీరం వెలుపలకు వచ్చేస్తాయనీ, దాదాపు 80 శాతం పేగుల్లోనే ప్రయాణించేవి మూత్రంగా విసర్జింప బడుతాయనీ చాల కాలంపాటు శాస్త్రజ్ఞులు భావిస్తూ వుండేవారు. అంతే గాక 1950 వ సంవత్సరం కాలంలో అమెరికన్ శాస్త్రజ్ఞులు ఎలుకలపై గావించిన పరిశోధనల ఆధారంగా సైక్లమేట్లు విషఫలితాలనిస్తాయని తేలిందట. కానీ ఈ ఫలితాలు గోచరించేది శరీర భారంలో ప్రతి కిలోగ్రాము బరువుకూ సుమారు 6—12 గ్రాముల బరువులో ఇవి వుంటేనే నట. అంటే 50 కిలోగ్రాముల మనిషికి 300—600 గ్రాములన్నమాట

జపాన్ శాస్త్రజ్ఞులయిన డాక్టర్ కోజిమా, డాక్టర్ ఇచిబాగాసెలు 1966వ సంవత్సరంలో సైక్లమేట్లను గూర్చి గావించిన పరిశోధనల ఆధారంగా మనం గ్రహించిన ఈ పదార్థాలు ఏమార్పు లేకుండా ఎల్లప్పుడూ విసర్జింప బడవనీ, కొన్ని సందర్భాలలో సైక్లో హెక్సిలమీన్ అన్న మరొక పదార్థంగా మార్పు చెందుతాయనీ తేలింది. క్షీరదాలలో ఎలుకలపై గావించిన పరిశోధనలు ఈ సైక్లో హెక్సిలమీన్‌ను విషపదార్థంగా నిరూపించాయి. ప్రతి కిలోగ్రాముకూ సుమారు 60 మిల్లీగ్రాముల భారంలో ఈ పదార్థాన్ని ఎలుకలకు ఆహారంగా ఇస్తూ పరీక్షలు కొనసాగిస్తే వాటిలో కాలేయమూ, మూత్ర పిండాలూ బాగా దెబ్బ తిన్నాయట.

సైక్లమేట్ల నుండి ఏర్పడ్డ ఈ రసాయనం ఉనికిని తర్వాతి పరిశోధకులు కూడా నిర్ధారించారు. అయినా ఎంత శాతం వరకూ ఈ మార్పు సంభవిస్తుందో సరయిన లెక్కలు గట్టడానికి వీలు కాలేదు. ఒకటి మాత్రం నిజం! సైక్లమేట్లను గ్రహించే వ్యక్తుల్లో చాలమంది 0.5—1.0 శాతం సైక్లో హెక్సిలమీన్‌నూ, కొందరుసుమారు 70 శాతం వరకూ ఈ పదార్థాన్ని మూత్రంలోని అంశంగా విసర్జిస్తారు. ఈనాటివరకూ ఈ పదార్థం శరీరంలో ఎక్కడ (జీర్ణనాళం? పేగు? కాలేయం?) మార్పు చెందుతున్నదో శాస్త్రజ్ఞులకే అంతు బట్టని విషయంగా వుంది. ఆస్ట్రియన్ పరిశోధకుల బృందం ఒకటి గినీ పందుల్లో గావించిన ప్రయోగాలు ఈ రంగంలో కొంత కాంతిని వెలువరచాయి.

ప్రతిదినమూ ఒక కిలోగ్రాము ఆహారంలో 0.3 గ్రాముల సైక్లమేట్ పదార్థాన్ని కలిపి గినీపందులకివ్వటం ద్వారా (మానవునిలోనయితే దినానికి 21 గ్రాములివ్వ వలసి వస్తుంది) చేసిన ఈ పరిశోధనా ఫలితాలుతేల్చిన విషయం. ఈజంతువుల్లో కాలేయం




బాగా దెబ్బతిని తొలిదశలలో వున్న కాన్సర్ లక్షణాలను చూపిస్తున్నదట. ఈ ప్రయోగాలు ఇతర శాస్త్రజ్ఞులచే ధృవీకరించ బడనూ లేదు. నిరాకరించ బడనూ లేదు కూడా.

శాస్త్రజ్ఞుడిలోనూ, సామాన్యుడిలోనూ నిరపాయకరంగా సైక్లమేట్లు ఉపయోగాన్నిగూర్చి అనుమానాన్ని రేకెత్తించటానికి ఇంతమాత్రం పరిశోధనలు చాలు. వీటిని అనుమానించే వారికి మరొక పిడుగులాంటి వార్తను అందించిన వ్యక్తి, డాక్టర్ మార్విన్ లెగేటర్. అమెరికా ప్రభుత్వంలో ఆహార—ఔషధసంస్థ యొక్క కణజీవ శాస్త్ర విభాగపు అధిపతి అయిన ఈయనా, ఇతని సహచరులూ వెల్లడించిన మరొక విషయం మరీ భయంకరమైనది. సైక్లో హెక్సిలమీన్ పదార్థం బీజకణాల్లోను, (జెర్మ్ సెల్స్) ఎముక గుజ్జు (బోన్‌మ్యారో) లోను వుండే క్రోమో జోములను స్పష్టంగా ముక్కలు ముక్కలుగ జేస్తుందని వారి పరిశోధనల సారాంశం ('న్యూసైంటిస్ట్'— డిసెంబరు 1968) ఎలుకలపై వీరు చేసిన ప్రయోగాల ఫలితంగా బీజ కణాల్లో 16.5 శాతము, ఎముకగుజ్జులో 12.5 శాతమూ క్రోమో జోములు ముక్కలు ముక్కలుగ అగుపడ్డాయి. ఇలా జరగటానికి ప్రతి కిలోగ్రాము శరీరపు బరువుకూ 50 మిల్లీగ్రాము డోసేజి చాలట. రక్తకణాల జన్మస్థానమైన ఎముకగుజ్జులోని క్రోమో జోముల్లో సంభవించే యిలాంటి మార్పులు ఎన్నో రకాల రక్త వ్యాధులకు (అనువంశికంగా వచ్చే వాటికి కూడా) దారితీస్తాయి. తక్కువ తరగతి జంతువుల్లో నయితే నియోప్లాసియా, అర్బుదాలనున్నూ కలిగిస్తుంది. బీజకణాల క్రోమో జోముల్లో సంభవించే మార్పులు బిడ్డలలో వంశ పారంపర్యంగా వ్యక్తమయ్యే అవకతవకలకు దారి తీస్తాయి.




ఆహార పానీయాల ద్వారా ఇలాంటి అనువంశిక ప్రమాదాలకు దారి తీసే సైక్లామేట్ల ఉపయోగాన్ని నివారించే బాధ్యత ప్రభుత్వానిది, శాస్త్రజ్ఞులదే కాక, తల్లి తండ్రుల మీద కూడా వుంది.

— పి. రమేష్ నారాయణ

# ధర్మపథం

(22వ పేజీ తరువాయి)

మారు మాటాడకుండా వెనక్కి వెళ్ళిపో వలసి వచ్చింది

కొన్నాళ్ళు జరిగాక మళ్ళీ మహారాజు రైక్వుని దగ్గరకు వచ్చాడు ఈసారి నిర్మల హృదయంతో అడకువతో వ విలిచి తన్నను గ్రహించి ఆత్మబోధ చెయ్య అని ప్రార్థించాడు. రాజు హృదయం పరిపక్వదశకు వచ్చిందని రైక్వుడు తెలుసుకున్నాడు. తెలుసుకుని 'రాజా! ఆత్మను అనేకమంది అనేకవిధాలుగా ఊహిస్తూ, ఆరాధిస్తారు. అది దేని సృష్టీ కాదు. అంటికీ అదేకారణం. అన్నీ ఆత్మకు చెందే ఉన్నవి. అన్నిటికీ అదేస్థానం. నీవు చేసే దానాలకు గర్వపడ్డావు. దానాలు చెయ్య వలసిందే గాని దర్పం పనికిరాదు. అది అహంకారాన్ని పుట్టిస్తుంది. వినాశనానికి దారితీస్తుంది. కీర్తి రావాలని కోరుతూ దానం చెయ్యవద్దు. ఆత్మ నాకు ఇచ్చినదాన్ని ఇతరులకు అందిస్తున్నాననే భావనతో దానం చెయ్యి. దానివల్ల ఆత్మానుభూతి కలుగుతుంది. తృప్తి కలుగుతుంది' అని బోధించాడు.

రాజుకు ఎంతో తృప్తి కలిగింది. ఈ సారి అతడు ఇచ్చిన బహుమతులను రైక్వుడు తిరస్కరించ లేదు.

సీరియల్

యర్రం చంద్రశేఖరం

### జరిగిన కథ

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. లక్ష్మయ్య గారికి గుండె జబ్బు వస్తుంది. ఆయనకు శ్రమ యివ్వకుండా వుండటానికి రామం చదువు హెచ్. ఎస్. సి తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శాంత ఒలవంలం మీద శారద కూడా ఎక్స్‌కర్షన్‌కు బయలుదేరుతుంది. ప్రభాకరానికి నీరజకు పెళ్లి చెయ్యాలని అందరి సంకల్పం సెలవులకి శాంతతో వచ్చిన శారద సత్ప్రవర్తనతో అందరి అభిమానమూ సంపాదించు కుంటుంది. ప్రభాకరం రోజా హోజాలో పడి చేసిన దొంగతనాన్ని నీరజ బయట పెడుతుంది.

## 7

హాస్టలులో రాత్రి భోజనాలు ముగిశాయి. చాలా రాత్రివరకు ఇద్దరూ చదువుకున్నారు. ఆ తర్వాత శాంత పడుకొని నిద్రపోయింది. సాయంత్రం సుందరంతో జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చి ఆ ఆలోచనలో పడింది శారద.

'హూఁ...పల్లె జీవితమంటే విందుకో విసుగు? ఈవిధంగా ఆలోచిస్తూ పల్లెలను నిర్లక్ష్యం చేస్తూ, బస్తీ విలాసాలకు అలవడి, నిజమైన జీవితం అదేనని భ్రమ పడుతూ తమకు తాము తీరని ద్రోహం చేసుకుంటున్నారు. వైద్యవృత్తిలో పట్టా తీసుకోబోతున్న సుందరం, తను పుట్టి పెరిగిన స్థలాన్ని అసహ్యించు కుంటున్నాడంటే నాకు ఎంతో బాధ కలుగుతూ ఉంది. ఒకవేళ అతను ఇక్కడ ప్రాక్టీసు పెట్టినా బాగా సాగుతుందన్న నమ్మకం లేదు. బోలెడుమంది డాక్టర్లు, స్పెషలిస్టులు ఉన్నారిక్కడ. ఇక ఉద్యోగ విషయం. ఉద్యోగంలో స్వతంత్రం వుండదు. రామం అన్నయ్య అభిప్రాయం ప్రకారం చక్కగా ఆ ఊరిలో ఉంటే గౌరవ మర్యాదలు మన్నన లభిస్తాయి. కాని అతను ఆ విషయంలో అన్నయ్య అభిప్రాయంతో ఏకీభవిస్తాడన్న నమ్మకం నాకేమాత్రం కలగడం లేదు. ఒక్క సుందరమే కాదు గ్రాడ్యుయేటు పాశ్చాత్య మత సాంప్రదాయాలను సంస్కృతీ సభ్యతను విస్మరించి తామేదో నవ నాగరికులమనుకుంటున్న వారెందరో ఉన్నారు—

'ఈ విధంగా మనము కేవలము నవ నాగరికతా వ్యామోహంలో పడి కొట్టుమిట్టాడిపోతున్నాము. ఎవరైనా ఒకరు సనాతన ఆచార వ్యవహారాలను మరచిపోలేక వాటిని పాటిస్తూ వుంటే వారిని హేళన చేస్తున్నాము. ఇలా ఎంతకాలం సాగుతుంది? స్వాతంత్ర్యం సిద్ధించి రెండు దశాబ్దాలు దాటుతున్నా మనం హిందూ ధర్మాన్ని సక్రమంగా పాటించలేక పోతున్నాం ఆ ప్రయత్నాలు చేయలేక పోతున్నాం. భవిష్యత్తులో పాటించగలమా? ఏమో? ప్రజలలో చైతన్యం రావాలి. అదెలా సాధ్యం? పూర్వం వచ్చిన చైతన్యం ఎలా రాగలిగింది...? ... అవును......మళ్లీ హిందూ మతాన్ని పునరుద్ధరించగల రచనలు కావాలి. రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, అరవింద మహర్షి, రమణ మహర్షి, అప్పటి ఆ సంఘంలోని కుళ్ళును కొంతవరకు తొలగించగలిగారు. వివేకానందుని సింహగర్జన యితర దేశాలను కూడా దద్దరిల్ల జేసింది. ఇప్పుడు కూడా ఎవరైనా ఆ విధంగానే పూనుకోవాలి.' అని ఆలోచిస్తూ ఒక దృఢ నిర్ణయానికి వచ్చి చాలా పొద్దుపోవడం వల్ల అలసటతో నిద్ర పోయింది శారద.

* * *

సాయంత్రమైంది. దినకరుడు పశ్చిమానికి పయనించాడు. పడమటి దిక్కు అరుణవర్ణంలో రాగరంజితమైంది. నీరజ శ్రీపతిగారు యింటి ముందున్న తోటలో కూర్చున్నారు ప్రభాకరాన్ని గురించి ఆలోచిస్తూన్న నీరజ ముఖంలో వచ్చిన ఎర్రదనం ఆనాటి సంధ్యా సమయ అరుణ కాంతితో పోటీ పడుతోంది. ఎలక్షనులో పోటీ చేసి ఓడిపోయిన అభ్యర్థిలా విచారంలో దీనంగా ముఖ కవళికలను మార్చి కాని ఆమెకు యెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నారు శ్రీపతిగారు. ఎండాకాలం అప్పుడే ప్రారంభమౌతోంది. తోటలో కూర్చున్నప్పటికీ ఏదో తీవ్రమైన ఆలోచనలలో సతమతమౌతూ వుండడం వల్ల వారిద్దరి ముఖాలపై చెమట బిందువులుద్భవిస్తూ ఒక్క క్షణం ముత్యాలలా మెరుస్తూ, క్రమంగా ధారలు కట్టి క్రిందికి చేరుకున్నాయి.

ప్రభాకరానికి, వారిద్దరికీ మధ్య జరిగిన వాగ్వివాదమే వారిద్దరినీ ఆ స్థితికి తీసుకువచ్చింది. ప్రభాకరం అప్పుడు ఆ రెండు వేల రూపాయలు తీసినప్పటి నుండీ శ్రీపతిగారు ఎంతో జాగ్రత్త పడుతున్నారు. అందువల్ల ప్రభాకరం ఆట కట్టింది. ప్రతి వారం రోజులకొకసారి

డబ్బు విషయంలో తండ్రితో పేచీ పడుతూ, చిర్రు బుర్రు లాడుతున్నాడు. అయినా ఈసారి శ్రీపతిగారు తమ మనసు కఠినంగా మార్చుకున్నారు. ఎంత పోరాడినా ప్రభాకరానికి మాత్రం పుష్కలంగా డబ్బు వదలుచుకోలేదు. రెండు గంటల క్రితమే తండ్రికి, కొడుకుకి జరిగిన ఘర్షణలో నీరజ పాల్గొని ప్రభాకరం చేత తీవ్రంగా అవమానించబడింది.

'మామయ్యా! ఇంక లాభం లేదు. ఇంతకాలం అతనిలో మార్పు వస్తుందని ఊహించాను. నేను, నాన్నగారు ఈ ఇంట్లో వుండడం అతనికి ఎంతో కష్టాన్ని కలిగిస్తూ వుంది. ఓర్వలేక పోతున్నాడు. ఎంత దగ్గరి బంధువులమైనా ఎంత కాలమని మీ యింట్లో ఉండగలం?' ప్రభాకరం అవమానించాడన్న ఉక్రోషంతో జేవురించిన ముఖ కవళికలతో చిటపటలాడుతూ అంది నీరజ

'అమ్మా! నీవు యిలా మాట్లాడడం న్యాయంకాదు. మీరు వచ్చినప్పటినుండి ఈయిల్లు ఎంతో కళకళలాడుతూ ఉంది. వాడివిషయం నీకు తెలియనిదా! అవివేకత్వంతో కూడుకున్న మూర్ఖత్వం. కొన్ని కొన్ని విషయాలు చెప్పగానే అర్థం చేసుకుంటాడు ... వింటాడు.' దిక్కుతోచక బాధపడుతూ అన్నారు శ్రీపతిగారు.

డాక్టరు దగ్గరకు వెళ్ళి అప్పుడే లోపలికివస్తున్న సుందరరామయ్యగారు శ్రీపతిగారి మాటలు విన్నారు.

'బావగారూ! అమ్మాయి నేను ఒక నిర్ణయానికి వచ్చాను. అమ్మాయికి ప్రభాకరాన్ని చేసుకోవడం యిష్టంలేదు.



విన్నిసార్లో మీకు చెబుదామని; ఆవిషయం తెలిస్తే మీరు ఎక్కువ బాధ పడతారేమోనని సంకోచిస్తూ చెప్పలేకపోయాను. నాకు వైద్యంచేస్తున్న డాక్టరుగారి యింటికి దగ్గరలోనే ఒక యిల్లు అమ్మజూపు తున్నారు. ధర ఖాయంచేసి అడ్వాన్సు యిచ్చాను. నాలుగైదు రోజులలో రిజి స్ట్రేషను జరుగుతుంది. రేపు మంచిరోజు. అందులో ప్రవేశించాలను కుంటున్నాము. అందులో కిరాయికి ఉన్నవారు విన్నానే ఖాళీ చేశారు' అప్యాయతతో మాట్లాడినా ఆమాటలు విష్కర్షగా ఉన్నాయి.

ఒక్కక్షణం నిశ్చేష్టు లయ్యారు శ్రీపతిగారు. మెల్లిగా తేరుకొని 'బావా! అంతేనా? మీ నిర్ణయానికి తిరుగులేనా?' కన్నీరునిండిన కళ్లతో సుందరరామయ్య గారి వైపు నీరజవైపు దీనంగా చూస్తూ అన్నారు శ్రీపతిగారు.

'మీరు బాధపడతారని నాకు తెలుసు. చూస్తూ, చూస్తూ అమ్మాయిని ప్రభాక రానికి యివ్వలేను. మీరు ఏవిధంగా భావించినా మంచిదే! అమ్మాయికి అసలు యిష్టంలేదు. బంగారు కత్తి అని మెడ కోసుకోలేము కదా!' మిన్నువిరిగి మీద పడినా తన నిర్ణయం మారదన్నట్లుగా ఉన్నాయి ఆయనిమాటలు.

హతాశులయ్యారు శ్రీపతిగారు నీరజ వైపు చూస్తూ 'నీవల్లనైనా వాడు బాగుపడతాడను కున్నాను. నా ఆశలన్నీ అడియాసలయ్యాయి. నీవు యిష్టపడడం లేదని నాకు కోపం లేదు తల్లీ! ఎంత పేదకోడలినైనా నీవు చదువు. సంస్కార మున్నదానవు. యుక్తవయస్కురాలవు. బల వంతం చేయడం నాకూ న్యాయంకాదు పోనీ ప్రభాకరాన్ని వివాహం చేసుకోక పోతేగానే, ఈయింట్లోనుండి మాత్రం వెళ్లిపోకండి. నలుగురు యింట్లో ఉండడం నాకు కాస్త ధైర్యంగా ఉంటుంది.' భుజంపైఉన్న కండువాతో కళ్ళు తుడుచుకుంటూ అన్నారు శ్రీపతి గారు

'లేదు. ఎక్కడ ఉండవలసిన వాళ్లు అక్కడ ఉండడం మనందరికే మంచిది. నీవు చెప్పకండి మామయ్యా! పాపం! దిక్కులేని ఆ అమాయకురాలు శారదపై ప్రభాకరం దొంగతనం అంటగట్టాడని!

[illegible]

అటువంటి ప్రయత్నం ఒకటిరెండుసార్లు నావట్లకూడా జరిగింది. తెలివిగా తప్పించుకున్నాను. నీకు చెబితే యింకా బాధపడతావని నీకు చెప్పలేదు. అలా చెప్పి యిద్దరిమధ్య కలతలు పెంచడం నాకిష్టం లేదు. చూస్తూ ఊరకోవడానికి అంత కన్నా మనసొప్పడంలేదు. అటువంటప్పుడు నేనేం చేయగలను? నీకు ఏవిధంగానూ ఈ విషయంలో తోడ్పడలేక పోతున్నాను మామయ్యా!' తన అసహాయతను వ్యక్తం చేస్తున్నాయి ఆమె మాటలు.

'మంచిది తల్లీ...! ఈ విషయంలో యిక నేను బలవంతపెట్టను. మీరు వేరే ఉన్నా నీవుమాత్రం తరచుగావచ్చి మమ్మ లను కాస్త కనిపెడుతూ ఉండాలి' దుఃఖంవల్ల మాటలు తడబడ్డాయి. వణకుతున్న చేతులతో కన్నీరు తుడుచు కుంటూ నీరజముఖంలోకి తన అసహాయ తతో నిండినకళ్లతోచూశారు శ్రీపతిగారు.

వారిపరిస్థితికి బాధవల్ల నీరజ కళ్ళు కళ్లుకూడా చెమ్మగిల్లాయి.

'ధైర్యంగా ఉండు మామయ్యా! ఆ దేవుడిపై భారం వేయడంకన్న మన మేం చేయగలం?'

'అంతకన్న చేయగలిగింది మాత్రమే ముందమ్మా! అంతా వాడిలీల. వాడిచేతిలో కీలుబొమ్మలం. ఎలా జరుగవలసి ఉంటే ఆలా జరుగుతుంది.' దీర్ఘంగా నిట్టూ రుస్తూ అన్నారు శ్రీపతిగారు.

* * *

సుందరరామయ్యగారు నీరజ శ్రీపతి గారి యింటినుండి వెళ్లిపోయారు. వారం రోజులనుండి ప్రభాకరం ఇంటు డబ్బు చేతిలో అందక అటురోజా కోరికలు తీర్చ లేక చికాకుపడుతున్నాడు. రోజా ప్రవర్త నలో వచ్చినమార్పును ఆరుమాసాలనుండి గమనిస్తూనే ఉన్నాడు. తనవద్ద పుష్క లంగా డబ్బు ఆడనందుకు, రోజాను తృప్తిపరచ లేనందుకు ఎంతో బాధపడు తున్నాడు. అక్కడికి ఒక వెయ్యిరూపాయల వరకు నలుగురైదుగురివద్ద అప్పుచేశాడు. అంతకుమించి అప్పుదొరకడంకూడా సాధ్య పడలేదు. ఏమీతోచక నిప్పులో ఉప్పు వేసినట్లు చిటపట లాడుతున్నాడు ప్రభా

కరం. రోజా తనను నిర్లక్ష్యం చేయడాన్ని సహించలేక పోతున్నాడు. నీరజ సుందర రామయ్యగారు తమ యింటినుండి వెళ్లి పోవడంతో హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. అయినా తన తండ్రి డబ్బు యిస్తాడన్న ఆశమాత్రం అతనికిలేదు.

ప్రభాకరం ఒకరోజు సాయంత్రం నాలుగు దాటినతర్వాత చీకాకుపడుతున్న మనస్తత్వంతో 'ఫ్రెండ్సుసర్కిల్' క్లబ్బుకు వెళ్లాడు. ఆ క్లబ్బు ప్రభాకరం, అతని స్నేహితులుఏర్పరుచుకున్నది. దానికి ప్రధాన పోషకుడు ప్రభాకరం. కొన్ని నెలల క్లబ్ బిల్డింగుకిరాయి. కరెంటుచార్జీలు కట్టాలి. కరెంటు చార్జీలు కట్టక పోవడంవల్ల కరెంటు డిస్కనెక్టు చేశారు. అందుకని క్లబ్బు ప్రస్తుతం సాయంత్రం ఆరు గంటలవరకే పనిచేస్తూ ఉంది. చీకటి పడబోయేముందు క్లబ్బుకు తాళం వేస్తు న్నారు

ఆరోజు ఆదివారం. శలవు. ప్రభాకరం క్లబ్బుకు వెళ్లేసరికి క్లబ్బంతా కోలా హలంగా ఉంది. ఒక టేబులు దగ్గర కూర్చొని రోజా నలుగురితో పేకాడుతూ ఉంది మరొక టేబులుదగ్గర యిద్దరు అబ్బాయిలు, యిద్దరు అమ్మాయిలు కారమ్సు ఆడుతున్నారు. వేరొక టేబులు దగ్గర మరొక స్నేహితుడొకడు అతని స్నేహితురాలితో చెస్ ఆడుతున్నాడు. సిగరెట్ల పొగ, డ్రింకులతో నిండిన గాజు గ్లాసుల గలగలలు, వాతా వరణమంతా సందడిగా ఉంది. అక్కడ ఖాళీగా వున్న ఒక కుర్చీలో కూర్చొని ఒక న్యూస్‌పేపరు చదువుతూ ఉన్నట్లు నటిస్తూ రోజావైపు రహస్యంగా చూడ సాగాడు. ఎవరి సందడిలో వారుండి ప్రభా కరాన్ని ఎవ్వరూ గమనించలేదు.

పేకముక్కలు కలిపి అందరికీ పంచింది రోజా. అలా పంచడంలో చేతు లనూ తాకుతూ, అందరినీ క్రీగంట చిరు నవ్వుతో పలకరిస్తూ, అందరి మతులనూ పోగొడుతూ వుంది. అందరూ తమ తమ ముక్కలను ఎత్తి వరుసలో పెట్టుకున్నారు. ఆట ప్రారంభమైంది. అయిపోయింది. రోజా గెలిచింది. అందరూ ఆమెకు ఇవ్వ వలసిన దానికన్న ఎక్కువే యిచ్చారు. ఎక్కువగా ఇచ్చామన్న ధైర్యంతో ఒకరు

# ప్రపంచం యావత్తూ!





**బుష్ సమర్పిస్తున్నారు మొట్ట మొదటి నిజమైన సరిక్రొత్త 4 బాండుల ట్రాన్సిస్టరు సెట్టు బ్రిగేడియర్—ప్రపంచంలో ఎక్కడ ఉన్న స్టేషనునైనా పట్టుకొన గలిగినంత శక్తివంతమైనది.**

సకల ప్రపంచమును మీ గృహ ప్రాంగణంలోనికి వాస్తవంగా తీసుకు వస్తుంది బుష్ బ్రిగేడియర్. సాటి సెట్లలోకన్న 25% అధికమైన సిగ్నలు-నాయిస్ నిష్పత్తిగల ఉదాత్తమైన స్వప్న సదృశమైన శబ్ద గ్రహణత. ధ్వని సిద్ధాంత రీత్యా, ప్రత్యేకముగా రూపొందింపబడిన విలువమైన మాట్ ఫినిష్ కలిగియున్న కొయ్య కాబినెట్ కారణంగా గంభీరంగా, విస్పష్టంగా ధ్వనించే విశిష్టమైన నాదం. శక్తివంతమైన 15 సె.మీ. x 10 సె.మీ. అండాకారపు స్పీకరు నుండే ఉత్పన్నమయ్యే నమ్మ శక్యము కానంత 'సానురూప్యత' గల శబ్దం. 100 పాయింట్ల ఖచ్చితమైన లాగింగ్ స్కేలు వల్ల, స్టేషన్లను పట్టుకొనుటలో అసాధారణ సౌలభ్యత ▢ నేడే బ్రిగేడియర్‌ను వినండి. ఒక్కసారి విన్నంతనే పడిపోతారు ప్రేమలో. వ్యవధి ఉంటే, ఒక్కసారి దానివంక తేరిపార చూడండి. అంత అందంగా ఉన్నా, అంత శక్తివంతంగా కూడా ఎట్లా ఉందా అని ఆశ్చర్యపోతారు.

## బుష్ బ్రిగేడియర్

వెల: రు. 415/- (ఎక్సైజుతో సహా; అమ్మకం పన్ను అదనం)

రోజా అందాన్ని; మరొకరు ఆమె అందా
నికి ముఖ్య కారణమైన ఒంపు తిరిగిన
ఆమె పెదిమలను, వేరొకరు ఎర్రగా ఉండి
చూపరులను రెచ్చగొడుతూన్న ఆమె బుగ్గ
లన్నూ, ఇంకొకరు ఆమె చిలిపి కళ్లను
పొగుడుతూ ఉన్నారు. ఆమె అందరికీ
థాంక్సు చెప్పి, ఒకరితో చేతులు కలు
పుతూ మరొకరికి తన చేతిని ముద్దెట్టు
కోవడానికి అనుమతినిస్తూ, యింకొకరికి
కన్ను కొడుతూ ఎంతో అసభ్యంగా ప్రవ
ర్తిస్తూ వుంది. ఆమె ప్రవర్తనతో ప్రభా
కరం హృదయం అగ్నిమీద గుగ్గిలం చల్లి
నట్లు భగ్గుమంది. రోజా ఆమె హృద
యాన్ని అతని ఒక్కనికే అర్పించిందనీ,
తనతో తప్ప మరొకరితో చనువుగా ఉండ
డం లేదనీ అనుకుంటూ వచ్చాడు. ఒక
రిద్దరు ఈ విషయంలో హెచ్చరించినా
వినమ్మలేదు. ఇప్పుడు కళ్లారా చూస్తు
న్నాడు. ఇంకా ఏం జరుగుతుందో నని
ఉదుర్నా పడసాగాడు. అతని కళ్ళు నిప్పులు
కురుస్తున్నాయి. ఆవేశంతో వొణికిపోతు
న్నాడు.

ఆ నలుగురిలో ఒకడు రోజా బుగ్గ
గిల్లాడు. వాడివైపు చిరునవ్వుతో
చూస్తూ, చిరుకోపం నటిస్తూ 'యూ
సిల్లీ బోయ్! వాటీస్ దిస్ ఎడ్వంచర్?'
అంది.

'అదీ ఒక ఎడ్వెంచరే?' అని మరొ
కడు రోజాను దగ్గరకు లాక్కుని ఆమె
బుగ్గలను సున్నితంగా ముద్దెట్టుకున్నాడు
ఇంకొకనికి కన్ను గీటుతూ యిక నీవంతు
అన్నట్టు చూసింది రోజా! వాడు కూడా
ఏదో ఒక చిలిపి పని చేశాడు. నాలుగవ
వాడు మాత్రం 'డియర్ రోజా! ప్రభా
కరం చూస్తే ఉన్న భయం లేదా?' కాం
క్షను కళ్లల్లోనే మరుగు పరుస్తూ
అన్నాడు. అతను ప్రభాకరానికి కొద్దిగా
సన్నిహితుడు.

'అతని స్నేహానికి విడాకు లిచ్చేశాము
డియర్!'

'కారణం ?'

'ఏమీ లేదు' అతనిలో సరదా చచ్చి
పోయి చాలా కాలమైంది. రసం పోయిన
పిప్పిలా అయ్యాడు. ఆ ముఖం చూస్తేనే
కోపం వస్తూ వుంది. పూర్ ఫెల్లో!' అని
ఏదో పెద్ద జోకు చేసినట్టు పెద్దగా

## మల్లైలం...

నవ్వింది. ఆమెను సంతోష పెట్టడానికి
మిగతా నలుగురూ ఆ నవ్వులో తమ నవ్వు
కలిపారు

ఇక ఆగలేకపోయాడు ప్రభాకరం. తను
కూర్చున్న చోటునుండి లేచాడు. కళ్లల్లో
నిప్పులు కురిపిస్తూ, పిడికిలి బిగించి,
బరువుగా పెద్ద పెద్ద అడుగులు వేస్తూ
వారు కూర్చున్న ఆ టేబులువైపు నడి
చాడు. అతనిని ఆ రూపంలో చూసిన ఆ
నలుగురు మిత్రులూ టేబులు దగ్గరినుండి
జారుకున్నారు. రోజామాత్రం, తొణక
కుండా, బెణకకుండా అలా కూర్చుంది. ఆమె
ధైర్యం అతనిని మరీ రెచ్చగొట్టింది.
టేబులుముందుకు వెళ్లి రోజాను నమిలి
మింగేస్తేలా చూస్తూ 'రోజా!' అని
బిగ్గరగా కేకవేసి తనకున్న బలమంతా
వినియోగించి బల్లపై గుద్దాడు. పేక
ముక్కలన్నీ చెల్లాచెదరై పోయాయి.
గ్లాసులు క్రిందపడి పగిలిపోయాయి.

ప్రభాకరం కళ్లల్లోకి చూసిన రోజా
ఒక్కక్షణం భయంతో వణికిపోయింది.
తడబడింది. వెంటనే నిల్దొక్కుకొని
'ప్రభాకర్! ఏం జరిగింది? ఇలా ఉన్నా
వేమిటి? నాన్నగారితో ఏమైనా పోట్లా
డావా ఈరోజు?' కష్టించే ధ్వనితో ప్రభాక
రాన్ని చూస్తూ అడిగింది రోజా.

'చాలు! నీవేషాలు కట్టిపెట్టు. అర
గంటనుండి నీ ప్రేమ కలాపాలు చూస్తూనే
ఉన్నాను. నన్ను యిక మభ్యపెట్టలేవు.
ఇందుకు నీ సంజాయిషీ ఏమిటి?'
సింహంలా గర్జించాడు ప్రభాకరం.

'నీకు సంజాయిషీ యివ్వవలసిన అవ
సరం నాకులేదు. అయినా నీవు నామెడలో
తాళిగట్టిన భర్తవా? అసలు నన్ను బెది
రించడానికి నీవెవరు?' ఎర్రబడిన
ముఖంతో కోపంగా అంది రోజా

'ఛీ...! బజారు స్త్రీలుగూడా నీలా
ప్రవర్తించరు. బుద్ధి గడ్డితిని పెద్దవారిని
నిర్లక్ష్యంచేసి గుడ్డిగా నిన్ను నమ్మాను.
పయోముఖ విషకుంభానివని తెలుసుకో
లేకపోయాను తగిన శాస్తిచేశావ్?'
చలిజ్వరం వచ్చినవాడిలా ఆవేశంతో
వణికిపోతున్నాడు ప్రభాకరం.

'ఏమిటీపిడా మిష్టర్! అసలు
నీకునాకు ఏమిటి సంబంధం? మర్యాదగా
మాట్లాడు. లేనిపక్షే మంచిదాన్నికాదు.
మర్యాద యిచ్చి పుచ్చు'కో' మండే
నిప్పులాంటి కళ్ళతో ప్రభాకరాన్ని
చూస్తూ అంది రోజా...

'హుఁ...నీబుద్ధి చూపించావ్! అనవ
సరంగా మాట్లాడి నన్ను రెచ్చగొట్టకు'

'ఏం చేస్తావు? అయినా నీతో యింత
సేపు మాట్లాడడం నాదే బుద్ధితక్కువ'
ముఖం చిట్లిస్తూ అంది రోజా.

'రోజా!'

ఆ గావు కేకతో అక్కడున్న వారంతా
ఉలిక్కిపడ్డారు. రోజా చావు మూడిందని
అంతా అనుకున్నారు ప్రభాకరానికి కోపం
వస్తే ఎవరినైనాసరే లెక్కచేయడు కాని
అలా జరుగలేదు.

'ఛీ...యిక నీముఖం చూడను' అని
చేయి ఎత్తినవాడల్లా ఎత్తినట్లే దించేసి
తల వంచుకొని అక్కడవున్న కుర్చీలో
కూలబడి ఆలోచనలో పడ్డాడు. 'రోజాను
కొట్టి లేనిపోని గొడవలు ఎందుకు తెచ్చి
పెట్టుకోవాలి? ఒక ఆడదాన్ని కొట్టా
నన్న అపఖ్యాతి నాకెందుకు? ఎవరి మంచి
చెడ్డలూ వారివెంటే ఉంటాయి. డబ్బుం
దానికన్న అసహ్యంగా ప్రవర్తిస్తూ ఉంది
ఈ రోజా. వాళ్లకు కట్టు బొట్లూ
నియమాలూ ఉంటాయి. దీనిలా
ఒకేసారి నలుగురిని కవ్వించరు వాళ్లు.
హుఁ...దీనిననవలసిన పనిలేదు. పైమెరు
గులు, తళుకుబెళుకులు చూసి మోస
పోయాను. 'డబ్బు లేకపోతే దొంగది
తల్లి వరుస' అని నాన్నగారు అంటూ
ఉండే సామెత యిప్పుడు గుర్తుకు వస్తూ
ఉంది. రోజా నా జీవితంలో ప్రవేశించి
బెల్లమున్నంతసేపు ఈగలు ముసిరినట్లు
నా చేతిలో డబ్బులు ఆడినంతసేపు నేను
తాన అంటే తను తందాన అంది.
నా దగ్గర డబ్బులు ఆడకపోవడంవల్ల
శూలాలవంటి తన మాటలతో నా
హృదయాన్ని గాయపర్చింది. కాలికి
ముల్లు గుచ్చుకుంటే తీసి అవతల పారేసి
నట్లు ఈమెనుకూడా విసర్జించాలి.
అవును— దుష్టుల స్నేహాన్ని దబ్బిచ్చి
వదిలించుకోవాలని, మంచివారి స్నేహాన్ని
డబ్బిచ్చి పొందాలనీ అంటారు. అది నా
పట్ల నిజమైంది. ఈ నాటితో తని

విరిగడయింది. ఇంతకాలం రోజా స్నేహంతో డబ్బు, అంతకన్నా విలువైన కాలం అన్నీ వృథా అయ్యాయి.' ఈ విధంగా ఆలోచిస్తున్న ప్రభాకరానికి రోజా మెల్లగా అడుగులు వేస్తూ వెళ్ళడం కనిపించింది. ఆవేశం తగ్గిపోయింది.

'రోజా! ఆగు.' ఎంతో సరళంగా ఉన్నాయి అతని మాటలు.

ప్రభాకరం మాటలలోని మృదుత్వానికి ఆశ్చర్యపడుతూ ఆగింది రోజా. ఆమె ఎంత ధైర్యంగా వున్నట్లు నటిస్తూ ఉన్నా ఆమె గుండెలు గుబ గుబ కొట్టుకుంటూనే వున్నాయి. ఆమె పరిస్థితిని గమనించిన ప్రభాకరం 'భయపడకు రోజా! నిన్నేమీ చెయ్యను. నీవు ఒక విధంగా నాకు మేలు చేశావు. నీవిలా ప్రవర్తించి నా కళ్ళు తెరిపిళ్ళ పడేట్లు చేశావు. మొదట్లో నీ అసభ్య ప్రవర్తన చూసిన నాకు నిన్ను నులిమెయ్యాలన్నంత కోపం వచ్చింది. కాని తర్వాత నా నిర్ణయాన్ని మార్చుకున్నాను.'

అతని ముఖం నిర్మలంగా ఉంది. అతనిని చూసిన రోజా మనసు కుదుట పడింది.

'ప్రభాకర్? నన్ను క్షమించు.' తల దించుకొని అంది రోజా.

'నేనెంతటివాణ్ణి...? ఆ భగవంతుడే నిన్ను క్షమించాలి. శలవు! బ్రతికి బాగుంటే మళ్ళీ కలుస్తాను.' అని క్లబ్బును విడిచి పిచ్చిగా ఎటో వెళ్ళిపోయాడు ప్రభాకరం.

* * *

క్లబ్బు వదిలి వెళ్ళిన ప్రభాకరం పిచ్చిపిచ్చిగా తిరిగి ట్యాంకుబండు చేరుకున్నాడు. అతను అక్కడికి చేరేసరికి నలువైపులా చీకట్లు ముసురుకున్నాయి. ఎక్కువగా జనం లేని చోట ఒక బెంచిపై కూర్చుని ఆలోచనలో పడ్డాడు. అతని చిన్నప్పటి నుండి జరిగిన సంఘటనలన్నీ వరుసగా గుర్తుకు రాసాగాయి. 'దుడుకుతనం, మొండితనంతో నాన్నగారిని అమ్మను యింతకాలం హింసించాను. ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లల నుండి మంచి, మన్నన, పెద్ద వయసులో అండదండలు కోరుకుంటారు. అవేవీ నేను యివ్వలేకపోగా నా ప్రవర్తనతో నేను వారిని హింసించాను. మానసికంగా వారిని ఎన్నో చిత్రహింసలపాలు చేశాను. నేను క్షమార్హుణ్ణి కాను. నా శ్రేయస్సు, నా సత్ప్రవర్తన కోసం ఎంతో పరితపించిన శారదను నిర్దాక్షిణ్యంగా యింటి నుండి తరిమేశాను. పాపం ఎన్ని అవస్థలు పడుతుందో ఏమో? ఆమెకు నేను ఎంతో అన్యాయం చేశాను. నా నేరాన్ని తన నెత్తిన వేసుకుని మౌనంగా యిల్లు వదిలి వెళ్ళిపోయింది. పల్లెత్తి ఒక్కమాటైనా అనలేదు. శారదను రోజాతో పోల్చి చూస్తే నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడా కనిపిస్తుంది. విచిత్రమైన మనుష్యులు. ఒకరు మరొకరి కోసం ఎటువంటి త్యాగాన్నైనా చేస్తారు. ఎన్నో అపనిందలు భరిస్తారు. తమ జీవితం నిరాధారంగా మారుతున్నా వెనుకంజ వేయరు. అటువంటి కోవకు చెందినది శారద. తాను చెడిపోతూ మరొకరిని బాగు చేయాలని ఉద్దేశపడడంలో త్యాగముంది. ఇతరులను చెడగొడుతూ తాము బాగుపడడంలో కనీసం స్వార్థమైనా ఉంది. తాము చెడిపోతూ యితరులను చెడగొట్టడంలో ఏ ఉద్దేశ్యముందో నాకు తోచడం లేదు. ఆ కోవకు చెందినది రోజా. రోజా డబ్బున్న యువకులను తన వలలో వేసుకుంటూ తన నాశనానికీ, ఆశ్రయించిన ఆ యువకుల పతనానికీ కారకురాలవుతూంది. ఆమె జీవితంలో నేను ఎన్నోవాడినో? నా తర్వాత ఎందరో? శలభము దీపశిఖలో పడి దీపాన్ని ఆర్పుతుంది. తనూ మరణిస్తుంది.

'పరీక్షలు నెలలోపే ఉన్నాయి. ఇక జాగ్రత్తగా చదువుతాను. నాన్నగారికి అమ్మకు ఎటువంటి బాధా కలిగించను. పాపం నీరజ కూడా నా ధాటికి తట్టుకోలేకపోయింది. నేను ఎంతమందిని మానసికంగా బాధపెట్టాను. శారద, నీరజలలో పోలికలున్నాయేమిటి? మళ్ళీ ఆ పోలికలు గుణాలలో లేవు. శారదెక్కడ? నీరజెక్కడ? ఆ అణకువ ఆ వినయ విధేయతలు, చదువుపై ఆ శ్రద్ధ నీరజ ఎన్ని జన్మలెత్తినా మాత్రం పొందగలుగుతుందా? పాపం శారద చదువుతుందో లేదో? అమానుషంగా ప్రవర్తించి ఆమె భవిష్యత్తుకు అడ్డుగోడగా నిలిచాను. పట్టుదల గలది. ఎలాగైనా సాధిస్తుంది. స్కాలర్‌షిప్‌తో సగం ఖర్చులు వెళ్ళిపోతాయి. ఎంతైనా యిబ్బందే! చదువు మాని ఉద్యోగం చేస్తుందో ఏమో? శారదను తలచుకుంటే నాకు ఆశ్చర్యం కలుగుతూ ఉంది. తక్కువ అవకాశాల మధ్య ఇబ్బంది పడుతూ ప్రతి సంవత్సరం డిస్టింక్షన్‌లో



వ్యాసిస్తూ ఉంది. ఎన్నో అవకాశాలున్న నేను వాటిని దుర్వినియోగపరుస్తూ చదవ లేక, క్రమంగా ప్యాసవక నా తల్లిదండ్రులకు భారంగా తయారయ్యాను. నా వడవడి మార్చుకుంటాను. శారద ప్రవర్తనను ఆదర్శంగా తీసుకుంటాను.'

తన వాచీ చూసుకున్నాడు ప్రభాకరం. లేచి నెమ్మదిగా నడక సాగించాడు. అతను యిల్లు చేరేసరికి రాత్రి పది దాటింది. అన్నపూర్ణమ్మగారు అతనికోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. ఆమెను చూసిన ప్రభాకరం గుండె చెరువైంది. ఎముకల గూడులా తయారైన ఆమె స్థితికి తనే కారణమని ఊహించుకొని ఎంతో బాధ పడ్డాడు.

'అమ్మా...! నా కోసం యింతసేపు కాచుక్కూర్చున్నావా? నిన్ను ఎంత హింసి స్తున్నాను. ఆ పాపం ఊరికే పోదు. అంతకు నాలుగింతలు అనుభవిస్తాను.'

'బాబూ అటువంటి మాటలనకు నీకోసం నేను కాచుక్కూర్చోకపోతే యింకెవ రున్నారు? ఈ యిల్లు కోడలిలో ఎప్పుడు కళకళలాడుతుందా అని ఎంతకాలంగానో ఎదురు చూస్తున్నాను. నాయనా! నీలోటి వాళ్లు చదువులు, వివాహాలు పూర్తిచేసు కొని ఎంతో కులాసాగా గడుపుతున్నారు. ఆ కుటుంబాలు పొందుతున్న సంతోషాన్ని మేము నోచుకోలేదా బాబూ?' కంట తడి పెట్టారు అన్నపూర్ణమ్మగారు.

'అమ్మా...! ఈ పాపిష్టివాడి కోసం కంట తడి పెడుతున్నావా? అందుకు నేను అర్హుణ్ణి కాను. మిమ్మల్ని ను పొరనీస్తూ చిత్రహింసలపాల్జేసి మీకు మన శ్శాంతి లేకుండా చేశాను. నా పాపాలకు నిష్కృతి లేదమ్మా!' కళ్లు ధారలు కట్టి వర్షంలా కురిపిస్తున్నాయి. పశ్చా త్తాపంతో నిండిన ఆ ముఖం పవిత్ర మైన కన్నీటితో తడిసిపోతూ ఉంది.

'బాబూ! ఏమిటిరా! ఈ రోజు మా కష్టసుఖాలు నీకు గుర్తుకు వస్తున్నా యేమిటి? చాలుబాబూ ... ఈ మాత్రం మార్పైనా మాకుచాలు' అని సగంతిని ఆపేసి అన్నాన్ని తినిపిస్తూ అతని తలను ప్రేమతో నిమురసాగారు అన్న పూర్ణమ్మగారు.

తను పనులు పూర్తి చేసుకొని

## మల్లెలు...

పడుకోవడానికై వెడుతూ మంచినీళ్లు త్రాగాలని వంటింట్లోకి వచ్చిన శ్రీపతి గారికంట ఈ దృశ్యం పడింది. ప్రభా కరంకోసం ఎదురుచూస్తూ ఆ వంటిం ట్లోనే ఎప్పిస్తూ నిద్రపోయే అన్న పూర్ణమ్మగారిని లేపి తీసుకువెళ్లడం మామూలుగా జరుగుతూ ఉండేది. అటు వంటిది ఈ రోజు ప్రభాకరం భోజనం చేస్తూ ఉండడం. తనభార్య తినిపిస్తూ ఉండడం; ఇద్దరికళ్లూ తడితో చెమ్మ గిలి ఉండడం శ్రీపతిగారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. మంచినీళ్లు త్రాగి విచార వదనంతో ప్రభాకరాన్ని చూస్తూ అత నిలో మార్పు రావాలని వేయి దేవుళ్లను ప్రార్థిస్తూ తన గదివైపు నడిచారు. వారలా విచారంతో నడిచివెళ్లడం ప్రభా కరానికి ఎంతో బాధను కలిగించింది. మౌనంగా తన భోజనం ముగించి తన గదికి వెళ్లిపోయాడు.

* * *

వర్షాలు ప్రారంభమయ్యాయి. ఎండా కాలమంతా దినకరుని తీవ్రతకు తపించి పోయిన ప్రాణులన్నింటికీ హాయి చేకూ రింది. ఆ సంవత్సరం వర్షాలు త్వరగా ప్రారంభమయ్యాయని అందరూ సంతోష పడుతున్నారు. పల్లెవాసులు పట్నవాసుల కన్న ద్విగుణీకృతమైన సంతోషంతో పొంగిపోతున్నారు. వారి జీవనాధారమే వర్షంకదా మరి!

ప్రభాకరం రిజల్ట్సు వచ్చాయి. ప్యాస య్యాడు. అతను ప్యాసవడం అతనికే ఆశ్చర్యాన్ని కలిగించింది. అతనితోపాటు మిగతా వారుకూడా ఆశ్చర్య పడవలసి వచ్చింది. మార్కులుగూడా మరీ అంత హీనంగా కాకుండా మధ్యరకంగావచ్చాయి. ప్రభాకరంలో వచ్చిన మార్పుకు శ్రీపతి గారి కళ్లు ఆనందంతో మెరిశాయి. ఇప్పుడు ధైర్యంగా తలెత్తుకొని నలు

గురిలో తిరగగలుగుతున్నారు. ప్రభాకరం చదువుపై శ్రద్ధ చూపగలుగుతున్నాడే గాని ఆ దుడుకుతనం, ఆవేశం తగ్గ లేదు.

ఒకరోజు హాలులో కూర్చుని పేపరు చదువుకుంటున్న శ్రీపతిగారి వద్దకు వచ్చాడు ప్రభాకరం.

'నాన్నారూ! నాకిక్కడ చదువు కోవాలని లేదు—'

'ఏం జరిగింది బాబూ?' పత్రికపై నుండి దృష్టి మళ్లిస్తూ అన్నారు శ్రీపతిగారు.

'ఏంలేదు నాన్నారూ! పాతస్నేహాలు...' మాట పూర్తిచేయకలే పోయాడు.

శ్రీపతిగారు ఆలోచనలో పడ్డారు. 'అవును ... ప్రభాకరం యిక్కడ ఉండి చదువుకోవడం మంచిదికాదు. ఎక్కడికైనా వెళ్లి చదువుకుంటే మంచి క్రమశిక్షణ అలవడుతుంది. హాస్టలు జీవితం క్రమ బద్ధంగా కూడా ఉంటుంది.'

'నాకు బెనారస్ యూనివర్సిటీకి వెళ్లి చదువుకోవాలని ఉత్సాహంగా ఉంది. మీరే మంటారు.'

ప్రభాకరం మాటలకు ఆలోచనలనుండి తేరుకొని 'అలాగే బాబూ! కాని నిన్ను వదిలిపెట్టి రెండు సంవత్సరాలు ఎలా గడపగలము? మంచో చెడో? నీవు మాకళ్లముందుంటున్నావు. అంతే చాలు. నీ సత్ప్రవర్తన వల్ల ఈ కొద్ది కాలం లోనే అమ్మ ఎంతో కోలుకుంది. ఆమెకు నెమ్మదిగా ఆరోగ్యం కలిగింది.' సంతోష పడుతూ అన్నారు శ్రీపతిగారు,

'నాన్నగారూ! అజ్ఞానంతో యింత కాలం మిమ్మల్ని ఎంతో బాధపెట్టాను ఎలాగో ఈ రెండు సంవత్సరాలు ఓపిక పట్టండి. అమ్మను ఒప్పించే బాధ్యత మీదే!' తన్మయదన్నట్లు తండ్రిముఖంలోకి చూస్తూ తనపై వారికిగల అవ్యాజానురాగా నికి ఆశ్చర్యపోతూ అన్నాడు ప్రభాకరం.

'అలాగే బాబూ.' కుమారునిలో క్రమంగా వస్తూన్న మార్పుకు ఆనం దంతో పొంగిపోతూ అన్నారు శ్రీపతిగారు.

(ఇంకా ఉంది)

# వారఫలం

**26-2-1971 శుక్రవారం మొదలు**
**4-3-1971 గురువారం వరకు**

**మేషం:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. విలాస వస్తువులు కొంటారు.

**వృషభం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మిత్రులకు సహాయం లభిస్తుంది. వారం మధ్యలో అధికవ్యయం జరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— పుణ్య కార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిథునం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. నూతన విషయాలను తెల్సు కొంటారు.

**కర్కాటకం** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అధికారుల వలన జరుగ వలసిన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి.

- స్త్రీలకు:— వినోద కాల క్షేపాల్లో పాల్గొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. సాంఘిక కార్య క్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కన్య:** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేర గలదు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:** వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— దైవ కార్యాలు నెరవేరతాయి. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం** మీకు ముున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు. నూతన విషయాలను తెల్సు కొంటారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటారు. వినోద కాల క్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు.** సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి వస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు. వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాలు నెరవేరతాయి.

**మకరం:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— బంధు మిత్రులను కల్సుకొంటారు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారులు వలన జరుగ వలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

—మహేష్



# మారని మనసులు



పెనుమత్స సీతాదేవి

[illegible] మూడురోజుల క్రితం గుంటూరు వెళ్ళి [illegible]వచ్చినప్పటి నించి రామనాథం అదోలా [illegible]న్నాడు. ఎప్పుడు చూసినా తగని పరాకు! శ్యా[illegible]లాంబ రెండుమూడు సార్లు పిలుస్తే తప్ప [illegible]లకటంలేదు.

'[illegible]! మీరు మరీ అట్లా ఇదై పోతారు[illegible] భోజనానికి లెమ్మని అప్పటికి రెండుసార్[illegible]పిలిచిన శ్యామలాంబ గట్టిగా అంది. '[illegible] లేనిపోని అపోహలు, అను[illegible]! [illegible] మన పిల్లలు కాదు టండీ! [illegible] ఎన్నటికీ మర్చిపోరు. మీదంతా ఒ[illegible]! భోజనానికి లెండి, వడ్డించాను.'

రామనాథం ఒకసారి నిట్టూర్చి కుర్చీలో నించి లేచాడు.

నిజం చెప్పాలంటె రామనాథంక సత్యంకి మధ్య చుట్టరికం ఏమీలేదు. పదేళ్ళ క్రితం సత్యం బి. ఎ. చదవడానికి బెజవాడ వచ్చి రామనాథంగారి ఇంట్లో ఒకగది అద్దెకు తీసుకున్నాడు. సత్యం అణకువ, మంచితనం రామనాథం దంపతులని వెంటనే ఆకర్షించింది. దానికి తోడు సత్యంకి తల్లితండ్రులు లేరు, రామనాథంకి పిల్లలు లేరు.

ప్రత్యమ్నాయంగా త్వరలోనే సత్యం మీద రామనాథంగార్కి ఒకవిధమైన పుత్రప్రేమ ఏర్పడింది. అది రోజురోజుకు పెరిగిందేగాని తరగలేదు. ఇంట్లో చేరిన రెండుమూడు నెలల్లోనే ఇంట్లో ఒకడైపోయాడు సత్యం.

శ్యామలాంబకి కూడా సత్యం మీద తగని ప్రేమ! హోటలు తిండితో బాధపడ్తున్నాడని అప్పుడప్పుడు ఏ ఆదివారంనాడో సత్యంని హోటలుకి వెళ్లవద్దని చెప్పి, ఆ రోజు అతనికి ఇష్టమైన పదార్థాలు చేసి, తమ ఇంట్లోనే భోజనానికి పిలిచేది.

అట్లాగే పరీక్షల టైములో సత్యంకి కావలసిన టీలు అవీ పెట్టి ఇస్తూ ఉండేది. అప్పుడప్పుడు వచ్చి చూస్తూ, 'మేలుకునే ఉన్నావా బాబూ! నిద్రపోతున్నావేమోనని వచ్చాను. బాగా చదువుకో నాయనా, ఫస్టు క్లాసు రావాలి. లేకపోతే ఊరుకోను' అంటూ పలకరించేది నవ్వుతూ.

సత్యం ఆ ఇంట్లో ఉండే బి. ఎ. ఫస్టు క్లాసులో పాసయ్యాడు. పాసయిన వెంటనే అదే వూళ్ళో మంచి ఉద్యోగం కూడ దొరికింది. మరుసటి సంవత్సరం పెళ్లి కూడ చేసుకున్నాడు.

పెళ్లి అయిన తర్వాత ఎక్కడేనా ఒక ఇల్లు తీసికుందామనుకున్నాడు సత్యం. కాని రామనాథం దంపతులు అందుకు ఒప్పుకో లేదు.

'మేము ఉంటున్న రెండు గదులు కూడ నువ్వే తీసికో, మేము వెనక గదిలోకి మార్తాము. అంతేగాని నువ్వు మాత్రం మా ఇంట్లోంచి వెళ్లవద్దు బాబూ' అన్నాడు రామనాథం.

వాళ్లని అనవసరంగా కష్టపెట్టడం సత్యంకి ఇష్టంలేదు. 'మీకు ఇబ్బంది అవుతుందిగదా బాబాయ్! నా కోసం మీరు అనవసరంగా ఇబ్బంది పడటమెందుకు?' అన్నాడు.

రామనాథంగార్ని 'బాబాయ్' అని, శ్యామలాంబని 'పిన్నీ' అని పిలవడం సత్యంకి అలవాటు.

'మాకేమీ ఇబ్బంది లేదయ్యా. ముసలాళ్లం, మేము ఎక్కడ ఉన్నా 'గడిచి పోతుంది. నువ్వు ఇంట్లోంచి వెళ్లిపోతే మాత్రం చాలా బాధపడతాము. కన్నకొడుకువి కాకపోయినా, ఈ నాలుగేళ్ళ నించి అట్లా ఉన్నావు. ఇక్కడ నించి వెళ్లవద్దు బాబూ' అంది శ్యామలాంబ, బ్రతిమాలుతున్న కంఠంతో.

సత్యం ఇంకా ఏమో చెప్పబోతె విని పించుకోకుండ తాము ఉంటున్న రెండుగదుల లోని సామాను వెనుక గదిలోకి మార్చారు. తాము వాడుకునే పెద్ద పందిరి మంచం మాత్రం అక్కడే ఉంచి, సత్యంని వాడుకో

మన్నారు.

వాళ్లు అట్లా బలవంత పెడ్తూంటె సత్యం ఎదురు చెప్పలేకపోయాడు. ఆ రోజే భార్యని తీసుకువచ్చి కాపురం పెట్టాడు.

సరళకి కూడ వచ్చిన మొదటి రోజు నించే రామనాథం దంపతులంటె ఎంతో గౌరవం ఏర్పడింది. తన భర్తలాగే తను కూడ 'బాబాయ్', 'పిన్నీ' అంటూ పిలవడం అలవాటు చేసుకుంది.

సరళకి ఇంటి పనుల్లోను, వంటలోను అన్ని విధాలా సాయపడేది శ్యామలాంబ.

ఆ ఇంట్లో ఉండగానే సత్యంకి ముగ్గురు పిల్లలు కలిగారు, ఒక ఆడపిల్ల ఇద్దరు మొగపిల్లలు.

**మొదటి కాన్పుకి సరళని హాస్పిటల్లో చేర్పించినప్పుడు రామనాథంగారు ఎంత హడావిడి పడిపోయాడో!**

గది బయట హడావిడిగా తిరుగుతూ, గదిలోనించి వచ్చే ప్రతి నర్సుని, ఆయాని 'మా అమ్మాయి ఎట్లా ఉంది ?' అంటూ ఆతృతగా అడిగేవాడు. చివరకి 'ఆడపిల్ల' అనగానే ఎగిరి గంతేసి, 'మా ఇంట్లో లక్ష్మి పుట్టింది' అంటూ సంతోషంతో అప్పటి కప్పుడు యాభై రూపాయలు పెట్టి మిఠాయి కొనుక్కొచ్చి అక్కడ ఉన్న వాళ్లందరికి పంచి పెట్టాడు.

తర్వాత రెండు కాన్పులకి కూడ అంతె. సత్యంకంటె రామనాథంగార్కే ఎక్కువ ఆతురాగా ఉండేది.

సత్యంకి పిల్లలు కలిగిన తర్వాత రామనాథంగార్కి ఆ పిల్లలతోటే లోకం. ఎప్పుడూ ఆ పిల్లల్ని దగ్గర కూర్చోపెట్టుకుని ఏవేవో కథలు చెప్పి వినిపిస్తూ కూర్చునేవాడు. వాళ్లని విడిచిపెట్టి ఒక్క క్షణం ఉండేవాడు కాదు.

ఆడపిల్లకి రామనాథం సలహామీద 'లక్ష్మి' అని పేరు పెట్టారు. పెద్ద పిల్లవాడి పేరు 'రమణ', చిన్నవాడి పేరు 'రవి'. వీళ్ళు కూడ, 'తాతయ్య' అంటూ రామనాథంగార్ని వదిలిపెట్టేవారు కారు.

ముఖ్యంగా ఆఖరివాడు మరీను ! వాడికి ఎట్లా అలవాటయిందో, రామనాదంగార్ని 'పురేయ్ తాతా' అని పిలవడం అలవాటయింది. వాడు 'పురేయ్ తాతా' అన్నప్పుడల్లా రామనాదంగారు సంతోషం పట్టలేక 'ఒరేయ్ మనవడా' అంటూ ఎత్తుకుని ముద్దాడేవాడు. ఒకటి రెండుసార్లు, 'తప్పురా వెధవా ! తాతయ్యని అట్లా పిలవకూడదు' అంటూ సత్యం కేకలేయబోతే, రామనాథంగారు వారించి, 'ఫరవాలేదులే అబ్బాయ్. వాడు అట్లా పిలుస్తూంటేనే ఎంతో ముద్దుగా ఉంటుంది' అన్నాడు.

శ్యామలాంబగారి విషయం చెప్పనే అక్కర లేదు వాళ్ళకి ప్రతిరోజు ఏ చెగోడీలో జంతికలో చేసిపెడ్తూ ఉండేది. పెద్దపిల్లకి కజ్జికాయలంటె మహాప్రీతి. మిగిలిన ఇద్దరికి చెగోడీలు జంతికలు అంటె ఇష్టం. కజ్జికాయలు చేస్తే, నాకు చెగోడీలు కావాలని రమణ గోల చేసేవాడు. చెగోడీలు చేసిన రోజున నాకు జంతికలు కావాలని రవి గోల చేసేవాడు. 'మీకు రేపు చేసి పెడ్తానులేరా, ఈ రోజుకి ఇవి తినండి' అంటూ వాళ్లని సముదాయిస్తూండేది శ్యామలాంబ. ఒక్కొక్క రోజున నాకు 'అదే కావాలి' అంటూ ఎవరేనా మొరాయిస్తె, 'అబ్బబ్బ! చంపుతున్నారురా' అంటూ అవి కూడ చేసిపెట్టేది. అంతేగాని ఒక్కసారి కూడ పిల్లల్ని కసురుకోడం కాని, చేసిందేదో తినండి అంటూ కేకలేయడం గాని జరగలేదు.

'నువ్వు అనవసంగా వీళ్లని గారాబం చేస్తున్నావు పిన్నీ! నీ అలుసు చూసి వీళ్ళు మరీ మారాం నేర్చుకుంటున్నారు' అంటూ సరళగాని సత్యంగాని - అంటె, శ్యామలాంబ నవ్వుతూ, 'చిన్న పిల్లలు, వాళ్లు చెయ్యక పోతే మనం చేస్తామా ? చిన్నతనంలో ఎవరేనా అంతే' అనేది.

ఇట్లా అయిదేళ్లు గడిచాయి. ఈ అయిదేళ్లు ఆ పిల్లలే తమ లోకం అన్నట్లు గడిపారు రామనాథం దంపతులు.

అందుకనే సత్యంకి గుంటూరు బదిలీ అయిందని తెలిసినప్పుడు ఎంతగానో బాధ పడ్డారు. 'అబ్బాయ్ ! వెళ్లక తప్పదా ?' అంటూ ఎంతో విచారంగా అన్నారు.

'ఎట్లా బాబాయ్! ఉద్యోగం అన్నతర్వాత ఎక్కడికి వేస్తే అక్కడికి వెళ్లాలి గదా! అందులోను ప్రమోషనుమీద వెళ్లమంటున్నారు.'

'అవును బాబూ! వచ్చిన ప్రమోషను ఒదులుకుంటె ఎట్లా '' వెళ్లక తప్పదని రామనాథంగార్కి తెలుసు.

'పోనీ అక్కడ కొన్ని రోజులు పనిచేసి, మళ్లీ ఈ వూరికి బదిలీకోసం పెట్టుకో కూడదూ?' శ్యామలాంబ అడిగింది.

'అట్లాగే చేస్తాను పిన్నీ. మిమ్మల్ని వదిలి వెళ్లడమంటె మాకూ బాధగానే ఉంది. కాని తప్పదు గదా!'

'ఇక్కడికి గుంటూరు చాలా దగ్గరేగా పిన్నీ ! గంట ప్రయాణం మాత్రమే. వారానికోసారయినా మీరు వస్తూ ఉండ వచ్చు' సరళ అంది.

'అట్లాగే అమ్మాయ్! రాకుండా ఉందామన్నా మేము ఉండగలమా ?' రామనాథంగారు అన్నాడు, పేలవంగా నవ్వి.

అన్నట్లుగానే సత్యం గుంటూరు వెళ్లిన దగ్గరనించి వారానికోసారి వెళ్లి పిల్లల్ని చూసి వస్తూ ఉండేవాడు రామనాథం. వెళ్లినప్పుడల్లా పిల్లలు ముగ్గురూ 'తాతయ్యా' అంటూ చుట్టేసేవారు. వెళ్లేటప్పుడు ఉత్త చేతుల్తో వెళ్లక, వాళ్ళకి కావలసినవన్నీ శ్యామలాంబ చేసిపెట్టగా తీసికెళ్లేవాడు. రామనాథంని చూస్తూనే, 'నాకు కజ్జికాయలు తెచ్చావా తాతయ్యా', 'నాకు చెగోడీలు', 'పురేయ్ తాతా! నా జంతికలు ఏవిరా ?' అంటూ పిల్లలు ముగ్గురూ ఎగబడేవారు. వాళ్లకోసం తెచ్చినవి వాళ్లకిచ్చి, ఆ పూట వాళ్ళతో కాలక్షేపంచేసి, తిరిగి సాయంత్రం బయలుదేరి బెజవాడ చేరుకునేవాడు రామనాథం.

అట్లాగే మూడు రోజుల క్రితం గుంటూరు వెళ్లాడు. అంతకి క్రితం ఒంట్లో సరిగా లేకను, అర్జంటు పను ఉండటంవల్లను రెండు వారాలు వెళ్ళడం కుదరలేదు.

పిల్లల్ని చూడాలని ఎంతో ఆశతో వచ్చిన రామనాథం, పిల్లలందర్ని వెంకట్రావ్ సినిమాకి తీసుకెళ్లాడన్ని తెలుసుకుని [illegible] కారిపోయాడు. పిల్లలకోసం సా[illegible] వరకు చూసి, వాళ్లు ఇంకా రాకపో[illegible] టికి రైలుకి టైము అవడంవల్ల [illegible] వెళ్లిపోక తప్పలేదు. పిల్లలు [illegible] అని ఎంతో బాధపడ్డాడు.

కాని స్టేషనులో జోగారావు చెప్పిన విషయం రామనాథంగార్ని [illegible] బాధ పెట్టింది.

వెంకట్రావు సరళకి [illegible] అవు తాడు. బాగా డబ్బున్నవాడు, గుంటూరులో పెద్ద వ్యాపారం. ఆయనకి ఒక కొడుకు, ఒక కూతురు, వాళ్లకి పెళ్లిళ్లు చేసి పదేళ్ల

అయింది! కాని దురదృష్టవశాత్తూ వాళ్లిద్దరికీ సంతానం లేదు. కలిగే సూచనలు కూడ లేవు.

అంతస్థుల తేడావల్ల, దగ్గర్లోనే ఉన్నా ఎప్పుడూ సరళని చూడటం కోసం వెంకట్రావు బెజవాడ వెళ్లలేదు. వెళ్లాలనే ఉద్దేశం కూడ ఎప్పుడూ కలగలేదు.

సత్యంకి బదిలీ అయిందని, ప్రస్తుతం గుంటూరులోనే ఉంటున్నాడనీ తెలిసికూడ ఎప్పుడూ వీళ్ల ఇంటికి రాలేదు. కారణం అంతస్థుల తేడా.

కాని పదిరోజుల క్రితం అనుకోకుండా సత్యం ఇంటికి వచ్చిన వెంకట్రావు, సత్యం ముగ్గురు పిల్లల్ని చూసి ఎంతో ముచ్చట పడ్డాడు. 'తాతయ్య' అంటూ సరళ చెప్ప గానే, పిల్లలు చనువుగా దగ్గరికి రావడం చూసి మరీ సంతోషించాడు. అప్పుడే అని పించింది, తనకి స్వంత మనవలు ఎవరూ లేకపోయినా, ఆ కొరత ఈ పిల్లల వల్ల తీర్చుకోవచ్చని.

ఆ రోజు నుంచి సత్యం ఇంటికి ప్రతి రోజు రావడం మొదలుపెట్టాడు వెంకట్రావు. సాయంత్రం వచ్చి తన కారులో పిల్లల్ని వూరంతా తిప్పేవాడు. వాళ్లకి అవి ఇవి కొనిపెట్టేవాడు. ఒద్దని సరళ చెప్పినా వినక, వాళ్లకోసం మంచి మంచి ఖరీదైన ఆటవస్తువులు కొని తెచ్చేవాడు. బిస్కెట్లు చాక్లెట్లు స్వీట్లు డబ్బాలకి డబ్బాలు కొనే వాడు.

'అట్లాంటి తాత వాళ్లకి దొరికాడయ్యా రామనాథం! పిల్లలు, వాళ్లకేమి తెలుస్తుంది! చక్కగా కారులో తిరగవచ్చు. ఆడుకోడా నికి మంచి మంచి ఆటవస్తువులు. తినడా నికి బిస్కెట్లు చాక్లెట్లు. ఇహ నిన్ను గుర్తించుకుంటారా!' అంటూ ముగించాడు జోగారావు.

నిజమే!

పిల్లలకేమి తెలుస్తుంది!

తను కారులో తిప్పలేడు. ఖరీదైన ఆట వస్తువులు కొనలేడు. ఆ పనులు వెంకట్రావు చెయ్యగలడు.

అందుకనే రామనాథం అంతగా కుమిలి పోతున్నాడు.

'నా మాట విని ఈ ఆదివారం మళ్లీ వెళ్లిరండి. మీరు అనవసరంగా బాధపడుత్తున్నారు. ఎంత డబ్బు ఉన్నవాడైనా, ఆ

## మారని మనసులు

వెంకట్రావుగారు మీ స్థానం పొందలేడండీ! పిల్లలు దేవుళ్లతో సమానం! మన పిల్లలు మనల్ని ఎన్నటికీ మర్చిపోరు. ఈ ఆదివారం ఇంకోసారి వెళ్లిరండి, నా మాట నిజమని తేలుతుంది' అంటూ శ్యామలాంబ మరీ మరీ చెప్పింది.

తనకి అనుమానంగా ఉన్నా, పిల్లల్ని చూడాలనే కాంక్ష తీవ్రంగా ఉండడం వల్ల, ఆదివారం బయలుదేరి వెళ్లాడు రామనాథం.

కాని గుంటూరు స్టేషనులో దిగినప్పటి నించి సత్యం ఇంటికి వెళ్లేంతవరకు ఒకటే అనుమానం!

పిల్లలు తనని పలకరిస్తారో లేదో! ఇది వరకటిలా 'తాతయ్యా' అంటూ దగ్గరకి వస్తారో రారో! అసలు తనని మర్చి పోయారో! ఆ వెంకట్రావు పిల్లల్ని తీసు కుని ఎక్కడికేనా వెళ్లాడేమో! ఒకవేళ ఇంట్లో ఉన్నా, ఆ వెంకట్రావుని వదిలి తన దగ్గరికి వస్తారో రారో!

సత్యం ఇల్లు దగ్గరవుతున్న కొద్దీ రామనాథంగార్కి భయం ఎక్కువయింది. వెంకట్రావు ఇంట్లో లేకుండా వుంటే బాగుండును అనుకున్నాడు. అసలు తను రావడం పొరపాటేమో అనికూడ అనిపించింది.

పిల్లలు తనని మర్చిపోయారనే బాధ కంటె, తను వచ్చినప్పుడు పిల్లలు మును పటిలా 'తాతయ్యా' అంటూ దగ్గరకి రాక పోతే పడే బాధ ఇంకా ఎక్కువగా ఉంటుంది.

మెట్లు ఎక్కబోతూ ఒక్కసారిగా ఆగి పోయాడు రామనాథంగారు. ముందుకు అడుగు వేయడానికి కాళ్లాడలేదు. కిటికీలో నించి ప్రక్కగదిలో ఉన్న వెంకట్రావు కన పడేటప్పటికి రామనాథంగార్కి ముచ్చె మటలు పోశాయి.

లక్ష్మి ఒకపెద్ద జపాను బొమ్మ ఒళ్లో పెట్టుకుని వెంకట్రావు ఏదో అడుగుతూంటె సమాధానం చెప్తోంది. రమణ ఒక చేత్తో లడ్డూ పుచ్చుకుని మధ్య మధ్య తింటూ ఏదో పెద్ద బొమ్మల పుస్తకం తిరగేస్తున్నాడు. ప్రక్కనే టేబులు మీద పెద్ద స్వీట్ పాకెట్టు ఉంది. రవి మాత్రం ఎక్కడున్నాడో కనపడలేదు.

రామనాథంగార్కి ఏమి చేయాలో అర్థం కాలేదు. తిరిగి వెళ్లిపోదామనిపించింది. కాని ఇంతదూరం వచ్చి పిల్లల్ని పలకరించకుండా తిరిగి వెళ్లబుద్ధి కాలేదు. వాళ్లు తనని పలకరించక పోయినా, ఒకసారి తనివితీరా వాళ్లని చూసి మరీ వెళ్లాలనిపించింది.

చెమ్మగిలిన కళ్లని తుడుచుకుని ముందు గదిలోకి వచ్చి 'అమ్మాయ్! సరళా!' అంటూ నెమ్మదిగా పిలిచాడు, కంపించే కంఠంతో.

అంతె!!

ఒళ్లో ఉన్న జపాను బొమ్మని అక్కడే పారేసి 'తాతయ్యా' అంటూ పరుగున వచ్చింది లక్ష్మి.

తింటున్న లడ్డూని ఒక మూలకి విసి రేసి, 'తాతయ్య వచ్చాడు' అంటూ పరు గున వచ్చాడు రమణ.

ఆట వస్తువులు బిస్కెట్లు చూసి చిన్నపిల్లలు ఆశపడటం సహజమే! పిల్లలు కోరేవి అవే కాబట్టి అవి చూస్తే సంతోష పడతారు. అవి చూపించినవారి దగ్గరకి రావడం కూడ జరుగుతుంది.

కాని అవి చూపించిన మాత్రంలో పిల్లల మనస్సులు చూపించినవారివైపు తిరుగుతుం దనుకోడం వట్టి భ్రమ!

పిల్లలు దేవుళ్లతో సమానం అని వూరికే

### కీర్తికాంత

అజ్ఞ లభిమానించి,ఆహా!యని నుతించి,
ఔను,నిజమున్నంతఅదియే ప్రతిష్ఠయై,
అందలమెక్కించె నంతియేగాని, ఏ
ఖ్యాతిలో నేమున్నదరయ నే దక్కటా!

పేరుకోసమ్మింత పేరాస, పోరాట
మారాట మేల? నాకర్థమే కాలేదు!
ఔరా! విచిత్రమీ వ్యామోహమని తలచి,
ఆశ్చర్య పడినంత అలతి వగవుదయించె!

సారహీనమ్మీయశః కాంక్ష! సాహితీ
జగతి నన్నింక విస్మరించెనేని, నా
స్మరణమే లోకాన మరణించెనేని, మన
సార శాశ్వత భాగ్యశాలినని గర్వింతు!

కాని, నెమ్మది నెన్నడయిననీవాక్యింత
యేని నను గూర్చి భావించుటేలోలోన
ఖండ నిరుపయకీర్తిగా దోచి, నెచ్చెలీ,
మానసమ్మానందమయమై పరవశించె!

— పి. గణపతిశాస్త్రి.

SIEMENS

# లింకే ఎప్పుడు విడి పోతే
# గొలుసు అప్పుడే తెగి పోతుంది
# ఒక యంత్రం చెడి పోతే చాలు
# పంపింగ్ సెట్ అంతా పాడవుతుంది

పంపింగ్ సెట్ మరియు దానిని పనిచేయించి, సంరక్షించే అన్ని భాగాలు సక్రమంగా బాగుగా కలిసి పనిచేయుటకొరకు ఒక దానితో నొకటి సమన్వయపరుప బడాలి.

పంపింగ్ సెట్ కోసం వలయు అన్ని యంత్రాలూ—పంపు, మీటరు, స్టార్టరు, స్విచ్‌ఫ్యూజ్ యూనిట్ మరియు వాటిని కలిపే ట్రాపొడర్ కేబుల్ గూడా, ఒకే టెక్నిక్‌చే తయారుచేయబడి సమకూర్చ బడినవి-భారతదేశంలో ఒక్క సీమెన్స్ కంపెనీ వారిచే మాత్రమే.

సీమెన్స్ పంపింగ్ సెట్ కొనండి, నిరాటంకమైన సేవను పొందండి.

**సీమెన్స్ ఇండియా లిమిటెడ్**

అహమ్మదాబాద్ • బెంగుళూరు • బొంబాయి • కలకత్తా
హైదరాబాదు • లక్నో • మద్రాసు • న్యూ ఢిల్లీ

Bensons/3931 Tel

అవలేదు. చిన్నపిల్లలకి ఆలోచనాశక్తి ఎక్కువగా లేకపోయినా, తమ మీద ఎవరికి నిజంగా ప్రేమ వుందో వాళ్లకి తెలుస్తుంది. బిస్కెట్లు చాక్లెట్లు చూసి ఎవరి దగ్గరకేనా వెళ్లినా, అది తాత్కాలికం మాత్రమే! ఆ బిస్కెట్లు తినేయగానే వాళ్లు దగ్గర నించి వెళ్లిపోతారు.

పిల్లలని మనస్ఫూర్తిగా లాలించి బుజ్జగిస్తే, వాళ్ల ప్రేమకి పాత్రులు అవవచ్చు. ఆ ప్రేమ చిరస్థాయిగా ఉంటుంది. అంతే గాని, వాళ్లకి బిస్కెట్లు, చాక్లెట్లు ఎరగా చూపించి దగ్గరకి తీసికుంటె, అది తాత్కాలికమే అవుతుంది. ఆ చూపించిన 'ఎర' అయిపోగానే పిల్లలు కూడ దూరం అవుతారు. డబ్బుతో దేన్నైనా కొనవచ్చేమో గాని పిల్లల మనస్సులు మాత్రం కొనలేరు.

పిల్లల ఈ మనస్తత్వం వెంకట్రావు తెలుసుకోలేకపోయాడు. రామనాథం తెలుసుకోలేకపోయాడు. అందుకనే పిల్లలు తనవాళ్లు అయారని వెంకట్రావు అపోహ పడ్డాడు. తనకి దూరం అయారని అనవసరంగా రామనాథం బాధపడ్డాడు.

తనని పలకరించరు, తన దగ్గిరకి రారు అనుకుంటూ వచ్చిన రామనాథం, తన చిన్న పిలుపు వినగానే ప్రక్క గదిలోనించి పిల్లలు 'తాతయ్యా' అంటూ బాణాల్లా దూసుకు వచ్చి తనని చుట్టేశేటప్పటికి, అవాక్కయిపోయి అట్లాగే నిలబడిపోయాడు. తను చూస్తున్నది కలా నిజమా అనిపించింది.

'తాతయ్యా' నాకు కజ్జికాయలు తెచ్చావా లేదా?' అంటూ లక్ష్మి, 'నాకు చెగోడీలో' అంటూ రమణ అడుగుతూ రామనాథంని ఇటు అటు గుంజాతూంటె, అప్పటికి మళ్లీ ఈ లోకంలో పడి, అమాంతం ఇద్దరినీ తనకి దగ్గరగా లాక్కున్నాడు.

'తెచ్చానురా, ఎప్పుడేనా మీకు లేకుండా వచ్చానా?' అంటూ ఇద్దరినీ తన రెండు చేతులతోటి గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు. ఆనందం అవధులు దాటగా రామనాథంగారి కళ్లంబట నీళ్లు తిరిగాయి.

'ఏడుస్తున్నావు ఎందుకు తాతయ్యా?' లక్ష్మి అడిగింది అదోలా చూస్తూ.

'లేదు తల్లీ లేదు! ఏడవటం లేదు.' పిల్లలిద్దరి వీపులు నిమురుతూ అన్నాడు రామనాథం.' ఇది ఏడుపు కాదమ్మా! సంతోషం! పరమసంతోషం. విపరీతమైన సంతోషం!'

రామనాథం చెప్పేదేమిటో లక్ష్మికి అర్థం కాలేదు. 'మరయితే నా కజ్జికాయలు ఇయ్యి' అంది.

'ఇస్తున్నా తల్లీ ఇస్తున్నా' అంటూ గబగబా సంచి విప్పి, పిల్లలిద్దరికీ చెరొక పొట్లం ఇచ్చి, మళ్లీ ఇద్దరినీ తన గుండెలకి అదుముకున్నాడు, తననించి ఎక్కడ విడిపోతారో అన్నట్టు.

అప్పుడే లోపలనించి వచ్చి, 'ఎప్పుడొచ్చావు బాబాయ్' అంటూ పలకరించిన సరిత మాటలు మొదట్లో వినిపించుకోలేదు రామనాథం. పిల్లల ఒళ్లు బుగ్గలు తడు

---

**కూ ర లూ గు ణా లూ!**

## బాతు

బాతుగ్రుడ్లు బలాన్ని చేకూరుస్తాయి. దేహపుష్టి నిస్తాయి కాని మిక్కిలి వాతాన్ని చేస్తాయి.

పెంపుడు బాతు మాంసం కాక చేస్తుంది. దేహపుష్టి నిస్తుంది. కిడ్నీస్‌కు, గుండెకు, రొమ్ముకు సత్తువ నిస్తుంది. పుంస్త్వమును హెచ్చిస్తుంది. జీర్ణం చేసుకోగలిగే వారికి బాతు మాంసం చాలా మేలు చేస్తుంది. ముఖ్యంగా దీని ప్రక్కల మాంసం సులభంగా జీర్ణమయి మంచిరక్తాన్ని ఉత్పత్తి చేయుటానికి దోహదం చేస్తుంది రెక్కల భాగాలు ఆలస్యంగా జీర్ణమవుతాయి రక్తాన్ని మలిన పరుస్తాయి కాక తత్వం గలవారికి బాతు మాంసం హాని చేస్తుంది తలనొప్పి తెస్తుంది. అడవి బాతు మాంసం పెంపుడు బాతుమాంసం కన్నా శ్రేష్ఠమైనది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు:—
1. సిరికా, 2. పికింజిలీను. 3. సొంటి. 4. అల్లం. 5. పులుసు.

## పావురాపిట్ట మాంసం

పావురా పిట్ట మాంసం కాకచేసి అర్బును. [illegible]పుష్టి నిస్తుంది. పుంస్త్వమును హెచ్చి[illegible]ది. పైత్యవాతం, రక్త పైత్యం, శూల, [illegible] వాతం, ఉబ్బురోగం, కలవారికిది [illegible] చేస్తుంది. రెక్కలు దాని పిల్ల[illegible] ఆరోగ్యకరమైనది.

[illegible] రెట్టను (మలాన్ని) [illegible] దాని [illegible]ర్ధాన్ని పూటకు తుల [illegible], చొప్పున తేనెలో కలిపి వదిహేను [illegible]లు పుచ్చుకొనిన మూత్రి వంకర[illegible] తగ్గుతుంది.

పావురం యొక్క మాంసం కాక తత్వం కలవారికి తలనొప్పి కలుగ జేస్తుంది

దీని దుర్గుణాలకు విరుగుళ్ళు:—
1. సిరికా 2. ద్రాక్షపళ్లరసం.

## కౌజుపిట్ట మాంసం

కౌజుపిట్ట మాంసం—కఫరోగం, అగ్నిమాంద్యం, వాతంగల గలవారికి మిక్కిలి పథ్యమయినది రక్తపైత్యాన్ని పోగొట్టును. శుభ్రమైన రక్తాన్ని ఉత్పత్తి చేస్తుంది. దేహానికి, పెరుగుదలకు, బలాన్ని చేకూరుస్తుంది. ఆడపిట్ట మాంసం మిక్కిలి బలాన్ని చేకూరుస్తుంది దీనిగ్రుడ్లు మంచి యింద్రియ పుష్టి నిస్తాయి. మొగపిట్ట మాంసం పైత్యం కాక చేస్తుంది. ఉష్ణ తత్వం గల వారికి తల నొప్పి కల్గిస్తుంది

దీని దుర్గుణాలకు విరుగుళ్ళు:— 1. చింతపండు పులుసు, 2. సిరకా 3 నిమ్మపండు పులుసు, 4. అల్లం.

## గువ్వపిట్ట మాంసం

గువ్వపిట్ట మాంసం కాకచేసి అర్బును త్రిదోష హరమైనది. పావురాపిట్ట మాంసం కంటే శ్రేష్ఠమయినది మంచి రక్తాన్ని ఉత్పత్తి చేస్తుంది.

వాతరోగం, కామిల, కడుపునొప్పి, పాండు రోగం గలవారలకు మేలు చేస్తుంది.

గురుత్వంగా ఉంటుంది ఉష్ణ శరీరులకు తలనొప్పి కలిస్తుంది. దీని దుర్గుణాలకు విరుగుళ్ళు: 1. పంచదార 2. నెయ్యి 3. పసుపు.

– సేకరణ: ఆకుండి నారాయణ మూర్తి

ముతూ కూర్చున్నాడు. సరళ మూడోసారి పిలుస్తేగాని వినపడలేదు. తలెత్తి, నవ్వుతూ నిల్చున్న సరళని చూసి, అప్పుడు పలకరించాడు, 'అమ్మా! సరళా! బాగున్నావా' అంటూ.

అంతవరకు ఇదంతా ప్రక్క గదిలోనించి నిర్ఘాంతపోయి చూస్తూ కూర్చున్న వెంకట్రావు నెమ్మదిగా ముందుగదిలోకి వచ్చి, సరళతో 'అమ్మాయ్! నేను మళ్లీ వస్తాను' అంటూ గబ గబా బయటికి వెళ్లిపోయాడు, పిల్లల వంక ఒకసారి చూసి.

కాని పిల్లలు అతన్ని పట్టించుకునే స్థితిలో లేరు. వాళ్లు అసలు తాతయ్య తెచ్చిన కజ్జికాయలు, చెగోడీలు తినడంలో నిమగ్నులయారు.

'అమ్మాయ్! చిన్నవాడేడీ ?'

'నిద్రపోతున్నాడు బాబాయ్! లేపమంటావా ?'

'వద్దు వద్దు! నిద్రపోనీ, ఇప్పుడు అనవసరంగా నిద్రలేపడం దేనికి!'

కాని చిన్నవాడు ఈ హడావిడికి ఎప్పుడో లేచాడు. ముందుగదిలోకి వచ్చి, 'ఒరేయ్ తాతా !' అంటూ పిలిచాడు, చాటంత ముఖంతో.

రామనాథం ఒక్క ఉదుటున లేచి, 'ఒరేయ్! మనవడా' అంటూ రెండు అంగల్లో వెళ్లి, రవిని అమాంతం ఎత్తుకున్నాడు.

'ఒరేయ్! జంతికలు ఏవిరా?' తన మీద ముద్దుల వర్షం కురిపిస్తున్న తాతయ్య ముఖంని నెట్టివేస్తూ దబాయింపుగా అడిగాడు రవి.

'అరెరె! ఆ మాటే మర్చిపోయారా' అంటూ సంచిలోనించి పొట్లం తీసి రవి చేతికి ఇచ్చాడు రామనాథం.

ఇప్పుడు రామనాథం మనస్సు సంతోషంతో నిండిపోయింది. పీనుగులా వచ్చిన మనిషి ఏనుగులా అయాడు. ఒకటి కాదు పది ఏనుగుల బలం వచ్చింది.

'ఈ పిల్లలు నావాళ్ళు! ఎప్పటికీ నావాళ్లే! నన్ను మర్చిపోరు! ఎన్నటికీ మర్చిపోరు! వెయ్యి వెంకట్రావులు రానీ! పదివేల బిస్కెట్టు ప్యాకెట్లు తేనీ! భయం లేదు, నా మనవలు నన్ను వదిలిపెట్టరు' అనుకున్నాడు, సందేహ నివృత్తి అయి తేలిక పడ్డ హృదయంతో. ●

# జంతు లక్షణం! లేదా మరి...!



కె. రామలక్ష్మి

■ మగవాడి పోర్పు నెప్పుడేనా పరీక్షగా చూశారా? కుర్రకారు ఆటల్లోంచి బయటపడ్డాక చూడండి. ఎలా కొట్టి ఉండవలసిందో కొట్టేవరకూ చర్చిస్తారు. ఎప్పుడేనా కారు తోలుతున్న మగవాడిపక్కన కూర్చుని చూడండి — ఎవరికీ తాను దారి వదలడు—కాని తన వెనకేనా దాటి వెడితే మండిపడతాడు. కారెక్కి పోయిందిగాని లేకుంటే తరుముకు వెళ్లేవాడే ననిపిస్తుంది! పోనీ యింట్లో చూడండి. సమయానికి జోళ్లు సరిగ్గా కనబడక పోయినా, యిష్టమైన పేపరు చదువుకుంటు న్నప్పుడు పలకరించి చూడండి! మూడో కన్ను ఉంటే, అతగాడు మహా యోగీశ్వరుడే అయివుంటే ఎదుటివాళ్లు భస్మం అయిపోయి ఉందురు! అవునా?

అంతరాంతరాలలోంచీ పెల్లుబికే ఈ 'మగవాడి తపం' ఎక్కడినుంచి వచ్చిందీ? ఈ దురాక్రమణ ఎలా లబ్బింది! 'పచ్చి మాంసంకోసం చెట్టుకొమ్మలు దిగిన నాటినుంచీ' అంటారు జూ ఆలజిస్టులు. అప్పటినుంచీకూడా మగవాడు వేటకాడే! ఏంథోనీఫోర్జ్ అనే ఆంత్రపోలజీ శాస్త్రజ్ఞుడు—'ఈ ఆటవిక స్థితిలో వేటాడుతుంటూ మానవజాతి దరిదాపు ఒక మిలియన్ సంవత్సరాలు ఉంది. ఆ సంవత్సరాలలో పదివేల సంవత్సరాలుగానే ఈ నాటి మానవుడు ఉన్నాడు శారీరకంగా వచ్చిన మార్పులుకూడా చాలా ఎక్కువే. చాలా త్వరగా వచ్చిఉండవచ్చు ఈ మార్పులు' అంటారు. నిజానికినాటికీ వేటాడి బతక్కలం మనం. మనకి భాష ఉంది. పనిముట్లు ఉన్నాయి. వ్యవసాయం ఉంది; వ్యాపారాలున్నాయి. అయినా ఈ భూమిపై నిలదొక్కుకోవాలంటే — ఇతర జంతువులన్నీ ఎలా ప్రవర్తిస్తున్నాయో అలాగే మనం ప్రవర్తిస్తున్నాం—బతుకు తెరువు కోసం. బతికేదంకోసం—శతృవునంటి పరిస్థితుల్లో, కొంచెం దురాక్రమణ ధోరణికి అలవాటుపడ్డ మగవాడికి అవకాశాలు ఎక్కువగా ఉండడం న్యాయమే. మగవాళ్లు—తమ భార్యలని పిల్లలని రక్షించుకొంటుకు పోట్లాడినట్టే—ఒకరిపై ఒకరికి ఆధిపత్యం కోసంకూడా పోట్లాడుకున్నారు. మానవ పరిణామంలో ఈ పోట్లాటలు ప్రముఖ స్థానాన్నే ఆక్రమిస్తాయి—ఎలా గంటారా? అనేక యుగాలలో—ఆహారం, ఆదరణ, ఆడవారు, ఆసెక్స్ అన్నీ గెల్చుకున్న ప్రముఖులు... ఆ ఆత్మరక్షణా పద్ధతులనీ, దురాక్రమణ ధోరణులనీ — తమ తరువాతి తరాలకి పంచి యిచ్చారు

ఆడదానికోసం ఆహారంకోసం వేటాడే తత్త్వం మగవాడిది—అనడానికి శారీరకంగానూ, వైద్య నిపుణుల దృష్టిలోనూ కూడా ఆధారా లున్నాయట. 'మగవాడు జంతువే' అతనికి దూరదృష్టి, తీక్షణ దృష్టికూడా ఉంది—తన ఎరని చూడానికి! ఒడుపు ఉంది— ఎర తప్పించుకోకండా పట్టుకుందుకు. కోరలున్నాయి చీల్చి చెండాడడానికి. మగవాడి మొదటి ధ్యాస వేట అయితే రెండోది ఆడది — అనడం అబద్ధం కాదు 'మేం లేకపోతే ఎలా? వంశాలు ఎప్పుడో అంతరించి పోను కదా!' అనడం ఎప్పుడూ వినలేదా మీరు? పాతిక ముప్ఫయి సంవత్సరాల మధ్య ఎంతో ఉత్సాహం సాంసారిక సుఖమే పరమావధిగా ఎంచడం జరుగుతుంది కాని నలభై దాటగానే దృక్పథం మారి ఆపేక్షలూ అభిమానాలూ పుంజుకుంటాయి, సంసారం భారం అనిపించక చల్లని నీడగా తోచడం ప్రారంభిస్తుంది. కాని ఇదే వయస్సులో 'అయ్యో వయస్సులో మిస్ అయిపోయామే' అన్న నిజం తోచి మగవాడు తిరిగి ఆడదానివేటను ప్రారంభించడం కూడా జరుగుతూ ఉంటుంది. అందుకే భార్యలు ఈ వయస్సు భర్తలపట్ల శ్రద్ధాసక్తులు పెంచాలనడం! కుటుంబంలో సుఖశాంతులు ఉన్నవన్న నమ్మకం ఏర్పడిన మగవాడిలా కొత్తకోసం ప్రాకులాడడు—

మగవాడి ఆధిక్యం పెంపొందించేది — అతని దృక్పథమే. కాని నిజానికి కొన్ని నగ్న సత్యాలన్ను వాటిని గమనించారా? మనుష్యులకే ఎక్కువ [illegible]



జబ్బులు వస్తుంటాయి (పొంగు ?కోరింత దగ్గు ?) పెద్దయ్యాక వారికే ఎక్కువ అజీర్ణవ్యాధులూ గట్రా పట్టి పీడిస్తాయి. హార్ట్ ఎటాకులూ ఎక్కువ వారివే !... సువిశాలమైన వారి ఛాతీ మనగుండెల్లో దడ పుట్టించవచ్చునేమో గని వారికే మంత రక్షణ కాదు ! ఎక్కువ ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధులూ వారినే పీడిస్తాయి ఎక్కువగా. ఇక తగిన వాడే నిలబడతాడన్న నిజంలో— ఆడవాన్నా మగవాణ్నా ప్రకృతి నిర్ణయించింది— అంటే తెలుస్తూనే ఉంది. ఎక్కువ వేడీ, ఎక్కువ శీతలం మగవాడికంటే ఆడవారే తట్టుకోకలరు పోతే మానసిక క్షోభలూ గట్రా వారిని బాధించవా? అన్నది.

పలకరించనా వద్దా...?




చాలామంది మగవారు ఆడదానికంటే ఎక్కువ ఎమోషనల్‌గా ప్రవర్తిస్తారు. ఓ పదేళ్ల కుర్రాడు ఏడుస్తూంటే అడిగి చూడండి— ఏడుస్తున్నావా? అని. వాకంట నీరు కారుతూనే ఉంటుంది— 'లేదే' అని నవ్వడానికి ప్రయత్నిస్తాడు. పాపం ! అయితేనేం ? ప్రముఖ సంగీత విద్వాంసులు, కవులూ అంతా మగవారే అంటారు గర్వంగా. బాధగా ఉన్నప్పుడు మగవాడు మాత్రం ఎందుకు ఏడవకూడదు? ఏడుస్తారు. కాని మా కంట పడరు ఏడుస్తూ అంతే. ఎందుకేడవరు?.. తల్లిదండ్రీ 'ఛీ ఆడపిల్లలా ఏడవడమేమిటి' అంటూ వేళాకోళం చేస్తారని ఏడవరు, పెద్దయ్యాక [illegible] మాస్తుందని, 'సర్వసాధారణంగా బలవత్తర పరిస్థితులలోనూ, ప్రేయసీమేటు గానూ ఏడుస్తాం' అన్నాడొక మిలటరీ స్నేహితుడు.

వేటగాడితనం వదలలేని మగవాడీ ఇరవయో శతాబ్దంలో వేటకాడుగానే ఉన్నాడు— కాని పరిస్థితుల కనువుగా తన పద్ధతులని మార్చుకున్నాడు. మనిషుగా కాడూ?

ఈ వితండ భావాల మగప్రుగం— ఉద్రేకం కల్గిస్తుంది ... ఉత్తేజమూ కల్గిస్తుంది. ●




### జరిగిన కథ

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ల ముద్దుల మరదలు సుధ. సుధ కుంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ హౌస్ సర్జరీకి విశాఖ చేరుతుంది. తను ప్రేమించిన 'నళినితో మురళి వివాహం జరుగుతుంది. మంచి డాక్టరనిపించుకోవాలని, లక్ష్యాన్ని సాధించాలని రఘు కోరిక. దగ్గరజేరిన రాధ ఆకర్షణనుంచి తప్పుకుంటూ మనసు లక్ష్యంవైపు కేంద్రీకరిస్తుంటాడు రఘు. సుధ వివాహం కోసం చేసే ప్రయత్నాలు రఘు సలహా మీద జానకి ఆపు చేస్తుంది.

## 10

సాయంత్రం పార్వతమ్మగారు దేవాలయం నుండీ రాగానే ఏదో ఈ ప్రసక్తి తేవడంతో రఘు అభిప్రాయాన్ని ఆవిడతో చెప్పేసింది జానకి.

'అలాగా. అయితే అలా వాడిమాట మీదే నడుచుకుంటే తీరిపోతుంది' అన్నారు పార్వతమ్మగారు.

'అయితే ఇది మాత్రమే అన్నాడా. మిగతా విషయాల్లో తన అభిప్రాయాన్నేమన్నా చెప్పాడా' అని అడిగారు, పార్వతమ్మగారివల్ల ఈ విషయాన్ని తెల్సుకున్న శర్మగారు వెంటనే జానకి వద్దకొచ్చి

'ఇంకేమీ చెప్పలేదు.' అంది జానకి.

'నువ్వొన్నా కదిపి వాడి అభిప్రాయాన్ని కూడా తెల్సుకునుండాల్సింది. వాడి పెళ్లి విషయంలో, ఏం నిర్ణయించుకున్నాడో అది తెల్సుకోవడం మనకెంతన్నా ముఖ్యం అందుకనీ' అన్నారు రెండు చేతులూ వెనక్కి కలుపుకుని ఆలోచనగా తలొంచుకు నిల్చుని శర్మగారు. 'చేజిక్కిన అవకాశాన్నిలా, వదులుకుంటూరా?' అన్నట్టు.

'పోనీ రాత్రి భోజనం దగ్గర—'

'వద్దు. మళ్లీ కోపం అంటే అందువల్ల. మనకీ వాడికీ కూడా కొన్ని కొన్నిబ్బందులున్నాయి' అంటూ వెళ్లిపోయారాయన. న్యాయానికి ఆ దంపతులకి రఘూ, సుధా, ఇద్దరియందూ సమానాభిమానాలే. సుధ మామూలు పిల్లగా గనక వుండివుంటే, రఘు ఒకవేళ సుధని ఇష్టపడకపోయినా కూడా వారు కొంతవరకూ నచ్చచెప్పుండే వారేమో కూడా. అయితే సుధకున్న ఈ పెద్ద లోపాన్నుద్దేశించి అటుచేసుకోమని తాముగా రఘుతో చెప్పనూలేక ఇటు వద్దని ఖచ్చితంగా అననూ లేక అవస్థగా వుండడం వల్ల, ఆ నిర్ణయాన్ని రఘుమీదే వదిలి ఇన్నాళ్లూ ఊర్కున్నారు.

అయితే వచ్చిన సంబంధాలన్నింటికీ 'అబ్బాయి చదువు పూర్తవాలి ముందు' అని చెప్పి తప్పించుకుంటూన్న ఆ దంపతులకి రఘు చదువైపోయిన కారణంగా ఇకమీదట ఏం కారణం చెప్పడమా?' అనుకుంటూండగా — వారి సదుపాయం కోసమే వచ్చినట్లుగా ఒక మంచి అవకాశం లభించింది మళ్లీ.

తరువాత ఎవరో ఒకరు 'మా పిల్లని చూసేందుకు రండి' అంటూ తమ ఇంటికొస్తూండడం, ఎటూ చెప్పలేక వారు ఇబ్బంది పడుతూండడం చూసి రఘుకీ చిరాగ్గానే ఉంటూంది. అందుకే,

'ఇంకలో పెళ్లి ప్రయత్నాలేవీ లేవని చెప్పేస్తూండండి నాన్నా' అన్నాడు ఒక రోజు శర్మగారు మాత్రం వున్న సమయం చూసి రఘు.

'దేనికన్నా వో న్యాయం లేదా రఘూ, ఇన్నాళ్లూ అంటే, చదువు వంక పెట్టాం. బాగుంది. ఇంకా అందర్నీ ఇలా తిప్పడం న్యాయంకాదు' అన్నారు పేపరు చూస్తూనే

'అది నిజమేననుకోండి. అయినా కొన్ని నెలల్లో బహుశా నేనమెరికా వెళ్లాల్సి వుంటుందేమోనని అనుకుంటున్నాగా! మరి...'

'అది నిశ్చయమేనా.'

'అనే అనుకుంటున్నా, అదేదో సరిగ్గా తేలాకనే మీతో చెప్పొచ్చునని ఊర్కున్నాను.'

'అక్కడెంత కాలం వుండాల్సుంటుందీ.'

'ఏమో తీసుకున్నది సర్జికల్ సెక్షన్. దాన్ని గురించి ఏన్నేళ్లు ప్రాక్టికల్సు చేసినా కావటమంటూ గాని, ఇన్నాళ్లల్లో అవుతుందనిగాని వో పరిమితంటూ ఏం వుంది? కనీసం వో మూడు నాలుగేళ్ల పాటన్నా వుంటేనే తప్ప అంతదూరం వెళ్లి లాభం వుండదు. ఏం? ఎందుకు నాన్నా?' అన్నాడు తండ్రివేపు చూస్తూ రఘు.

'అబ్బే! ఊర్కేనే'? ... అంటూ ఈజీ ఛేర్‌లో జారబడ్డాడాయన.

'మరీ అంతకాలం అంటే తిరిగొచ్చే సరికే 'టూ లేట్' అయిపోదూ.' అన్నారు మళ్లీ

'దేనికి, 'మ్యేరేజ్'కా.'

'మరే?'

'అబ్బే! ఈ కాలంలో అందువల్ల ఇబ్బందేం వుంటుంది నాన్నా' అన్నాడు నవ్వుతూ రఘు.

'వయసుకు తేడా లేకుండా పిల్లలు దొరికేటంత మాత్రాన్న అయిపోతుందా రఘూ. మనుషులన్నాక వయసుకి తగ్గట్టు మార్పులూ, భావాలూ — ఇంతకీ తగినంత

కారణం లేందే వెనక్కి తొయ్యడంలో అర్థం లేదు.' అన్నారు అంతరార్థంగా.

'బాగుంది నాన్నా. విద్య కడ్డం అవుతుందనడంకన్నా కారణం ఇంకా ఏం వుండాలని. అయినా మీకీ విషయంలో అభ్యంతరం ఏవన్నా వుందంటే నా అభిప్రాయం మార్చుకుందుకు ప్రయత్నిస్తా న్నానాన్నా.' అన్నాడు వినయంగా రఘు.

'అంటే చదువూ అయిపోయినట్టే లెక్క గనకా, వయస్సూ ఇప్పుడు సమంగా వుంది గనకా. పెళ్ళి చేసేసుకు వెళ్ళావంటే మరో ఏడాది ఇటూ అటూ అయినా అంత ఇబ్బందుండదేమో నని నేననుకున్నాను. అయినా నిర్బంధం ఏమీ లేదిందులో. నీ వీలూ చూసుకుని ఎటు ఉచితమని తోస్తే అటు చెయ్యి.'

'క్షమించండి నాన్నా, ఈ పెళ్ళి విషయంలో నే నింకా ఏ నిర్ణయానికీ రాలేదు. అలా రావడం అంత సులభమైన సంగతి కూడా కాదు గనక దీనికొంత కాలం పడుతుంది.'

'అలాగా, అయితే ఆ మాట అమ్మా వాళ్ళతో చెప్పెయ్యి — సరి ఇప్పుడీ ప్రయాణం నిశ్చయమన్న మాటేనా?' వెళ్ళబోయినాయన మళ్ళీ ఆగి అడిగారు.

'ఆ. ఒకవేళ ప్రయాణం ఖర్చులు కూడా కొంతవరకూ మనమే భరించాల్సిం టుందేమో కూడా.'

'దాన్ని గురించి ఏమీ ఇబ్బంది లేదు. కాదంటే ఈ సంగతి నిశ్చయం కాగానే నాకు తెలియజెయ్యి, అంతే.' అంటూ వెళ్ళిపోయారాయన.

తండ్రి వెళ్ళడంతోనే రఘు మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు. నాన్న చెప్పిందీ వో పాయిన్టే! ఎందుకంటే ఇక్కడ రాధ జతపడ్డట్టుగా అక్కడా మరొక రెవరైనా సిద్ధమయిందంటే మళ్ళీ ఎట్నుంచెటొస్తుందో ఏమో? అందువల్ల ఆ పెళ్ళేదో చేసేసుకునే వెళ్తే తీరిపోతుందేమో, అనికూడా అనిపించిం దతనికి. అయితే మనసుని నిలబెట్టుకోగల్గే శక్తి మనిషిలో స్వతహా వుండాలే గానీ, అది లేనప్పుడు ఈ పెళ్ళి చేసుకున్నా మన్నది ఎంతవరకూ మనిషిని అదుపులో వుంచగల్గుతుందనీ. అదీగాక పెళ్ళంటూ ఒకటి వెలగబెట్టుకుని వెళ్ళితీరా అక్కడ మనోవిభ్రాన్ని దిగజార్చుకోవడం గనక జరిగిందంటే, ఇక ఆ భార్యని క్షోభపెట్టడం కూడా నా అపరాధం. అంతేగా!'

అన్నట్టు రాధా రోహిణీకూడా అప్లికేషన్లు పెట్టారని తెలిసింది. అయితే మళ్ళీ అక్కడా తనకీ అగ్నిపరీక్ష తప్పదా. ఎందుకు తన ప్రయత్నాల కిలా అడ్డంకులొస్తున్నాయో అతని కర్థంకావడంలేదు.

రఘు అమెరికా ప్రయాణాన్ని గురించీ తెలిసేలోగా వారికాలేజ ప్రిన్సిపాల్ ద్వారా బొంబాయిలోని ఒక గొప్ప హాస్పటల్లో కొన్నాళ్ళపాటు ఎముకలకి సంబంధించిన పరిశోధనల్లు జరిపే అవకాశం లభించింది రఘుకి. ఆ పరిశోధనల్లో అమిత అభిమానం చూపుతున్న రఘు ఆసక్తి మద్దేశించి తను ప్రత్యేకంగా శ్రద్ధతీసుకుని



రఘు అక్కడికెళ్ళి ఇంకా అనుభవం సంపాదించే అవకాశం కల్పించవారాయన.

అంతేకాదు. రఘూ రాధల్ని గురించి వీవరికి తోచినట్టు వారు అనేక విధాలుగా కథలు కట్టడంతోపాటు తనకీ ఆ జంట ముచ్చటగా తోచినందున రఘుకి ఆ విషయంలోనూ ఒక సదవకాశం కల్పిస్తున్నా ననుకుంటూ రాధకికూడా అతనితోపాటు పంపించాలన్న ప్రయత్నాలేస్తున్నా డాయన. అయితే హఠాత్తుగా ఆఖర్న ఈ విషయంచెప్పి రఘుని ఆనందపరచాలను కున్నందున ఇంకా ఆ విషయం బయటపెట్టలే దాయన.

సుధని గురించిన వివరాలన్నీ కొంతవరకూ రాబట్టిన రఘు కొన్ని నెలలపాటు ముందుగా కొన్ని కొన్ని 'ఇన్ జెక్షన్లు' వగైరా సుధకి ఇవ్వదలచున్నందున తను బొంబాయి వెళ్ళినప్పుడు, ఆపని తనని చూసుకోవలసిందిగా నళినికి అప్పగించాడు రఘు. రాధ నిందుకు నియమించడ వన్నది ఎందుకో అతనికి సమంజసమనిపించలేదు. సుధకి రాయవెల్లూరులో జరగవలసున్న వైద్యాన్ని గురించి ఇంట్లో మిగతాఅందరికీ ఏవంతఆక్షేపణలేకపోయినా పార్వతమ్మగారికి మాత్రం ఈ వైద్యం తలపెట్టడం ఎంతమాత్రం ఇష్టం లేదు.

'అయినా ఏదో పాపా, సద్యం అన్నీ నేర్చుకుని హాయిగా కాలక్షేపం చేస్తున్న దాన్ని అలా వుండనివ్వకుండా ఇప్పుడీ 'ఆపరేషన్' అంటూ ఒకటి పెట్టారెందుకండీ? నాకేమీ ఇష్టం లేదు.' అన్నారు వంటరిగా కూర్చుని ఏవో కాయితాల్లు దిద్దుకుంటూన్న శర్మగారితో ఆవిడ

'ఏమో. వాడి మనసులో ఏం వుందో, అదీ గాక చంద్రునిలో మచ్చలా సుధకున్న ఆ వంకర తీర్చెయ్యడం మంచిదేగా.'

'ఏమో, నాకు భయంగా వుందిసుమండీ! మా అత్తయ్య మనవరాలి సంగతి జ్ఞాపకం లేదూ మీకూ?' అన్నారు కాస్త గొంతుక తగ్గిస్తూ.

'ఆ పిల్లకి పుట్టుకలోనే వున్నందున మాట దక్కలేదని కదూ అప్పుడంతా అనుకుంటా? అదీ గాక 'హార్టెటాక్'వల్ల పోయింది కాని ఈ కారణంగా కాదను కున్నారేమో కూడా.

'ఆ. అలా అనక మరేలా అంటారండి. పదహారేళ్ళదాకా నిక్షేపంలా వున్న పిల్లకి ఉన్నట్టుండి గుండె జబ్బేక్కణ్ణుంచొచ్చిందనీ. ఏదో ఆ సంబంధం ముడి పెట్టాలని, కొంత ముదిర్నకాలిని కోసి కొరతలు పెట్టేసరికీ, జన్ని కమ్మేసిందిట. నా మాట విని ఈ ప్రయత్నం మానెయ్యమని మీరు స్పష్టంగా చెప్పేద్దురూ.' ప్రాధేయపడిందావిడ.

'అబ్బే! సుధ విషయంలో అలాంటి ప్రమాదం ఏమీ వుండదు పార్వతీ. సుధకి తరవాతొచ్చిన లోపంగాని ఇది పుట్టుకలోంచీ వున్నది కాదని తేల్చేరుగా?'

'లేదండీ మా మేనత్త పోలిక లటు వాళ్ల మనవరాలికొచ్చినట్టే ఇటు మా తమ్ముడి కూతురికీ వచ్చిందోలి. అందువల్లనే సుధని చేసుకోమని గట్టిగా అనడానిక్కూడా, ఇది వంశపారీగా బాధిస్తుందేమోనని నాకు భయంగానే వుంటూంది చెప్పొద్దూ.'

'నువ్వన్నట్టూ పుట్టుకలో వంటే అంతే అనుకో. మరి వాడు ఎంతెంతో పరిశోధనల్ని జరిపించి జన్మలో వచ్చింది కాదని రుజువు చేసుకున్నాడుగా.'

'అవన్నీ సరిగ్గా తెలియపరిచేవే అంటారా?'

'ఆ, అందుకే ఒక్కొక్క పద్ధతి కనిపెట్టడానికి ఎంతెంత ఇబ్బందులు పడుతూంటారు ఈ పరిశోధకులు. అయినా నాకూ ఇది వంశ సాంప్రదాయమౌతుందేమోనన్న భయం ఇంతో అంతోవుందనుకో. వున్నా, ఒక సత్కార్యం వాడు తలపెట్టి నప్పుడు వాడి ప్రయత్నాలకి నేనడ్డుపడి నిరుత్సాహ పరిచినవాణ్ణవుతానేమోననీ! ఒక తండ్రి దూరాలోచనపరుడైన తన కొడుక్కి ఎంతవరకూ చెప్పొచ్చునో, అంతవరకే వాడికి బోధపరిచి అంతతో ఊరుకున్నాను.' అన్నారు చేతిలోపని కట్టిపెట్టి భార్యవేపు చూస్తూ.

'కానివ్వండి దైవ నిర్ణయం ఎలా వుందో, అలాగవుతుంది' అంటూ కాస్సేపేదో ఆలోచిస్తూ అలాగే నిల్చున్నాక ఇవతలికొచ్చేశారు పార్వతమ్మగారు.

'అత్తయ్యా?' ఆ పక్కగదిలో వున్నాన్ని సర్దిపెడుతూ వారి సంభాషణంతా విన్న సుధ గడపదాటి వెళ్ళిపోతూన్న పార్వతమ్మగార్ని పిలిచింది.

'ఏవమ్మా?' తెల్లబోయి చూస్తూ సుధ వద్ద కొచ్చారావిడ.

'ఈ వైద్యాన్ని గురించి మీరేమీ అడ్డు చెప్పకండత్తయ్యా' బతిమాల్తూ అడిగింది సుధ.

'నీకు తెలియదమ్మా—'

'ఇందులోని కీడు మేళ్ళన్నీ నాకు బాగా తెల్సునత్తయ్యా. నా మీదున్న అభిమానం కొద్దీ, మీరలా అనుకుంటున్నారు కానీ ఈ అవిటితనం కారణంగా పది మంది మధ్య నే పడుతూండే అవమానం మీకెలా అర్థమవుతుంది?'

'అందుకని'—

'అ గండత్తయ్యా నన్ను పూర్తిగా చెప్పనివ్వండి. మీవరకూ మీరంతా నా లోపాన్ని ఎత్తి చూపించకుండా ఎంతో అభిమానంగా నన్ను చూసుకోగలరు. ఎంత ఖర్చయినా చేసి నాకో భర్తని సంపాదించి పెట్టనూ గలరు. ఆ డబ్బుమీది అభిమానం కొద్దీ నన్ను చేసుకున్న ఆ భర్తకి నామీద అభిమానం ఎందుకుంటుంది? ఒకవేళ ఒక విధమైన జాలో, లేక ఇంత ఆస్తి తన కిచ్చినందుకు సానుభూతో, నాయందతనికే పాటున్నా కల్గినా 'ఆ కుంటిదాని భర్త, ఆ సొట్టకాలు పిల్ల మొగుడూ' అంటూ నా వంకర్నని అతడికీ అంటగట్టుతూ, అతని సహనాన్ని కసిగా మారేలాగ రెచ్చగొట్టి నా మీద అభిమానాన్ని మిగతా వారంతా నాశనం చెయ్యక మానరు. ఇలా నాతోపాటు అతన్నీ అగచాట్లపాలు చెయ్యడం వేరూ అగచాట్ల పాలవడం తప్పించి ఇందులో నే బాపుకునేదేం వుందని? ఇప్పుడు చెప్పండత్తయ్యా, ఇటువంటి హాస్యపు బతుకు బతికేకన్నా ఇటో, అటో తెమిల్చేసుకోవడం ఎంతో మంచిది కాదూ.'

'అమ్మమ్మ, నా తల్లి వికద్దూ, అటువంటి మాటలు మాత్రం ఎప్పుడూ అనకు తల్లీ 'ఏదో సొమ్మాసె చూపువాం పెళ్ళి చేసేద్దాం' అనుకోవడమే తప్పించి. అందువల్ల నీ కిన్నిన్ని ఇబ్బందులున్నాయన్నది నువ్విప్పుడు విడమరిచి చెప్పే వరకూ మాకు తోచలేదే తల్లీ. నీకు పెళ్ళీవద్దు, పేరంటమూ వద్దు. మాకళ్ల

ముందిలా మనసివ్వాన్నావంటే అంతే చాలు' అన్నారు సుధని తన గుండెలకి గట్టిగా హత్తుకుంటూ పార్వతమ్మగారు.

'భగవాన్ దత్తయ్యా. ఎన్నెన్నో కొత్త కొత్త వైద్య పద్ధతులు కనిపెడుతూన్న ఈ రోజుల్లో మీరిలా భయపడ్డంలో అర్థమే లేదు. అందులోనూ బావ స్వయంగా నన్ను చూసుకుంటూన్నప్పుడు ఇంకా మీకీ పిరికితనం ఎందుకూ. స్మితపడం దత్తయ్యా, మీరు మనస్ఫూర్తిగా నన్నాశీర్వదించి పంపితే తప్పకుండా జయం లభిస్తుంది' అంది చేతులొత్తిడిస్తూ సుధ.

'నా తల్లి వికదే. నీ మంచి బుద్ధికి అలాంటి పర్వా, నీకు మేలే చేకూరుస్తుందమ్మా. వస్తా' అంటూ సుధ తలని ప్రేమతో వోసారి నిమిరి చాటుగా చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయారావిడ.

'పిచ్చితల్లి. ఎప్పుడో జరగబోయే వైద్యాన్నిగురించి ఇప్పట్నుంచే ఎందుకో ఈ బెంగ' అనుకుంది సుధ. అయినా ఏందువల్లనో తనకే అర్థంకాని దిగులేదో తనలోనూ తరుచూ మెదుల్తూనే వుంది. అయినా బావ అభిలాషని కాదనే ధైర్యమూ ఆసక్తమూ ఎప్పుడూ లేదు సుధకి. ఒకవేళ తనేమన్నా అయిపోయిందంటే అప్పుడు?' ఇలాంటి ఆలోచనల నీడలు సుధని అప్పుడప్పుడూ వేధించక పోలేదు. అయినా బావకోసరం తను ఏంచేయాలన్నా సుధ కేవిధమైన అభ్యంతరమూ ఎప్పుడూ లేదు, వుండదు కూడా.

బొంబాయి వెళ్ళేందుకు ముందుగా 'ఓ.టీ.కెన్' విషయంగా వోసారి విజయవాడ వెళ్ళాల్సివచ్చింది రఘు.

అక్కడున్న నాలుగు రోజుల్లోనూ, 'రాధ ఇంటివారెవరికంటా పడకుండా ఎలా బయటపడగలనా?' అనుకుని భయపడుతూన్న రఘు అక్కడికి వెళ్ళి వ్వాటి సాయంత్రమే. దత్తుగారి కళ్ళపడి పోవడంజరిగినందున, తప్పనిసరిగా ఆయనతో కలిసి వారింటికి వెళ్ళవలసొచ్చింది.

అనుకోకుండా రఘు వారింటికి రావడంతో రాజమ్మగారి ఆనందానికి మేరే లేకపోయింది.

ఎక్కడ దిగాడో. ఎన్నాళ్ళుంటాడో. మొదలైన వివరాలన్నీ కనుక్కున్నాక... 'ఏవండీ? హోటల్లో అతన్నిమానివప్పుడు వెంటనే ఆ గది ఖాళీచేయించేసి ఆ సామాన్లూ కూడా — తీసుకొచ్చెయ్యకుండా. ఏవిటండీ మీ నేమ్మా మీరూనూ, ఇప్పుడన్నా వెళ్ళి తెండి.' అంటూ భర్తని గౌరవంగా మందలించిందావిడ.

'దానికేం అతన్నిక్కడే వుంచి నే వెళ్ళొస్తా' అన్నారు రూము తాళం ఇమ్మన్నట్టు గాచెయిచాస్తూ దత్తుగారు.

'అబ్బే వద్దండీ. నేవొచ్చిన పనికి అక్కడుంటేనే నాకు వీలుగా వుంటుంది' అన్నాడు తనూ లేస్తూ రఘు.

'ఆదేమిటి బాబూ! మరి ముందో, వెనకో బంధువులు కావలసిన వాళ్ళం కదా! అయినా మేమిక్క ఊరొచ్చినప్పుడు తిన్నగ మీ ఇంట్లోనే దిగలేదూ? అన్నారు ఫలహారం పళ్ళెన్ని తెచ్చి చేత ఒళ్ళమీద పెట్టేస్తూ' రాజమ్మగారు.

'అలా వీలుగా వచ్చినప్పుడు నేనూ తప్పకుండా ఇక్కడే దిగుతాలెండి. ఈసారికి క్షమించండి.' అంటూ సర్ది చెప్పి టిఫిన్ తీసుకున్నాక కాస్సేపటూ, ఈమాటా, మాట్లాడేసి బయల్దేరాడు రఘు. రఘుని దిగబెట్టడానికని బయల్దేరుతూ ఏదో పనిగా లోపలికెళ్ళిన దత్తుగార్ని చాటుగా నాంగూ పెట్టి 'ఈపైనన్నా సరిగ్గా ప్రవర్తించండి', అంటూ, ఆ విధానాన్ని బోధపరిచి మరీ పంపిందావిడ.



మోడల్ అమ్మాయిలా కన్పించే ఈ సుందరి అయిదు భాషల్ని (ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్, రష్యన్, చైనీస్ మాట్లాడగలదు. 'భాషలు నేర్చుకోవడం నా హాబీ' అంటుందీ 29 ఏళ్ళ తైవానీస్ టింగ్ కిట్ లేడింగ్, (ఫ్రాన్స్)

# అతని లక్ష్యం

కార్లో తన పక్కనే కూర్చున్న రఘుతో ఆ మాటా, ఈ మాటా మాట్లాడి రాధ పెళ్ళి మాటల్లోకి తెచ్చి 'అప్పట్లో నువ్వేం చెయ్యదల్చావ్ ?' అన్నారు ఏదో సందర్భానుసారంగా అప్పుడే గుర్తొచ్చినట్టుగా నటిస్తూ దత్తుగారు.

'అంతకన్నా విధాయకమైన పనులెన్నో ఇంకా వున్నాయండీ నాకూ!' అన్నాడు ఆయన ధోరణిని కనిపెట్టిన రఘు

'దానికేం? అవన్నీ మహారాజులా చేసుకోవచ్చు. పెళ్ళి చేసుకుంటే విశ్వవ్యాప్తి కట్టిపోతున్నదనుకోవడం ఆ రోజుల్లోనోయి? ఇక ఇప్పుడా మొగవారితో సరిసమంగా ఆడవారూ బాగా చదువూ, సంస్కృతుల్నీ అలవరుచుకోవడంవల్ల, ఆ చేసుకున్న భర్త ఆశయాలకు వారూ చేదోడూ వాదోడుగా వుండి వారి పని సులువు చేస్తున్నారు నేటి భార్యలు.' అన్నారు విపులంగా బోధిస్తూ.

'అలాగా వుండొచ్చు, లేక ఆవిడ ఆశయాల కనుగుణ్యంగా అతణ్ణే మారవలసిందిగా నిర్బంధించేవారుగానూ వుండొచ్చు. ఎందుకంటే ఎప్పుడైతే ఆవిడా చదువుకున్నదయిందో, అప్పుడే ఆవిడకీ కొన్ని ప్రత్యేక అభిలాషలుండొచ్చును గాని.'

'వారి విద్యా విధానం వేరొక విధమైనదీ గనక అయితే నువ్వన్నట్టు తప్పకుండా అభిప్రాయబేధాలు కలగచ్చు. అయితే ఒకేలైనులో విద్య నభ్యసించే వారిలో ఇటువంటి తేడా రావడానికేవిధమైన అవకాశమూ, ఉండదుగా.' ... అన్నారు రాధని నువ్వు చేసుకోవడంలో అభ్యంతరం వుండకూడదు సుమా, అని ప్రత్యక్షంగా చెప్పడమే తరవాయిగా ఆయన.

'అదృష్టం బాగుండి అలా నడుచుకో[illegible] ఏమోగాని లేకపోతే భిన్నాశయాలుగల [illegible] ఇద్దరికీ కల్గనుండే ఇబ్బందుల్ని [illegible]కుందుకూడా శక్యం కానివి' అన్నాడు నిర్మొహమాటంగా రఘు.

ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల్గే దత్తుగారు రఘు మాటల్లోని భావాన్ని అర్థం చేసుకోకపోలేదు. ఏం? రాధస్వభావమిటువంటిదో ఆయనమాత్రం ఎరగకనా? అయినా ఏదో తాపత్రయం! అంతే.

'అదీ నిజమేనోయ్. [illegible] పెళ్ళన్నది జీవితమంతా దానిమీద ఆధారపడవలసున్న ఒక ముఖ్య ఘట్టమాయె. [illegible] అన్నివిధాలా బాగా ఒకసారికి 'నాలుగుసార్లు ఆలోచించుకోకపోతే ఇబ్బందికాదూ మరీ; అందులోనూ కొంతమందున్నారు చూశావ్, ఏ కావలసిన పిల్లలనో, ఏ ఆస్తికోసరమనో, అలా, ఇలా ఆయమూయ గారడీ చేసేసి మెడలు వంచి నిర్బంధంగా ముడి పెట్టేస్తూ వుంటారు. అలాంటివన్నీ చాలా ప్రమాదమైన పనులని నా అభిప్రాయం. ఏమంటావా? ఏదో, ఏ గుడ్డో ఏ తిండో ఏ మిగతా సామాన్లో వగైరాలో అయినట్టయితే 'పోతే పోనీ! మరోసారి మన కిష్టమైనది అమర్చుకుందాం' అనుకోవచ్చు. మరి ఈ పెళ్ళన్నది అలాగా చెప్పు? జీవితాంతం వరకూ కష్టసుఖాల్లో భాగం పంచుకుంటూ ఎంతో ఆనందంగానూ సుఖంగానూ గడపాల్సిన భవిష్యత్తు. ఈ అవక తవక పెళ్ళిళ్ళతో జీవితం చప్పీ, సారం, లేక నిరుత్సాహమై ఊర్కుంటుంది. అందుకే, మన అభిమానాల్నీ, చుట్టరికాల్నీ, మరోవిధంగా చూసుకోవచ్చును కానీ: ఆ వంకపెట్టి పెద్దవాళ్ళటువంటి విషయాల్లో మాత్రం ఎప్పుడూ జోక్యం చేసుకోకూడదు. అలా తెలివితక్కువ తనంగా వాళ్ళొకవేళ కల్పించుకున్నా ఆ ఫలితాన్ని అనుభవించాల్సిన్న కుర్రాళ్ళన్నా ఈ పద్ధతిని నిర్భయంగా ఖండించెయ్యాలి. లేకపోతే దేశం బాగుపడదు' అన్నారు అక్కడికి ప్రజాక్షేమంకోరే పెద్దమనిషిలాగ.

పాపం 'ఏదో విధంగా ఈ పని జయప్రదంచేసి భార్య అధికారాల్నుంచి తప్పుకోవాలి' అన్న దృష్టి ఒక్కటే ముఖ్యంగా వుంచుకుని అందుకనుగుణముగా మాట్లాడుకుంటూ పోయారేగానీ అందులోని స్వలాభభావం ఎంత నగ్నంగా ఎదుటివారికి విపులంగా బోధపడి పోతుందో, అన్న ఆలోచనే ఆయనకి తోచలేదు.

అయితే ఆయన ఏ అభిప్రాయంలో ఎవర్నిగురించి అంటున్నారో అన్నది బాగా అర్థం చేసుకున్న రఘు, ఆయన స్వబుద్ధీ, స్వాభిమానం, అంటే ఏమిటో ఎరగని భార్యచేతుల్లోని వాయంత్రంవంటి వాడు. అనుకుని తన్లోతను నవ్వుకున్నాడు. అందులోనూ నిజం లేకపోలేదు. రాజమ్మగారెప్పుడూ అందరితోటీ ఏకరువు పెడుతూన్నట్టుగా ఇదంతా ఆవిడ అదృష్టం కొద్దీ వచ్చిన అదృష్టమేనన్ననమ్మకం బాగా మనసుకు పట్టిపోయిన దత్తుగారు మొదట్నుంచీ తన ఇష్టాయిష్టాల్లో ఏ మాత్రమూ నిమిత్తం లేకుండా ఆవిడ చెప్పినట్టూ ఆవిడచేత యంత్రంలాగే నడుచుకు పోతున్నారు. అందుకే పనిలో పనిగా ఈయనకో చిన్న పాఠం బోధించి ఇకమీద నన్నా ఇటువంటి ఇంగితంలేనిపనులు చెయ్యకుండా చూడాలన్న వో అభిప్రాయం కల్గింది రఘుకి.

'అయితే అదెలా ప్రారంభించడం?'

'ఏమోయి? నేనన్నదీ. న్యాయమేనంటావా?' అంటూ ఆయనే మళ్ళీ హెచ్చరించారు; తనబోధన ఎంతవరకూ పని చేసిందో నన్నది తెల్సుకునే ఉద్దేశంగా.

'క్షమించాలి. ఈ విషయంలో మీతో నేనేకీభవించలేను. ఏమంటారా? ఈ ఆనందం సుఖం ఇవన్నీ వారి వారి మనస్తత్వాలమీద ఆధారపడుంటుంది. భక్తుడు తన ఇష్టదైవాన్ని పూజించడంలో ఆనందిస్తే గాయకుడు తన సంగీతంలో గొప్ప సుఖాన్ని పొందుతాడు. అలాగే వారి వారి అభిరుచుల్నిబట్టి అవి సక్రమంగా సాగించగల్గడంలో ప్రతివారూ ఆనందాన్ని పొందగల్గుతారె గని అందరికీ అందంలో ఆనందం స్వార్థంలోనే సుఖం అనుకుందుకు వీల్లేదు.

అందులోనూ ఏకంగా చంద్రమండలాన్నే చేరకోవాలని ప్రయత్నించే ప్రయాణానికి ప్రయోజకత్వం మాపుతూ ముందుకు పరుగులెత్తుతూన్న ఈ కాలంలో స్వసుఖాల్లో ఆనందం వుందనుకునేవారు విద్యావంతుల్లో ఏ కొద్దిమందో మాత్రమేనని నా అభిప్రాయం' అన్నాడు ఆయన చెప్పిన దాన్నంతా ఖండిస్తూ రఘు.

ఇంతలో రఘు దిగిన హోటల్ రావడంతో తరుచూ రావలసిందిగా మరీ మరీ చెప్పి వెనక్కి మళ్ళారాయన అతని మనో నిబ్బరానికి మనసారా అభినందిస్తూ.

'వాళ్ళ అభిప్రాయాలేమేవిధంగా వున్నాయో అన్నది క్షుణ్ణంగా అర్థం చేసుకున్న రఘు ఇంకో నాలుగురోజులా వూర్లో వున్నా, మళ్ళీ వారి కళ్ళబడకుండా తప్పించుకు తిరిగాడు. రఘు విజయవాడనుంచి తిరిగి వచ్చేసరికి స్నేహితులంతా కలిసి ఒక 'పిక్నిక్' ప్రోగ్రాం ఏర్పాటు చేసుకుని రఘు రావడంతోనే అతన్నీ తీసుకుని బయల్దేరారు.

(ఇంకా ఉంది)

# వడ్డించేవాడు మనవాళ్ల కథలు*



## మనిషికి సరిపడు చొక్కా కథ!

కె. బి. యస్. శర్మ



### ఉపోద్ఘాతం

వడ్డించేవాడు మనవాడైతే మనకి చాలా బాగుంటుంది. కాని వాడికే పాపం ఏమంత బాగుండదు. ఇతర్లకేమాత్రం అనుమానం రాకుండా వాడు మనవాళ్లకి వడ్డించ గలగడం ఒక పెద్ద గండం గడిచి గట్టెక్కడం. ఉపేంద్రుడు దానవాధములు కనుమానం కలుగకుండా తనవాళ్లైన ఇంద్రాదులకు మాత్రమే అమృతం వడ్డించటానికిగాను నడుముకి చీరకట్టుకున్నాడు. దానితో నానాపాట్లు పడి భరతనాట్యం చేసాడు. అయితే దేవతలకి చీమ కుట్టినట్టుగా కూడా లేదు వడ్డించేవాడు కదా అని ధీమాతో పంక్తులు దీరి కూర్చున్నారు. ఇంతకీ చెప్పొచ్చిందేమిటంటే తినేవాడికే బాధా లేదు. వడ్డించేవాడిదె తలకాయ నొప్పంతాను

ఎవరైనా వెంకట్రమణకేమిటి! వాళ్లమామో బిగ్ షాట్. వాళ్ల మామ తల్చుకుంటే వెంకట్రమణ కుద్యోగం నిమిషాల్లో పరిగెత్తుకొస్తుంది అని అనుకున్నా, అన్నా వాళ్లు అమాయకుల జాతికి చెందుతారు. అల్లా అంటే వెంకట్రమణ వాళ్ల మామ బిగ్‌షాట్ కాదని కాదు. వెంకట్రమణ కుద్యోగం రాదనీ కాదు. కాని నిముషాల్లో పరిగెత్తుకొస్తుందని అనుకోడం, అనడం వాళ్లని అమాయకులుగా పట్టిస్తాయి. వాళ్లకి అవినీతి—[illegible] గురించి, పార్లమెంటులో పొరుగింట పచ్చదనం చూస్తే గిట్టని ప్రతిపక్ష సభ్యుల ప్రశ్నల గురించి ఏమాత్రం తెలియదని, తెలిసిన వాళ్లకి తెలిసిపోతుంది.

తనవాడికిచ్చుకునే ప్రతి ఉద్యోగం వెనకాతల మన వాళ్లు నడిపే పెద్ద కథా కమామీషూ ఉంటాయి. టెస్టు మాచ్ ముందర పిచ్‌ను బదును చేసినంత పకడ్బందీగా నేల చదును చేయటం ఉంటుంది. శ్రీకృష్ణ భగవానుడు తల్చుకుంటే పాండవులకో కొత్త రాజ్యం సృష్టించడమో రాత్రికి రాత్రికి మీ ఆయువు తగ్గించేసాను అంటూ కౌరవుల్ని చంపేయడమో చెయ్యలేక పోయేవాడా? కాని పాండవులకి రాజ్యం ఎందుకు రావాలి అన్న విషయం మీద సర్వకాల సర్వజన సమ్మతంగా వో పెద్ద ఫైలు బిల్డప్ చేశాడు. దాన్ని వ్యాసుడు భారత మనే పుస్తకంలో ఏర్పాటుగా సర్దాడు. కృష్ణ భగవానుడు వాడినదానికి అందరు రాజనీతి అని పేరుపెట్టి గౌరవించటం నేర్చుకున్నారు.

ఇప్పుడు ఇప్పించటానికి రాజ్యాలు లేవు. ఉద్యోగాలున్నాయి. ఆ ఉద్యోగాల్ని అయిన వాళ్లకిప్పించడాన్ని ఉద్యోగ నీతందాం. ఉద్యోగనీతిజ్ఞులు మొదటి తరగతి రైలు పెట్టెల్లోను, వాళ్ల ఇళ్లల్లోను నక్షత్రాల హోటళ్లలోను తెల్లగుర్రం మీద నల్ల వీరుడు దౌడు తీసే టప్పుడు తమ తమ అనుభవాల్ని కలబోసుకుని పుంజు తోకలు చేసుకుంటారుట. అల్లా అని, వెళ్లిన వాళ్లు విని నాతో చెప్పగా నేను విని మీతో మనవి చేసుకుంటున్నాను.

### మనవి

అయ్యా! ఉద్యోగ నీతిజ్ఞుడుగారూ! మీరు చాలా గొప్పవారు. అల్లా మీకు సర్టిఫికేటివ్వటానికి నేను తగను. కాని గాంధీ బాబా! నువ్వుగొప్ప వాడివిస్మీ! అంటూ ఆయన భుజాన్నే తట్టిన దేశంలో పుట్టిన అలవాటు కొద్దీ అంటున్నాను.

మీరు, తెలుగు సినిమాల్లో మాంత్రికుడి మాయాజాలంలాంటి ఎన్ని ఇబ్బందులెదురైనా కాంతారావు లాగా అన్ని కష్టాలకి వోర్చి మీరనుకున్నది సాధిస్తారు. మీరెవరికైనా ఉద్యోగం వేయించదల్చుకుంటే ఎట్టి క్లిష్ట సమయాల్లోను ధైర్యం కోల్పోరు. భర్తృహరి ఆరంభింపరు... అంటూ చెప్పిన పద్యంలో ప్రారబ్ధార్థము నుజ్ఝగింపరి మనుష్యులకి మిమ్మల్ని ఉదాహరణగా తెలుగు మేష్టారు చెప్పవచ్చు.

మీరు చేర దల్చుకున్న లక్ష్యం వైపు మీ ముక్కు తిప్పుకుని ఆ వైపు ముక్కుకు సూటిగా వెళ్లగల సామర్థ్యం మీకుంది పైగా మీరు మొహమాటస్థులు. ఎవరికైనా మీవాళ్లకి ఉద్యోగం వేయిస్తాననే మాటిస్తే మీరు మానెయ్యడానికి మొహమాట పడ్తారు..

మీరంటే, నాకు అందరిలాగా ఎనలేని గౌరవం. మీకొక అభిమానసంఘం పెట్టడానికి వెనుదీయను. ఈ రచన చంద్రుడికో నూలుపోగు. అంతేగాని ఇందుకు భుజాలు తడుముకోవాలని ఉద్దేశించి వ్రాసింది కాదు. ఈ విషయం గుర్తించ మని మామనవి. — రచయిత.

కొందరికి షాపుల్లో అమ్మే చొక్కాలు సరిపోవు. అప్పుడు వాళ్లు తెలిసిన దర్జీ వాడి దగ్గరకెళ్లి కొలతలిచ్చి చొక్కాలు కుట్టించుకుంటారు. ఒకొక్క

'హెడ్‌క్వార్టర్సు నుంచి తాటిపర్రు కేంపు కెళ్ళినప్పుడోసారి ఆయన బట్టతో పాటు కాసాలు సర్దుకోడం మర్చిపోయాడు, పైగా వాన పట్టుకుంది. అప్పుడాయన చేసేందుకేమిలేక ఎవరూ గుర్తుపట్టకుండా తలపాగా చుట్టుకుని కల్లు పాకకేసి నడిచాడు. ఈ తలపాగా టెక్నిక్ ఆయన కాకినాడలో చదువుకునే రోజుల్లో నేర్చుకున్నాడు. అప్పుడాయన మొదటిసారిగా వెంకట్రమణకి అక్కైన పార్వతమ్మని చూసాడు. ఊళ్ళోవాళ్ళు అప్పటికే తప్పతాగి ఇంటికి పోయారు. పార్వతమ్మ దుకాణం కట్టేయబోతుంటే చౌదరి వెళ్ళాడు. వాట్ 69, జానీ వాకర్‌కి నిలబడ్డ పెద్దమనిషి దేశీకూనికి రెండు రౌండ్లలో బోర్లా పడ్డాడు. 'ఏంటి అలవాటు లేదా?' అని అడిగింది పార్వతమ్మ. లేదని తలూపాడు చౌదరి. 'బుజ్జినాయన' అంటూ అక్కున జేర్చుకుంది. వానరాత్రి ఆ వెచ్చదనానికి చౌదరి కరిగిపోయాడు. దాంతోపాటు గాంభీర్యం కరిగిపోయి తనెవరో పార్వతమ్మకి చెప్పాడు. పార్వతమ్మ వెలయాలు కాకపోయినా ఇలాంటి పరిస్థితులామెకి కొత్త కాదు. కాని ఆరోజు మరపురాని రోజు ఆమెకి. వచ్చినవాడు పెద్ద ఆఫీసరు. ఆ రాత్రి ఆయన తాటిపర్రులో ఉన్నన్ని రోజులూ వానపడుతూనే ఉంది.

ఇప్పుడు చౌదరి ముందు నిలబడ్డ ఆమె సాక్షాత్తూ పార్వతమ్మ. ఆ మనిషి ఆయన పరువు బజార్లో తలుచుకుంటే పెట్టగలదు. అందులోను, ఆయన నిప్పులాంటి మనిషి అని అందరూ నమ్మే బజార్లో. కాని ఆమెకా ఆలోచన రాలేదు. ఎందుకంటే ఆమె అంతవరకు పరువు కోసం పాకులాడే మనుషుల్ని చూడలేదు. ఆ పల్లెటూళ్ళో ఎవరేపనిచేసినా పబ్లిగ్గా చేస్తారు. కాని చౌదరి భయం చౌదరిది. ఆయన జీవితంలో ప్రమాదానికి ఆస్కారం ఇవ్వడు.

అఖరికి 'ఏం చదువుకున్నాడు?' అని ధైర్యం పుంజుకుని ప్రశ్నించారు.

'అయిదు గట్టెక్కి ఆరు నమువుతూ మానేసాడు. తాగిబళ్ళో నిద్రోతుంటే ఆళ్ళే రావద్దన్నారు' అని నిజం చెప్పింది.

'మరి మా డిపోలో ఉద్యోగానికి చదువు...' అంటూ మాట పూర్తి చేయబోతున్న చౌదరిని పూర్తిచేయనీయకుండా,

'చదువు లేకపోతే ఏంటండి? ఆడికి కార్లగురించి తెలిసిలేదు. ఆడికి రాత్రిళ్ళు ఇంటిపట్టునుండే అలవాటు లేదేమో కార్లగురించి బాగా తెల్సండి. ఆడు రోజూ కార్లడ్రైవర్ల గురించి కండక్టర్ల గురించి కథలు చెప్పి నవ్వుతుంటాడు.' అంది పార్వతమ్మ.

'ఈసారేదైనా ఖాళీవస్తే చూస్తాలే' అన్నాడు చౌదరి.

తన తమ్ముడిపేరు తాటికల్లెం కంట్రవణని చెప్పి సెలవు తీసుకుంది.

పార్వతమ్మ సెలవు తీసుకున్న కొద్ది రోజులకి తాటిపర్రు సెక్షన్లో బస్సులు చెకింగ్‌చేసే ఉద్యోగం కాళీగా ఉన్నట్టు చౌదరికి వాళ్ళ ఆఫీసువాళ్ళు తెలియబర్చారు. చౌదరికింద పనిచేసే శర్మ ఈ విషయాలు చూసుకుంటాడు. శర్మకి చౌదరికి ప్రాణస్నేహం లేదు కాని పాన స్నేహం ఉంది. శర్మ మరీ చిన్న ఆఫీసరు కాదు. చౌదరి తరువాతివాడు. అందుకని శర్మతో చౌదరి పానస్నేహం చేసాడు. అందుకని చౌదరి శర్మని చనువుగా పిల్చి తాటికల్లు వెంకట్రమణ అనే చిన్నవాడు తాటిపర్రు నివాసి అనీ అతగాడు తన అత్తవారింట్లో నమ్మకంగా పనిచేసే పాలేరు మేనల్లుడనీ అందుకని తను వెంకట్రమణ కుద్యోగం వేయిస్తే ఆ పాలేరు మరింత నమ్మకంగా పని చేస్తాడని, వేయించకపోతే పాలేరు పని చేయడనీ, అప్పుడు తన భార్యకి తనమీద కోపం వస్తుందనీ, అది తనకిష్టం లేదనీ, అందుకని ఆ ఉద్యోగం వెంకట్రమణ కొచ్చేలాగా చూడమని చెప్పాడు.

శర్మ ఈ కథంతా నమ్మినట్టు కనిపించాడు. చౌదరికి తాటిపర్రు కేంపులో దొరికే ఆనందం ఏదో శర్మ ఊహించకపోలేదు, కాని తెలివైనవాడు కనుక చౌదరి చెప్పింది అక్షరాల నమ్మినట్టు కన్పించాడు. చౌదరి ఆయేడు అతనిమీద వ్రాయబోయే కాన్ఫిడెన్షియల్ రిపోర్టు మీద శర్మ భవిష్యత్తు ఆధారపడి వుంది. అందుకని శర్మ చౌదరికోసం ఏమైనా చేస్తాడు; చౌదరి తాలూకు పిల్లల్ని ఆడించటంతో సహా. అందుచేత 'పిరంత చెప్పాలా! ఇది నా స్వంతపనిలా చేస్తాను' అంటూ ఊ ఇదైపోయాడు. ఈపని ఈయనికి నేను చేస్తే రేపు ఈయన నాకు సన్నిహితుడవుతాడు. అవకపోయినా ఆయన తలపాగా తన చేతిలో ఉంటుంది, అని ఆలోచించాడు శర్మ. నోటిమాటను బుజువు చేయడం కష్టమని ఏదన్నా బెడిసికొడితే నష్టపోయేవాడు శర్మ అని చౌదరి ఆలోచించాడు. ఆయనకి ఇతర్ల చేతుల్తో నిప్పుకోంచి జీడిపిక్క లేరించటం మహా ఇష్టం. శర్మ వెంకట్రమణ గురించి అన్ని వివరాలు సేక



నాకంటే ఏదో
అమరముందో
అనుకోవచ్చు —
నీకెందుకయ్యా
ఇంపాలా కారూ?
చిన్నకారు తయారో
కొంగానే మొట్టమొదటిది
నువ్వే తీసుకో.
నీ కడ్డేమిటి?

రించాడు!

ఓ శుభముహూర్తాన పెద్దగుమాస్తా రాజు ఎడ్వర్టయిజ్‌మెంటుకి డ్రాఫ్టు వ్రాయించి తీసుకొచ్చాడు దాన్ని చూస్తూనే శర్మ అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు. 'ఎవడయ్యా స్క్రిప్టురాసిన కవి! ఇరో

# వడ్డించే మనవాళ్ల కథలు

డ్లాగులా! నే చెప్తా రాసుకో' అంటూ కేకలేసే అగ్రశ్రేణి సినిమానటుడి లాగా 'ఏమయ్యా ఈ డ్రాఫ్టు రాసింది. అడ్డమైనవాళ్ళచేత రాయించొద్దని నీకెన్ని సార్లు చెప్పాను. నీకు బుద్ధుండద్దూ' అని శర్మ కేకలు వేశాడు. రాజు 'ఆయ్' అన్నాడు. శర్మకి రాజులో నచ్చే విషయాల్లో ఇదొకటి. ఎదురించడు. డ్రాఫ్టులో తప్పులేం లేవు. ఆ విషయం శర్మకీ తెలుసు రాజుకీ తెలుసు మామూలుగా అయితే ప్రకటన అల్లాగే ఉంటుంది. అల్లా వుండకపోతే శర్మ కేకలేస్తాడు. అయితే రాజు తెలివైనవాడు. తనకీ, ప్రమోషన్‌కి మధ్య పొరపాటికి చోటీయడు. శర్మకి రాజులో నచ్చే మరో విషయం ఇది.

'నే చెప్తా రాసుకో' అంటూ శర్మ మొదలు పెట్టాడు. 'తాటిపర్రు సెక్షనులో చెకింగ్ చేయుటకు ఇంతవరకు మా శాఖలో పనిచేయని బాధ్యత తెల్సిన మనిషి కావలెను ...'ఇంతవరకు మా శాఖలో పనిచేయని అని ఎందుకన్నానో తెలుసా?' శర్మ రాజు నడిగాడు. 'తెలియదండి' అన్నాడు రాజు శర్మకి రాజులో నచ్చేవిషయం ఇదొకటి. శర్మ చెప్పదల్చుకున్న ఏ విషయాన్ని నాకు ముందరే తెల్సంటూ రాజు కత్తిరించడు.

'మన శాఖలో పనిచేసే వాళ్ళయితే వాళ్ళకి కండక్టర్లు డ్రైవర్లు ఫ్రెండ్సయ్యుంటారు. అల్లాంటివాళ్ళేం చెకింగ్ చేస్తారు? దొంగలు దొంగలు చేరి ఊళ్ళు పంచుకోడం తప్పించి' నిజమేనన్నట్టు రాజు తలూపాడు. 'రాసుకో! ఆ వ్యక్తి తాటిపర్రు నివాసి అయ్యుండవలెను ... ఎందుకో తెల్సా ఆ ఊరివాడే అయితే తను సరిగ్గా డ్యూటీ చెయ్యకపోతే బాధపడేది తన వూరివాళ్ళే కనుక, వాళ్ళు బాధపడితే ఇతన్ని జాడించిగాని వదిలిపెట్టరు. కనుక డ్యూటి సరిగ్గా చేస్తాడు.' 'మరేనండోయ్' అన్న ముద్ర వహించాడు రాజు.

'వయస్సు ఇరవైకి తక్కువ ఇరవైఒకటికి ఎక్కువా కారాదు... ఎక్కువైతే గవర్నమెంటుద్యోగాలకి తీసుకోడానికి వీల్లేదు కదా! తక్కువైతే మెట్యూరిటీ ఉండదు—రాసుకో! మనిషి చూచుటకు గంభీరంగా నుండవలెను...అంటే అతను చూడ్డానికి తాగుబోతుకళ్ళలా ఎర్రటి నిప్పులాంటి కళ్ళతో భయంకరంగా ఉండాలన్నమాట అతన్ని చూస్తూనే కండక్టర్లు జారుకోవాలి.'

రంగులరాట్నం




గ్రీకు పురాణాల్లో హైడ్రా అనే రాక్షస జీవి ఉండేది. దానికి తొమ్మిది తలలు. రావణాసురుడుకన్నా ఒకటి తక్కువ. ఈ రాక్షసిని హెర్క్యులస్ చంపుతాడు. అలాటి రాక్షసి పేరుని ఒక జీవికి అన్యాయంగా పెట్టారు. హైడ్రా అని పిలిచే ఈ జీవి చిన్నదయినా కంటికి కనబడుతుంది. అంగుళంలో ఏదో వంతు ఉంటుంది. స్థంభాకారంగా ఉంటుంది. ఒక చివర గడ్డి పరకొక్కో, చెట్టు కాడకో అతికి ఉంటుంది— తాత్కాలికంగా. రెండోచివర దాని నోరు ఉంటుంది. దాని నోటి చుట్టూ 5—6 టెంటికిళ్లు ఉంటాయి.

హైడ్రాకి సాగేగుణం ఎక్కువ, బాగా సాగితే అర అంగుళం వరకూ వుంటుంది. శరీరంమీద— టెంటికిళ్లమీద ఎక్కువగా— కొన్ని విషావయవాలు ఉంటాయి. [illegible]లు మాదిరిగా విషంతో నిండిఉంటాయి. [illegible]టికి మీట [Trigger] మాదిరిగా ఒక [illegible] ఉంటుంది. ఏ జీవి అయినా దానికి తాకితే [illegible] కాప్సూలు పగిలి ఒకకంచీ బయటకు వచ్చి ఆ జీవి శరీరంలోకి విషాన్ని ప్రవేశపెడుతుంది టెంటికిళ్లు ఈ దురదృష్ట జీవిని పట్టి నోటిలోకి తోసి వేస్తాయి. జీర్ణమవగా మిగతా పదార్థాన్ని నోటిద్వారానే బయటకు పంపి [illegible]ంది. ఆకలి ఉంటే గాని హైడ్రా తినదట.

హైడ్రా స్థాన చలనం చిత్రంగా, రకరకాలుగా జరుగుతుంది. ముఖ్యంగా గొంగళిలాగా లూపులు వేసుకుంటూ గాని లేదా సర్కసులో మాదిరిగా పల్టీలు కొట్టుకుంటూ గాని పోతుంది.

హైడ్రాలాటివాటిని పూర్వ కాలములో వృక్ష జంతువులు అనే వారు. చెట్లలాగే ఉండడమే దీనికి కారణం. కాని ఇవి పూర్తిగా జంతువులే. సంతానోత్పత్తి లైంగికపద్ధతిలోను, అలైంగిక పద్ధతిలోనూ, జరుగుతుంది. మగ ఆడ విబేదమే లేకుండా రెండు రకాల లింగ కణాలు ఉత్పత్తి చెయ్యగల్గేవి, కూడా హైడ్రాలున్నాయి. హైడ్రా శరీరం నుంచి, మొక్కలకు వచ్చినట్లుగా శాఖలు ఉత్పత్తి అవుతాయి. ఇవి ఎదిగి అన్ని లక్షణాలు ఏర్పరుచుకుని విడిపోయి స్వతంత్రంగా జీవిస్తాయి. ఒకొక్కసారి రెండు మూడు పిల్లలు—మొగ్గలు— కూడా యిలా ఏర్పడతాయి. ఇంకా కొన్ని సందర్భాలలో మొగ్గలు ఎదిగి విడిపోక ముందే దానికి పిల్ల మొగ్గ ఏర్పడుతుంది. ఇలా మనమలు, ముని మనములు కూడా ఏర్పడి అతికి ఉంటాయి చెట్టులాగే ఉంటుంది. కొంతకాలానికి విడి పోతాయి. హైడ్రాకు పునర్నిర్మాణ శక్తి కూడా అధికం. కొన్ని ఖండాలుగా చేసి వదిలేస్తే పేటికని ఎదుగుతాయి.

—జమ్మి కోనేటిరావు

రాజు చిన్న చిరునవ్వు అభినయం పట్టాడు అది శర్మ చేసిన జోక్ కిలాగా శర్మకి కనిపించింది. కాని అసలు రాజు తాగుబోతసలు కళ్ళు తెరుస్తేగా అవి విప్పాల్లా ఎర్రగా ఉండటానికి, అని మనసులో అనుకున్నాడు. కాని తెలివైన రాజు ఇల్లాంటి విషయాలు బయటకనడు

'చెప్తా రాసుకో! బస్సు ప్రయాణాల్లో విపరీతమైన అనుభవం కలిగియుండవలెను...అంటే బస్సులో జరిగే అన్ని ట్రిక్కులు తెలిసినవాడై ఉండా లన్నమాట...పొడుగు నూట అరవై అయిదు సెంటీమీటర్లకి తక్కువ, నూట తొంభై సెంటీమీటర్ల కెక్కువ కారాదు.... మనిషి గంభీరంగా ఉండాలన్నారా అందుకని పొడుగు కనీసం నూటఅరవై అయిదు సెంటీమీటర్ లైనా ఉండాలి, మరీ పొడుగైతే అతను చెకింగ్ చేస్తున్నప్పుడు తలటాప్ కి తగుల్తూ ఇబ్బందిగా ఉంటుంది. అప్పుడు మనస్సు పెట్టి పనిచేయలేడు...కనీసం అయిదోతరగతి చదివియుండవలెను...ఆమాత్రం చదువు లేకపోతే ఎల్లా!...పెద్ద చదువు అదనపు అర్హతగా పరిగణింపబడదు ... ముఖ్యమైనది అయిదు. అందుకని ఇంటర్వ్యూకి వచ్చేవాళ్ళు అయిదోక్లాసు పాస్ అయ్యారా లేదా అనే మనం చూడాలి' అని శర్మ జోక్ వేశాడు. రాజు నిర్మోహమాటంగా నవ్వాడు.

ఆపైన తాటికల్లు వెంకట్రమణ, ఇంటర్వ్యూలో అడగబడిన ప్రశ్నలన్ని అంటే తాటిచెట్టు రూట్లో ఏబస్సెక్కడ ఎంతసేపు ఆగుతుంది, కండక్టర్లు డబ్బు చేసుకునే అయిదు విధాలు మొదలుగాగల ప్రశ్నలకి మిగిలిన వాళ్ళందరికంటే బాగా జవాబు చెప్పాడు. అతడి పొడుగు నూట అరవై ఎనిమిది సెంటీమీటర్లు. అతడి కళ్ళు భయంకరంగా ఎర్రగా తాగుబోతు కళ్ళలా ఉన్నాయి. ఉద్యోగం ఇచ్చారు ఇచ్చినవాళ్ళలో చౌదరి లేడు. ఆయన సెలవు పెట్టాడు. ...అయితే పై అధికార్లకి శర్మగురించి, రాజు గురించి మంచి రిపోర్టులు వెళ్ళాయి.

(పైవారం: కడివెడు ఖరము పాలు మేలు కధ)

**బి. ఎస్. తణుకు.**

సరస్వతీదేవి గొప్పదా? లక్ష్మీదేవి గొప్పదా?

ఎవరికి వారు గొప్పేగాని లక్ష్మి కటాక్షంలేని సరస్వతి రాణించలేదు. సరస్వతి కటాక్షం లేకపోయినా లక్ష్మి కటాక్షం ఉంటే యీలోకంలో రాణించడం కష్టం కాదు.

**వి. వి. ఎస్. గుంటూరు**

నా మనసులో ఏదో బాధ, ఆవేదన, ఆరాటం. అందరూ నా సహాయం కోసం అర్రులు చాచేవారే. వాళ్లపని కాగానే మోసం చేసి ఊబిలోకి నెట్టేవారే. ఈ రోజు నావైపు చిరునవ్వులతో చూసి, మరుసటిరోజు యీర్ష్యతో ద్వేషంతో గుండె కలుక్కుమనేలా చూస్తారు. నాకు పద్దెనిమి ఏళ్లే. అయినా నూట ఎనభయిఏళ్ల అనుభవం గడించాను. నేను ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సును సహించలేను. కాని దానికి నేను గురి కావలసి వస్తున్నది...

మీ సుపీరియారిటీ కాంప్లెక్సు తగ్గించుకోండి ముందు. అంతా సవ్యంగా కనబడతారు!

**ఎం. వి. ఆర్. హౌరా**

దేవుని దర్శనానికి మనవారు కాశీయేనా సింహాచలమేనా పోతూ ఉంటారు. మేము అలా వెళ్లం. నిర్మలమైన మనసుతో యింట్లోనే పూజ చేసుకుంటాం.

మంచిది. డబ్బు కర్చు తక్కువ. కొందరికి యాత్రలు చేసి పుణ్యక్షేత్రాలు కూడా దర్శించాలన్న కుతూహలం వుంటుంది. దాల్లో తప్పేం లేదు. మనం వాళ్లని ఎగతాళి చెయ్యక్కరలేదు..

**ఎస్. ఎల్. కె ఎమ్. డొప్పలపూడి**

సూర్యకాంతంలాంటి తల్లి, నాగబూషణంలాంటి తండ్రి, నాగేశ్వర్రావు లాంటి అన్నయ్య, జ్యోతిలక్ష్మిలాంటి అక్కయ్య







ఉంటే ఆ కాపురం ఎలా ఉంటుందండీ.

నేటి సరికొత్త తెలుగు సినిమాలా ఉంటుంది. మనలోమాట, అలాంటి సందర్భం ఏర్పడితే తవ్వరీపాటికి పిక్చర్ ప్రారంభించకుండా ఉండేవారా!

**డి. జె. సి హెచ్. నందిగామ**

నా మనస్సు పరిపరి విధముల పరితపించుచున్నది. నా మనస్సు మారడానికి ఏదైనా సలహా చెప్పండి.

స్థిరత్వం లేని మనస్సు మానసికాందోళనకి నాంది. ముందు చేసే పనిమీదా వ్యక్తిగత విషయాలమీదా దృష్టి నిలుపు సోదరా. అది రాజబాటకి ప్రారంభం అవుతుంది.

భార్య గయ్యాళి దయినచో భర్త గతి ఏమిటి?

గయ్యాళి కావలయును.

**పి. కె ఆర్. కావలి**

మిమ్మల్ని ఎవరేనా వెక్కిరిస్తే?

వెక్కిరించినవారు నాకు నచ్చితే తిరిగి వెక్కిరిస్తాను. లేకుంటే పట్టించుకోను.

**వి. ఎల్. శ్రీకాకుళం**

...అప్పుడే మిమ్మల్ని పలకరించాను. మీరు నన్ను గుర్తుపట్టారు...మీ జ్ఞాపకానికి అచ్చెరువందాను...

నీ సుదీర్ఘమైన లేఖ అందింది సోదరీ. ఒకసారి, పరిచయం అయిన వారిని సాధారణంగా నేను మరిచిపోను. దాల్లో ఆశ్చర్యపడవలసినదేం లేదు. నాకు తెలిసినవాళ్లన్నా స్నేహితులన్నా సరదా. చెల్లెలిపేరుతో కాదు. స్వంత పేరుతో రాయడం అలవాటుచేసుకో— లేకుంటే ఈనాటి కొంతమంది మగ రచయితల్లాగా పేరొచ్చేదాకా చెల్లెలిపేరో భార్యపేరో, తరవాత స్వంతపేరు కోసం పాకులాడాలి!

**రంగనాథం, డుంగ్రీ**

మీ ప్రశ్నావళిలో మీ జవాబులూ, ప్రచురించే ప్రశ్నలూ చాలామటుకు శ్రీశ్రీ మీయమ్మై ఉంటున్నాయి. ఇటువంటి వాటిని ఎవాయిడ్ చేయలేరా?

అక్కడికి 101: ఇస్తున్నాను బాబూ. పూర్తిగా వదిలేస్తే అదోతంటా! కత్తిమీది సాములాగా ఉంది నా పని!

**జి. వి. జె. ఆర్. తిరుచినాపల్లి**

సృష్టిలో అందమైనది అతి విచిత్రమైనది అర్థం కానిది స్త్రీ అన్నాడొక రష్యన్‌కవి. పరిపూర్ణ భారత స్త్రీగా మీ అభిప్రాయం ఏమిటి?

ఒకరష్యన్‌కవి ఏంకర్మ? ప్రతిమగవాడూ అనేదే ఆమాట. ఇక పరిపూర్ణ భారత స్త్రీ ఏమిటి? అదొక తిట్టులా వుంది! చన్నుగా మాట్లాడితే, భారతస్త్రీ కబుర్లు చెప్పకు, అని కసురుతుంది, రంగనాయకమ్మ! అవునా రంగా?

**డి. వి. ఎస్. పి. బరంపురం**

ఆరుద్రగారి కలం నుంచి ఈ మధ్య శృంగార సాహిత్యం జోరు ఎక్కువైనట్టుంది. ఏమిటి కథ?

నలభయ్యోపడి దాటింది కదా!

మీ జవాబులు చదువుతుంటే మిమ్మల్ని ఒకసారి చూడాలనిపిస్తూంది. వీలవుతుందా?

మహారాజులాగ. మా ఇంటిస్తంభపు కొంపకి ఒకటే సింహద్వారం తప్పించుకు పోడానికి పెరటి దారి కూడ లేదు.

**డి. వి. జె, సామర్లకోట**

అంతఃకరణ శుద్ధికి, కోవెలకు వెళ్లడం అభిషేకాలూ అర్చనలూ చేయడం వంటి బాహ్యాడంబరాలు అవసరం అంటారా?

కొందరు అర్చకులకి అవసరం అవి. అవి బాహ్యాడంబరాలని వారనుకోరు వారి కవి మానసికమైన, సంతృప్తిని కల్గిస్తాయి. నిశ్చలమైన మనస్సుతో ధ్యానించ కల వారికి అనవసరంగా తోస్తాయి.

**సుధాకర్. కడప**

రచయిత్రి కామేశ్వరిగారు 'కొత్త నీరు' నవలను మీకు అంకితం యిచ్చిందని విన్నాను.

వినడమే గాని పుస్తకాలు చదివే అలవాటు లేదా ఏం?

మీ మధ్య స్నేహానుబంధం కూడా ఉందని విన్నాను నిజమేనా?

అదీనిజమే. కామేశ్వరి సలాకీగా ఉంటుంది. సూగడు. సరికదా—కబుర్లు చెప్తుంటే హాయిగా ఉంటుంది— చూడ్డానికి వినడానికీ కూడా! ●

# శ్రీ పద్మాలయ్ సాహిత్య పదావళి (రిజిష్టర్డు 54/70)

## సాతులూరు (P.O) గుంటూరు (జిల్లా) ఆంధ్రప్రదేశ్

## సాహిత్య పోటీ నెం. 3లో పాల్గొని రు. **14,200** గెలుపొందండి

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి రు. 7,500 | లఘు పదావళికి స్వీకరించే ఎంట్రీలకు | బహుమతి యివ్వబడును. |
| 1, 2, తప్పులకు, రు. 4,000 | ముగింపు తేదీ 1—3—71 | ముగింపు తేదీ 10—3—71 |
| లఘు పదావళికి రు. 2,000. | ఎక్కువ ఎంట్రీలు పంపినవారికి రు. 250 | కీ సొల్యూషన్ 14—3—71 న |
| 1, 2, 3, 4 ప్రశ్నలకు మాత్రమే లఘుసదావళి. | 200, 150, 100 లు వరుసగా | ఆంధ్రపత్రిక, ఆంధ్రభూమి డైలీలలో |

ప్రవేశ రుసుము ఒక కూపను ఒక రూపాయి. ప్రతి 5 ఎంట్రీలకు 5 రూపాయలు. ప్రవేశరుసుము చెల్లించిన ప్రతివారు, రెండు లఘు పదావళులు ఉచితంగా పంపుకోవచ్చును. (లఘు పదావళి రు. 2000 ఆల్ కరెక్టుకు మాత్రమే.) 2 కూపనులకు రెండు రూపాయలు ప్రవేశరుసుము చెల్లించిన వారికి ఒక కూపను ఉచితము. (లఘు పదావళికాదు. 9 క్లూలు ఉన్న కూపను, ఉచితము) రు. 10 లు ప్రవేశరుసుము చెల్లించిన ప్రతివారు 2 కూపనులు ఉచితంగా పంపుకోవచ్చును. 100 ఎంట్రీలకు రు. 60 మాత్రమే.

(నీతి, నిజాయితీలే ధ్యేయంగా నడుపబడుచున్న సాహిత్య పోటీ. మా సంస్థని గురించి యిప్పటికేఎందరో తమ సంతృప్తినీ, సంతోషాన్నీ వ్యక్తం చేసియున్నారు. మంచి, మంచి సందేశాత్మకమైన ప్రబోధాత్మకమైన క్లూలు యిచ్చి పోటీ దారులలోసాహిత్యాభిలాష పెండు కావాలనే ధ్యేయంతో ఒక్క ఆంధ్ర ప్రాంతానికే పరిమితం కాకుండా భారతావనిఅంతటా మా సంస్థ కీర్తి ప్రతిష్ఠ లార్జించాలనే సదాశయంలో కృషి చేస్తున్న మాకు భారతావని నలుతావులో నివశిస్తున్న తెలుగు సాహిత్యాభిమానులచేయూత, సహకారాన్నర్థిస్తూ యున్నాము.

**ఆధారములు:** 1. పవిత్రమైన జీవితం / హృదయం, ఒక వెలుగుతున్న దివిటీ లాంటిది. 2. మహాకవులయొక్క కవితా / భావనా, కొంత తాత్విక అంతర్దృష్టిని ప్రతిబింబిస్తుంది. 3. కొందరు కళాకారుల జీవితాలు వారి కృతులకంటే మనోహరం / మహోన్నతంగా ఉంటవి. 4. ప్రకృతిని పూర్తిగా అనుకరించటం ఉత్తమ శిల్ప / కళాదృష్టి కాదనేది సత్యమే. 5. అసలు మానవ జీవితం / హృదయం, సముద్రంలాంటిది. 6. అన్నిటి / అందరికన్నా పౌరుషంగా బ్రతకాలన్నవాడు మాటపడలేడు. 7. తాను చనిపోతానని ప్రతి మనిషికీ తెలుసు / తెలీదు 8 సాధారణంగా స్త్రీలకు బట్టల / నగల మీద అమితమైన అపేక్ష ఉంటుంది. 9. ఆడపిల్లలకి బొట్టిగా; జ్ఞాపకశక్తి తక్కువ / ఎక్కువ

**నిబంధనలు:** 1. రచయిత(త్రి) వాడిన పదమే సరియైనది. 2. వాక్యము మొత్తము వ్రాయనక్కరలేదు. మీరు కోరుకునే పదములు తెల్ల కాగితముపై వ్రాసి పంపవచ్చును. లేదా మాకు వ్రాసి ఎంట్రీ ఫారములు పొందవచ్చును. 3. ప్రవేశ రుసుము ఒక కూపను ఒక రూపాయి. రెండు కూపనులకు తక్కువ గాకుండా పంపువారు ఒక కూపను ఉచితంగా పంపుకోవచ్చును. 5 ఎంట్రీలు పంపు ప్రతివారు రెండు లఘుపదములు ఉచితంగా పంపుకోవచ్చును. 4. ప్రవేశ రుసుము మొత్తము మనియార్డరు ద్వారాగాని, లేక ఎక్కువ ఎంట్రీలు పంపువారు బ్యాంకు డ్రాఫ్టులుగాని పంపవచ్చును. పి. ఓ. లు అంగీకరింపబడవు. 5. ఏజంట్ల దగ్గర కొన్న ఎంట్రీలకు క్యాష్ రసీదులు జతపరచిన చాలును. 6 కూపనులకు మనియార్డరు, రసీదు జత చేయవలెను. 7. ఫలితములు ప్రకటన రోజున రచయిత, రచన, పేజీ వివరములతో ప్రకటింపబడును. 8. ఎన్ని ఎంట్రీలు పంపినను రైటయిన ప్రతి ఎంట్రీ బహుమతి కరమైనదిగా నిర్ణయింపబడును. 9. ముగింపు తేదీ తర్వాత మాకు అందే ఎంట్రీలు పరిశీలింపబడవు. 10. పోస్టులో పోయినట్టి, మాకు అందనట్టి ఎంట్రీలకు మేము ఎంతమాత్రము బాధ్యులము కాము. 11. ఎట్టి పరిస్థితిలోను ఎంట్రీ రుసుము తిరిగి యివ్వబడదు. 12. లఘు పదావళి పరిశీలించే ఎంట్రీలకు 1—3—71 ఆఖరు తేదీ. 1—3—71 లోపు వచ్చు ఎంట్రీలలోని లఘు పదములు మాత్రమే పరిగణనలోకి తీసుకోబడును. 1—3—71 తర్వాత వచ్చు ఎంట్రీలలోని లఘు పదావళి గాక మిగిలినవి మాత్రమే లెక్కలోకి తీసుకోబడును. 13. ప్రతి పదావళికి సంబంధించిన అన్ని కాగితములు విజేతల పట్టిక ప్రకటింపబడిన నెల తర్వాత కాల్చివేయబడును 14. విజేతల లిస్టు, తర్వాత పదావళి, ఎంట్రీల కొరకు **Self Addressed Stamped Cover** జత చేయవలెను. 15. ఒకటికంటే ఎక్కువమంది విజేతలున్న ఎడల బహుమతి సొమ్ము సమముగా పంచబడును. 16. ఆల్ కరెక్టు ఎవరు లేని ఎడల 1 తప్పుతో పంపినవారికి ఆ బహుమతి, ఆ వరుసలో మిగతా బహుమతులు పంచబడును. 17. ఏమైనా, ఆక్షేపణలున్నచో ఫలితములు ప్రకటించిన 15 రోజులలోగా 5 రూ.లు పంపుతూ ఆక్షేపణ తెలుపవలయును. ఆక్షేపణ బుజువు కానిచో 5 రూ లు కోల్పోవుదురు. 18. ఫలితములు ప్రకటించిన 15 రోజుల తర్వాత ప్రాక్టీసీ టైం దాటిన తర్వాత ప్రైజు డబ్బు పంపబడును. 19. వెయ్యి రూపాయలు దాటిన బహుమతులు బ్యాంకు డ్రాఫ్టులుగాను, వెయ్యి రూపాయలలోపు బహుమతులు మనియార్డరు ద్వారాను పంపబడును. 20. అన్ని విషయములలోను మానేజిమెంటువారిదే తుది నిర్ణయము. 21. ఏమైనా ఆక్షేపణ లున్నచో నరసరావుపేట కోర్టునందు మాత్రమే దాఖలు చేయవలెను. 22. ఏజంట్లకు 15% నుండి 20% వరకు కమీషన్ యివ్వబడును. 23. ని ఎంట్రీలు, మనియార్డరులు శ్రీ పద్మాలయ్ సాహిత్య పదావళి నెం. 3, సాతులూరు [P. O.] గుంటూరు [జిల్లా] కు పంపవలయును.

గైడ్ వివరణ:— గైడ్ ఉంటే కష్టమైన క్లూ తేలికగా సాల్వ్ చేయవచ్చును. (**It is so easy to solve a clue thro' a guide**) మా పోటీ నెం. 3 కి గైడ్ యన్. ఆర్. లక్ష్మీ నరసయ్యగారు వ్రాసినారు. వలయువారు యీ క్రిందిచిరునామాకు వ్రాసి తెప్పించుకోవచ్చును.
(వెల : 0—85 పైసలు మాత్రమే)  అడ్రస్ :— యన్. ఆర్. లక్ష్మీనరసయ్యగారు,
టీచర్, ఇం. నెం. 7—115, (పి.ఒ) నార్సింగి, (తాలూకా) మెదక్.




# కొండమీది కోనేరు

కంచనపల్లి వెంకట కిషన్‌రావు



అనగా వో కొండ... ఆ కొండమీద వో కోనేరు...కోనేరు ప్రక్కనే వో శివాలయం వెలిసింది, అంతకుముందు ఎండుముఖంతో వెలవెల పోయే కోనేరు—శివాలయం వెలయడం, కోనేటికి నీటివాలు వేపుగా వో అడ్డకట్ట కట్టడంతో—యిప్పుడు సంవత్సరమంతా కళకళలాడు తున్నది.

* * * *

పరాంకుశం తనగదిలో పచార్లు చేస్తున్నాడు—కుడిచేతి పిడికిలి బిగించి—ఎడమచేతి, అరచేతికి గట్టిగా కొడుతూ.

భ్రుకుటి బ్రాకెట్లా తయారయింది, నొసలు ముడవడంతో వొళ్ళంతా సూదులతో గుచ్చినట్టుగా బాధ...మనసంతా సాలెగూటిలో చిక్కుకున్న పురుగులా ఒకటే రొద...

ఏనుగును అంకుశంతో పొడిస్తే కలిగే బాధ... అకస్మాత్తుగా పచారు ఆపాడు...వో నిముషం తరువాత మళ్లీ నడిచాడు...

గది బయటవున్న జవాను కాస్తా మాడుతున్న మూకుట్లో పడ బోయే జొన్న గింజలా భయపడుతున్నాడు— పరాంకుశంగారి కోపానికి పేలి—పేలపు గింజయ్యే ప్రమాదముందని.

ఆలోచనలు వేసవి యెండల్లా మాడుస్తున్నాయి, పరాంకుశాన్ని ...వెధవ—వో వంద రూపాయిల జీతగాడు తనను నలుగుర్లో యింత మాటంటాడా ... వెంకన్నెంత...వెంకన్న తాహతెంత ... వాడి తాత తాహతెంత...పోనీ తనుకోపంలో ఏదో వో చిన్న మాటన్నాడే అనుకో ...'కుక్కలతో పని చేయించు కొనేవాళ్ళు పెద్ద కుక్క లవుతారని తెలుసుకోండి—'అంటాడా ...

వంద లౌడ్‌స్పీకర్లు ఫుల్‌వాల్యూమ్‌లో రెండు చెవుల దగ్గర పెట్టి అవే మాటల్ని వినిపిస్తున్నట్టుగా...ఫ్యాక్టరీ అంతా అవే మాటలు విన్నాదాల్లా భావించి తన ముఖాన్నే అంటున్నట్టుగా అనిపించింది...

తను వయసులో అంత ముదరక పోయినప్పటికీ ఫ్యాక్టరీకి తండ్రిలాంటి వాడు...తండ్రి వోమాటంటే పడకుండా తండ్రినే ఎదిరించి ఎంత మాటంటే అంతమాట అనేస్తే ...... అందుకే దేశం

యిలా తగలడింది ... శిక్షణ లోపించి యజమానుల మాటలు వినని పనివాళ్ళున్నంత కాలం దేశం బాగుపడదు — ఎన్ని ప్రణాళికలు వేస్తేనేం కనుక...

ఇంతకి వాణ్ణేం చేయాలి...తగినశిక్ష... వెంటనే తను వెంకన్నకు వుద్యోగం యిచ్చే నాటి దృశ్యం గుర్తుకొచ్చింది. ఎంత దీనంగా ప్రార్థించాడు తనని...ఎంతగా విలపించాడు... కొంచెం బింకంగా వుంటే కాళ్లట్టుకోమన్నా అట్టుకొనే వాడు... అందితేకాళ్ళు అందకపోతే జుట్టు ఈథర్డ్ క్లాస్ తత్వమే అంత...అందుకే బ్రిటిష్ వాళ్ళు వీపులు బద్దలుకొట్టి పనులు చేయించుకొనేవాళ్ళు—వున్న వుద్యోగంనుంచి వూడబీకేస్తే వూపిరాడకుండా చస్తాడు వెధవ...ఎన్ని నక్కవినయాలు చూపాడా రోజు...తప్పకుండా ఆ పనే చేయాలి...

స్టెనోనుపిలిచి ఆర్డర్ డ్రాఫ్టిద్దామనుకున్నాడు. ఇంతలో బయటిజవాను సీమ కుక్కనిచూసి భయపడుతున్న పిల్లిలాగా మెల్లిగా అడుగులు వేసుకుంటూ వో ఉత్తరాన్ని పరాంకుశం టేబుల్‌మీద పెట్టాడు. ఉత్తరం కాస్తా ఫ్యానుగాలికి ఎగిరిపోయింది.

'ఫూల్...ఈ ఫ్యానిలా తిరుగుతుంటే దీనిమీద పేపర్‌వెయిట్ పెట్టక్కర్లా... మళ్ళీ ఏఁవన్నా అని జీతం కోస్తానంటే 'పిల్లాజెల్లాగలవాణ్ణి' అంటూ పిల్లికూతలు కూస్తావ్' అన్నాడు పరాంకుశం.

వాక్యం మొదలుపెట్టగానే లోపలికి పరిగెత్తుకువచ్చి క్రిందపడ్డ వుత్తరం యిచ్చిన జవాను వణకడం అతని తలపాగాచూస్తేనే తెలిసింది.

'గెటౌట్...టక్కులుచూపించే వక్కవినయాలుమటుకు వుగ్గుపాలతో నేర్చుకుంటారు...'

జవాను సలాంకొట్టి బయటపడ్డాడు. చల్లబడడానికి ఫ్రిజిడేర్ లోంచి వో కూల్‌డ్రింక్ తీసుకుని తాగేసి ఖాళీ సీసాను చప్పుడయ్యేట్టు టేబుల్ మీద పెట్టి వచ్చిన కవరును ఎడంచేత్తో అందుకుని కుడిచేత్తో చించాడు.

ఖాళీసీసా చప్పుడువిన్న జవాను పరిగెత్తి వచ్చి కూల్‌డ్రింక్ సీసాను తీసుకెళ్లి వాష్ బేసిన్లో శుభ్రంచేసి ఫ్రిజిడేర్లో పెట్టి నిలుచున్నాడు.

'వెళ్ళు' అని ఒక్కసారి కసురుకోవడంతో జవాను బయటపడ్డాడు.

పరాంకుశం ఆ పొడుగాటి కవర్లోంచి వో పొడుగు వుత్తరంతీసి చదవసాగాడు.

'పరం...

చాలా రోజుల్నించి నీకు వుత్తరం రాద్దామనుకుంటున్నా యిన్నాళ్ళికి తీరిక దొరికింది. నా ఆణాకానీ వుద్యోగంతో ఏదో నేను క్షేమం.

నీ వుద్యోగం నీకు బాగా నచ్చినట్టూ, నిన్నుచూస్తే ఫ్యాక్టరీఅంతా గజగజ వణుకుతున్నట్టూ రాసావు. అది నీకు సంతోషమే అయినా నాకు చాలా విచారకరం...

ఎందుకంటావేమో ... ఈ ఉత్తరం నీకో ముఖ్యవిషయం రాయడానికే మొదలుపెట్టాను—నీగుణం నాకు తెలుసుకనుక...

మొదట్నుంచీ నువ్వు గారాబంగా పెరిగావు. తండ్రిలేని నిన్ను ప్రాణానికి ప్రాణంగా పెంచింది మేము. అల్లారు ముద్దుగా పెరిగి, పెద్దయి, చదువుకుంటున్న నీకు, ఖర్మవశాత్తూ వ్యాపారంలో వచ్చిన నష్టాన్ని తెలియపరచకుండా నీవడిగినంత డబ్బు పంపి నీ చదువెలాగో పూర్తయిందనిపించాం...నీవు వో కాగితం పట్టుకొని వచ్చేటప్పటికే యిల్లూ వాకిలీ మార్వాడీకి మదుపెళ్ళాయి. తెలిసిన సత్యాన్ని నీకు చెప్పలేకా, చెప్పి వొప్పించలేకా మీ అమ్మ కన్ను మూసింది. అప్పుడు నేను ఆదుకుని — నీకు వో యిల్లరికం కుదిర్చి—నీవు చేసే వుద్యోగం యిప్పించక పోతే యీనాడు నిరుద్యోగంతో సతమతమై సర్వకష్టాలూ అనుభవిస్తున్న వేలాది విద్యావంతుల్లో నువ్వు ఒకడివయి కుళాయినీళ్లతో కాలం వెళ్లబుచ్చే వాడివి, అంతేకాదూ!

కానీ పరం...అదృష్టం నిన్ను వరించింది. అందుకే యీనాడు నీకు కలిగిన అదృష్టాన్ని చూసుకొని గర్వపడుతున్నావు ... ఇదంతా ఎందుకంటావా — నా అన్నయ్య కొడుకువైనా, నా కొడుకువైనా నువ్వే అనుకుని ప్రేమించబట్టి యిదంతా వ్రాస్తున్నాను.

వో మాట విన్నా వరం...

...ఆరోజులు—నేనూ, అన్నయ్యా కష్టపడి వో కొండ్రభూమి సాగు చేస్తున్న రోజులు!— అప్పటి కరణం — కామయ్య పంతులు—మన వూరికి మకుటంలేని మహారాజుగారు...చేసిన సేద్యమంతా— పట్టాలు లేవన్నీ, ఆ పన్నని, యీ పన్నని శిరబదలతా మూటకట్టించుకొని వెళ్లేవాడు ... ఎదురు మాట్లాడితే 'వెధవ ముండాకొడకా'...అని బూతు పంచాంగం మొదలెట్టేవాడు ... హంటర్‌తో వీపుమీద హనుమంతుని బొమ్మలు గీసేవాడు...సేకుసిందీలతో వలు గుర్లో, నడివీధిలోకి గుంజించి నానా నగుబాట్లూ చేసేవాడు...ఆయన్నని మటుకు తప్పేముంది ... అధికారం అటువంటిది ... పైన అధికారులటువంటివారు...

...ఇదంతా అన్నయ్యకు నచ్చక పోయేది! నామట్టుకు నేను ఏ ఎండకా గొడుగు పట్టే వాణ్ణి గనక యిప్పటిదాకా బ్రతక కలిగాను. అన్నయ్య అడపాదడపా ఎదురు తిరిగి అన్యాయపు పనుల్ని— పన్నుల్ని— చెల్లనిచ్చేవాడు కాదు...ఇలా వుండగా వోసారి శిస్తు వసూళ్లప్పుడు కరణంగారు అన్నయ్యకు భయపడి —పై అధికారిని పిలిపించుకున్నాడు. అతనితోపాటూ జవానులూ సిద్ధం...అంతకు మునుపే సాంబ్రాణి పొగ వూదినందువల్ల— అన్నయ్య ఆవేశంలో అన్న పచ్చి నిజాలన్నీ —అధికారికి తల తిరుగుడు సమాధానాలుగా తోచాయి.'

ఆరోజుల్లో అధికారి కంటబడిన ఆడవాళ్లను ఊరికే వదిలేవాళ్లు కాదు—ఆవిడ ఎంత శీలవతైనాసరే, అధికారి దురాగతానికి బలికావలసిందే ... అసలే కోపంగా వున్న కరణం కామయ్యగారు అధికారిని—వో బిడ్డతల్లయిన—వదిన మీదికి ఉసిగొల్పాడు ... అంతే...

ఆ రాత్రికి వదిన్ని 'మకాం'లోకి పంపమని అధికారి ఆర్డర్ వేసాడు...అది రాజశాసనం...

వెనకటి కీచక వధ బాగా జ్ఞాపకం వున్న అన్నయ్య—ఎంత చెప్పినా వినలేదు, మరేదైనా వుపాయం చూడమన్నా తనమూర్ఖత్వం విడవలేదు. ఆ రోజు నిజంగానే భీముడై, కీచకుణ్ణి, చంపాడు. అన్నయ్య మటుకు ఆ జవాన్ల దురాగతానికీ, అధికారి అహంకారానికీ కామయ్య కుట్రకూ ఆహుతైపోయాడు. ఆ తరువాత పరిస్థితి గ్రహించి వదినా, నీవూ, నేనూ పొలిమేర దాటి వెళ్లాం. పొలిమేర దాటి వెళ్లడానికి కూడా యెన్ని వెండినాణ్ణేలు యివ్వవలసి వచ్చిందను కున్నావ్!

ఆ తరువాత రాజకీయాలు మారి, మా

ప్రాణం కాస్త కుదుటబడి తిరిగి మళ్ళీ ప్రాదే చేరుకుని చేయి తిప్పుకున్నాం. మళ్ళీ కొన్నాళ్ళ వెన్నెల కాసింది...తిరిగి కుంభ వృష్టి కురిసి వెలిసినట్టు వ్యాపారంలో దెబ్బ తిన్నాం.

# కొండ మీది కోనేరు

...అలాంటి రోజు లన్నింటినీ నీకు జ్ఞాపకం చేయడంలో నా వుద్దేశ్యం ఒకటే ...నీ గుణం మార్చాలని...

నీవు నీ అధికారంలో క్రిందివారిని గడ గడలాడించుకొని 'పిల్లికి చెలగాటం, ఎలుక్కి ప్రాణసంకట'పు పరిస్థితిని సృష్టిస్తే, ఆ నరరూప రాక్షసులక్కూ నీకూ— తేడా యేమిటి బాబూ.

అది నీ తప్పు కాదు—నీవు స్వచ్ఛంగా మంచివాడివే. నీ మీద కుబుసంలా పరచు కొన్న, పదవీ గర్వం నీ శరీరాన్ని పిటపిట లాడిస్తున్నది...పాము కుబుసం విడిచిందాకా వో చోట పడుకోలేదు బాబూ. దాని పడి అణగాలంటే కుబుసం విడాల్సిందే...నీ గర్వం నిన్ను అవమానిస్తుంది బాబూ. అదిమటుకు నిజం...నీ స్థితిగతులూ, సంఘంలో నీపేరు ప్రతిష్ఠలూ...నీ ధనమూ ఏవీ ఆ రోజు అడ్డు రావు బాబూ! ఒకవేళ వచ్చినా అరుణ కిరణాలు వెదజల్లే ఆ నిండు దినకరుని కాంతిముందు, ఆ ప్రచండభానుని ప్రతాప రేఖలముందు నీ వొక కాలిపోయిన కొవ్వొత్తిలా తల వొంచుకోవాలి బాబూ. ఇంత పరిస్థితి రాకుండా ముందే నీకు తెలియ చెబుతున్నాను. నీ వొక యుక్తవయస్కుడివీ తెలివికలవాడివీ అయ్యావు. నా మాటలను సరిగా అర్థం చేసుకుంటావు కదూ. అమ్మాయిని అడిగినట్టు చెప్పు...ఉంటాను.

నీ బాబాయి.'

ఉత్తరం చదివిన పరాంకుశం ముఖంలో ఏదో మార్పు గోచరించింది...స్టెనోనూ, వెంకన్ననూ పిలిపించాడు. వెంకన్నకు క్షమా పణ చెప్పుకొని, స్టెనోకు వో ఆర్డర్ డ్రాఫ్టి చ్చాడు. అది శిక్ష కాదు...పై మెట్టుక్కు వెంకన్నని ఎక్కించడం...

*  *  *

కొండమీది కోనేరు కళ కళలాడే నీటితో మురిసి, దూరంగా, నగరంలో ప్రవహిస్తున్న మురికి కాలువకేసి అసహ్యంగా చూసేది... ఉన్నట్టుండి వోసారి వురుములూ మెరుపు లతో కుంభవృష్టి కురిసింది...మెరిసింది... శివాలయం మీద పిడుగు పడి, గుడంతా కోనేట్లో కూలింది. నీరు ఉబికి అడ్డుకట్ట తెగింది. పోయిన నీళ్ళు పోగా — మూలన వున్న వో ముంతెడు నీళ్ళు చూసుకుని కోనేరు—'నా కివే చాలు' అనుకుంది...నగరం లోని కాలువల గురించి మరేనాడూ ఆలో చించలేదు ఆ కొండమీది కోనేరు.







# విమానోదంతం

మహేష్

'మన ప్రభుత్వం ఈ విషయంలో చాలా ధృఢమైన వైఖరిని అవలంబించింది. దీనికి మనం అంగీకరించక తప్పదు' అన్నాడు చంచల్రావు.

'ఏ విషయంలోను?' అని చిదంబరం ప్రశ్నించగా చంచల్రావు చెప్పడం ప్రారంభించాడు.

'1971 వ సంవత్సరం జనవరి 30 వ తేదిని మనదేశానికి చెందిన విమానాన్ని యిద్దరు వ్యక్తులు బలవంతంగా పాకిస్తాన్ లోని యిద్దరు వ్యక్తులు బలవంతంగా పాకిస్తానులోని లాహోరుకు తీసికొని వెళ్లిపోయారు. అందులోని ప్రయాణికులను వదలివేసిన తరువాత విమానాన్ని పేల్చివేశారు ఆ వ్యక్తులు. వారిపేర్లు మహమ్మదు కురేషి, మహమ్మద్ అష్రఫ్.

విమానాన్ని కాపాడడానికి పాకిస్తాను ప్రభుత్వం యేమీ ప్రయత్నించ లేదు. అంతేకాకుండా, విమానాన్ని పేల్చివేసిన వ్యక్తులను కాశ్మీరు స్వాతంత్ర్య యోధులుగా పరిగణిస్తున్నది.

అందుకు మనప్రభుత్వం పాకిస్తాను ప్రభుత్వానికి అసమ్మతిని తెలియజేసింది. విమాన విధ్వంసకులను యిద్దరనూ, మన దేశానికి అప్పగించాలి అని మన ప్రభుత్వం కోరింది. అంతేకాకుండా పాకిస్తాను భూభాగంలో పేల్చివేసిన మన విమానానికి నష్ట పరిహారం కూడా పాకిస్తాను చెల్లించాలి' అని మన ప్రభుత్వం పాకిస్తాను ప్రభుత్వానికి తెలియజేసింది. పాకిస్థాను ప్రభుత్వం ఈ రెండు షరతులకు అంగీకరించే వరకు మన దేశంమీదుగా పాకిస్థాను విమానాలు యెగరకూడదని మన ప్రభుత్వం నిషేధాన్ని విధించింది.

పాకిస్తాను యెడల మన ప్రభుత్వం యిటువంటి దృఢమైన వైఖరిని అవలంబించడాన్ని నాయకులు బలపరుస్తున్నారు. ఇది మన ప్రభుత్వం గర్వించతగ్గ విషయం. మనం ఈ విషయాన్ని అంగీకరించవలసి ఉంది.'

'పాకిస్థాను యెడల తాను అవలంబించిన వైఖరికి మన ప్రభుత్వం గర్వించవచ్చును' అని నువ్వు అనగానే నాకు ఒక పత్రిక విషయం జ్ఞాపకానికి వచ్చింది' అన్నాడు చూడామణి.

'ఏమిటి ఆ పత్రిక విషయం?'

'ఫలానా నదిమీద ఉండే వంతెన పడిపోయింది' అని ఒకరోజున ఒక పత్రిక ప్రచురించింది. ఈ విషయాన్ని మా పత్రికయే ముందుగా ప్రకటించింది' అనికూడా ఆ పత్రిక పేర్కొన్నది.

మర్నాడు ఆ పత్రిక యిలాగ ప్రచురించింది. 'ఫలానా నదిమీదఉన్న వంతెన పడిపోయింది అని నిన్న మేము ప్రచురించిన వార్త నిజం కాదు. ఈ వార్తనుకూడా అన్ని పత్రికలకంటే ముందుగా మా పత్రిక ప్రచురించ గలిగినందుకు మేము చాలా గర్విస్తున్నాము'

ఇక్కడ ఆ పత్రిక మిగిలిన పత్రికల కంటే ముందుగా 'వంతెన పడిపోలేదు' అనే వార్తను ప్రకటించినమాట నిజమే కాని అంతకు ముందు రోజున 'వంతెన పడిపోయింది' అనే అసత్యపు వార్తను ఆ పత్రిక ప్రకటించింది. ఆ తప్పును సరిదిద్దుకొవడానికే మర్నాడు మరొక వార్తను ప్రకటించింది. అందుచేత ఈ సంఘటనను గురించి ఆ పత్రిక సగర్వంగా చెప్పుకోవలసిన అవసరం యేమీ లేదు. అలాగ ఈ వార్తను ప్రకటించినందుకు ఆ పత్రిక గర్వించినా

అంటే దానికి కారణం ఆ వ్యక్తియొక్క అవివేకమేతప్ప మరొకటి కారణం కాదు.

అలాగే మన ప్రభుత్వం పాకిస్థానుయెడల అవలంబించిన దృఢమైన వైఖరికి మన ప్రభుత్వం గర్వించవలసిన అవసరం యేమీ లేదు. అసలు ఈ విమానాన్ని పాకిస్థానుకు తీసికొని పోవడమనేది కేవలం మన ప్రభుత్వం యొక్క అసమర్థతవల్లనే కదా జరిగింది. అందుచేత మన ప్రజలు ఈ సంఘటనను గురించి ఆలోచించవలసిన విషయం చాలా ఉంది' అన్నాడు చూడామణి.

'అవును అందుకేకదా మన ప్రజలు ఢిల్లీలోని పాకిస్తాను హైకమిషనరు కార్యాలయం ముందు ప్రదర్శనలు జరిపారు.'

'అంతకంటే ముఖ్యమైన విషయం మరొకటి ఉంది'

ఏమిటి ఆ ముఖ్యమైన విషయం?

'ముందుగా నేను ఒక ఉపమానాన్ని చెబుతాను' అని అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒకవూళ్లో ఒక షావుకారు ఉన్నాడు అతనికి పట్నంలో ఒక కొట్టు ఉంది. ఆ కొట్టు తాలూకు వ్యవహారాలను చూడడానికి ఒక మేనేజరును నియమించాడు షావుకారు. ఆ మేనేజరే ఆ కొట్టు వ్యవహారాలకు పూర్తిగా బాధ్యత వహించాలి' అని షావుకారు అతనికి స్పష్టంగా చెప్పాడు.

కొట్లో పనిచేసే నిమిత్తం ఒక బంట్రోతును నియమించాడు మేనేజరు. కొంతకాలం అయిన తరువాత మేనేజరు కొట్టు వ్యవహారాల్లో చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించేవాడు. పెట్టె తాళాలను కూడా ఒక్కొక్కప్పుడు అజాగ్రత్తగా మేనేజరు వదిలివేసేవాడు.



# ముగ్గురుమూర్ఖులు

కొట్లో పనిచేస్తున్న బంట్రోతు స్నేహితులు కొందరు ఒకప్పుడు ఆ పట్నం వచ్చారు. ఆ స్నేహితులందరూ జైలుకు వెళ్లివచ్చిన దొంగలు. ఆ విషయం మేనేజరుకు తెలుసును. అయినా మేనేజరు ఆ దొంగలను కొట్టు ఆహ్వానించి కాఫీ వగైరా యిచ్చి గౌరవించాడు.

కొన్నాళ్లు అయిన తరువాత, మేనేజరు అశ్రద్ధగా ఉన్న సమయంలో, బంట్రోతు కొట్లో ఉన్న డబ్బు యెత్తుకొని పారిపోయాడు.

వెంటనే మేనేజరు యీ విషయం పోలీసులకు రిపోర్టు యిచ్చాడు. బంట్రోతు ఫోటోను పత్రికల్లో ప్రకటించాడు. అతనిని పట్టుకొన్నవారికి తగిన బహుమానాన్ని కూడా యిస్తామని ప్రకటించాడు మేనేజరు.

తరువాత మేనేజరు షావుకారు వద్దకు వెళ్లి జరిగిన విషయాన్ని తెలియచేశాడు. దొంగను పట్టుకొనడానికి తాను తీసికొన్న చర్యలనన్నింటినీ మేనేజరు సగర్వంగా షావుకారుకు వివరించాడు.

'దొంగతనం జరిగిన తరువాత, దొంగను పట్టుకొనడానికి నువ్వు తీసికొన్న చర్యలు బాగానే ఉన్నాయి కాని దొంగతనం జరగడానికి ముందు నువ్వు చూపిన నిర్లక్ష్యం మాట యేమిటి?' అని షావుకారు మేనేజరును ప్రశ్నించాడు.

దానికి మేనేజరు యేమీ సమాధానం యివ్వలేక పోయాడు. వెంటనే షావుకారు మేనేజరును ఉద్యోగంలో నుంచి తొలగించివేశాడు.' అని షావుకారు ఉపమానాన్ని వివరించాడు చూడామణి.

'ఈ విమానం తాలూకు సంఘటనకు నువ్వు చెప్పిన షావుకారు ఉపమానానికి సంబంధం యెక్కడ ఉంది?' అని చంచలావు ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

నేను చెప్పిన ఉపమానంలోని షావుకారే భారత ప్రజలు, మేనేజరు భారత ప్రభుత్వం, బంట్రోతు విమానాన్ని యెత్తుకొని పోయిన వాళ్లు. డబ్బు విమానం.

ఉపమానంలో చెప్పిన మేనేజరు, దొంగతనం జరిగిన తరువాత సరిగానే ప్రవర్తించాడు కాని దొంగతనం జరగడానికి ముందు చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించాడు.

ఇక్కడ విమానం తాలూకు సంఘటనకు ముందు భారత ప్రభుత్వం చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించింది. 1970వ సంవత్సరం సెప్టెంబరు నెలలో యిటువంటి సంఘటన జరగవచ్చుననే వదంతులు వచ్చాయి. ఆ వదంతిని కాశ్మీరులోని పత్రికలు కూడా ప్రచురించాయి. అయినా మన ప్రభుత్వం యిటువంటి చర్యను అరికట్టడానికి కట్టుదిట్టమైన చర్య యేమీ తీసికొనలేదు.

ప్రయాణీకులను, వారి సామానులను కూడా తనిఖీ చేయవలసినదిగా ఉత్తరువు పంపినట్లుగా సివిల్ యేవియేషను డైరెక్టరు జనరల్ వెల్లడించాడు. కాని అటువంటి తనిఖీ యేమీ యీ సందర్భంలో జరపలేదు. ఈ వ్యక్తుల్లో ఖురేషీ వద్ద పిస్తోలు ఉంది. అష్రఫ్ వద్ద హేండ్ గ్రెనేడ్ ఉంది. ఈ వస్తువులే అధికారుల నిర్లక్ష్యానికి నిదర్శనం.

ఇందులో ఖురేషీ బోర్డరు సెక్యూరిటీ ఫోర్సులో ఉద్యోగం కూడా చేస్తున్నాడని చెబుతున్నారు. ఇవి అన్నీ ప్రభుత్వం యొక్క నిర్లక్ష్యాన్ని తెలియజెయ్యడం లేదా ?' అని ప్రశ్నించాడు చూడామణి.

'నువ్వు చెప్పిన ఉపమానంలో మేనేజరు దొంగలకు కాఫీ వగైరా యిచ్చి గౌరవించాడు అని చెప్పావుకదా, ఆ మాదిరిగా భారత ప్రభుత్వం యెప్పుడు ప్రవర్తించింది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'అరబ్బు గెరిల్లాలకు 'అల్‌ఫటా' అనే సంస్థ ఒకటి ఉన్నది. ఆ సంస్థ సభ్యులు యితరదేశాలకు చెందిన విమానాలను యిలాగే పేల్చివేశారు. అప్పుడు మన ప్రభుత్వం ఆ చర్యను ఖండించలేదు సరి కదా! మనదేశానికి అల్‌ఫటా సభ్యులను ఆహ్వానించి గౌరవించింది. ఇది విధ్వంస చర్యలను ప్రోత్సహించడం కాదా! ఈ పరిస్థితిలో మన ప్రభుత్వంయొక్క ప్రవర్తనను గురించి ఆలోచిస్తుంటే నాకు ఒక కథ జ్ఞాపకానికి వస్తున్నది.'

'ఏమిటి ఆ కథ ?'

ఒకప్పుడు గుర్రం, లేడి దెబ్బలాడుకొన్నాయి. అప్పుడు గుర్రం మనిషి వద్దకు వెళ్లి, 'లేడిని చంపవలసినదిగా' అతన్ని కోరింది.

'లేడి చాలా వేగంగా పరుగెడుతుంది. దానిని నేను యెలాగ చంపగలను ?' అని ప్రశ్నించాడు మనిషి.

'నువ్వు నా మీద కూర్చొన్నట్లయితే నేను నిన్ను దానితో సమానంగా తీసికొని వెడతాను. అప్పుడు నువ్వు లేడిని చంప వచ్చును.'

'సరే' అని చెప్పి మనిషి గుర్రం మీద స్వారి చేస్తూ లేడిని చంపివేశాడు.

తరువాత 'తన మీదనుంచి దిగిపో'మ్మని గుర్రం మనిషిని అడిగింది.

'గుర్రం మీద స్వారీ చేసినట్లయితే యింత వేగంగా వెళ్లవచ్చుననే విషయం నాకు యింతవరకు తెలియదు. ఇప్పుడే నేను యీ సంగతిని గ్రహించగలిగాను. అందుచేత యిటుపైని నువ్వు నన్ను మోయవలసినదే' అని మనిషి గుర్రంతో అన్నాడు. అప్పట్నుంచి గుర్రం మనిషికి బానిస అయి పోయింది.

అలాగే యితరదేశాల విమానాలను విధ్వంసం చేసిన 'అల్‌ఫటా' సభ్యులను మన ప్రభుత్వం గౌరవించింది. ఇప్పుడు 'అల్‌ఫటా' సభ్యులు మన విమానాన్నే విధ్వంసం చేశారు. అందుచేత మన ప్రభుత్వం నేను చెప్పిన కథలోని గుర్రం మాదిరిగా ప్రవర్తించలేదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

– 'ఇంతే కాదు. ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ ఆ మధ్యను భారతదేశం వచ్చాడు. గాంధీ తరువాత గాంధీ అంతటివాడు గఫార్‌ఖాన్. సత్యానికి అహింసకు మారుపేరు గఫార్‌ఖాన్' అని అంటూ మన నాయకులు ముఫ్ఫైరెండు లక్షల రూపాయలు చందా వసూలుచేసి యిచ్చారు. ఆ డబ్బులో యేడు లక్షల రూపాయలను గఫార్‌ఖాన్ అరబ్బు 'అల్‌ఫటా'కు విరాళం యిచ్చాడు. ఈవిధంగా మనదేశంనుంచి 'అల్‌ఫటా'కు ఆర్థిక సహాయం కూడా లభించింది' అన్నాడు చిదంబరం.

'అందుచేత యీ విషయంలో మన ప్రభుత్వం గర్వించవలసిన అవసరం యేమీ లేదు. దీనినే మన ప్రభుత్వ నాయకులు తమకు గర్వకారణంగా చెప్పినట్లయితే, అది వారి అవివేకమే కాగలదు' అన్నాడు చూడామణి.

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ ఏంచక్రాలావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

# సినిమా

## పోలీసు దృష్టిలో పడ్డ పెద్దమనుషుల ముఠా!

హీరో క్రిష్ణ చాలా మంచివాడు. అందగాడుకూడా; ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. క్రిష్ణయొక్క పర్సనాలిటీ, అతగాడు డ్యూటీపట్ల చూపే ఆసక్తి ప్రభాకరరెడ్డిని ఆకర్షించాయి. క్రిష్ణను తన గ్రూపులో చేర్చుకుంటాడు. ప్రభాకరరెడ్డి ముఠా పైకి పెద్దమనుష్యుల్లాగా పోజుపెడుతూ, దొంగతనాలు, లూటీలు రాత్రుళ్లు చెయ్యడం ముఖ్యవృత్తి. క్రిష్ణకు యేమి చెయ్యాలో, యెలా తప్పించుకోవాలో తెలియడం లేదు. ఏం చేస్తాడు పాపం; ప్రభాకరరెడ్డి చెయ్యమన్నదల్లా తు. చ. తప్పకుండా చేస్తూ వచ్చాడు క్రిష్ణ. ఒకరోజు రాత్రి ప్రభాకరరెడ్డి, క్రిష్ణంరాజు మరి కొందరు క్రిష్ణను వెంటబెట్టుకుని 'బ్యాంక్ రాబరీ'కి బయల్దేరారు. ఈ 'రాబరీ' గుట్టు సి. ఐ. డి. శాఖకు తెలిసింది.? ప్రభాకర రెడ్డి కళ్ళు ఎర్రబడ్డాయి. హీరో క్రిష్ణపై అందరికీ అనుమానం వచ్చింది. 'నువ్వే సి అయ్. డి.' అని ఏకకంఠంతో గగ్గోలు పెట్టారు. అలాగేం, అంటూ

'నిప్పొక చోట
పొగ ఒక చోట
నిజమును ఎరిగే దెవ్వరో
ముచ్చట గొలిపే
గులాబీ మాటున
ముళ్లను చూసే దెవ్వరో—

అని ఎలుగెత్తి పాడాడు 'కట్' అన్నారు దర్శకుడు చంద్రశేఖరరెడ్డి. కవి నారాయణ రెడ్డిచే వ్రాయబడ్డ పై పాటను బాల సుబ్రహ్మణ్యం మహదేవన్ సారధ్యంలో హీరో క్రిష్ణకుగాను 'అనూరాధ' చిత్రంలో పాడాడు. ఎస్. వి. ప్రభాకరరెడ్డి నిర్మించే యీ 'సోషియో క్రయిమ్' చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, వెంకటరత్నం ఛాయను నిర్వహిస్తున్నారు. ముఖ్యపాత్రలను రంగారావు, క్రిష్ణ, విజయనిర్మల పోషిస్తున్నారు. ముఖ్యపాత్రలను రంగారావు, క్రిష్ణ, విజయనిర్మల పోషిస్తున్నారు. లక్ష్మి ఫిలింస్ విడుదల.

## చలంముందు వోడిపోయిన జ్యోతిలక్ష్మి శృంగారం!

నటుడు చలంయొక్క ప్రొఫెషన్ ఏమిటో తెలుసా? కడుపునిండా తినడం; గురకపెట్టి నిద్రపోవడం. పెద్ద ఆస్తిపరుడు; కానీ సోమరిపోతు. డబ్బును కాజెయ్యాలనుకుంది ఛాయాదేవి. అందుకే తన కూతురు జ్యోతిలక్ష్మినిచ్చి పెండ్లి చేసింది. అది మొదటిరేయి; కొత్తదంపతులకు అమూల్యమైన ఆ రేయిని చలం, జ్యోతిలక్ష్మి చవి చూసారా? లేదు లేదు. పాపం, వధూవరులు తలకొకప్రక్క కూర్చున్నారు. జ్యోతిలక్ష్మి తన భర్త చలంలో సరికొత్త భావాలను రేకెత్తించడానికి సకల విధాలా ప్రయత్నించింది. కానీ అతగాడు నిద్రమానితేగా? తన భర్తను కౌగలించుకుంది. తమాషా కబుర్లు చెప్పింది. శృంగార చేష్టలతో తనవైపు త్రిప్పుకుందామనుకుంది. కానీ ఫలితం శూన్యం. 'ఛీ' అని చీదరించుకుంది.

'అందిన ద్రాక్షలు పులుపా
నా అందం నీకు వగరా' అంటూ

చలంతో మొరపెట్టుకుంది. చలం కదిలితేగా? 'కట్' అన్నారు దర్శకుడు. వి. రామచంద్రరావు. ఈ విచిత్రమైన సన్నివేశం 'సోమరిపోతు' చిత్రంలో కనిపిస్తుంది. కె. బాబూరావు నిర్మిస్తున్న యీ హాస్య చిత్రానికి భమిడిపాటి రచన్ను, వెంకటేష్ సంగీతాన్ని, కె. ఎస్. ప్రసాద్ ఛాయను నిర్వహిస్తున్నారు. పూర్ణా విడుదల.



"దెబ్బకు ఠా దొంగలముఠా"లో వాణిశ్రీ డ్రెస్ ఈ దేశందేనా?

## సినిమా డైరీ

● విశ్వజ్యోతి పిక్చర్స్‌వారి షూటింగు ఫిబ్రవరి 5న వీనస్ స్టూడియోస్‌లో ప్రారంభమైంది. ఈ చిత్రానికి మానాపురం నిర్దేశకుడు.

● డి. వి. ఎస్. ప్రొడక్షన్సు వారి పాటల రికార్డింగుకు సంబంధించిన పూజా కార్యక్రమం ఫిబ్రవరి 6న గం. 8—50నిలకు విజయాగార్డెన్సులో జరిగింది.

● అశోక్ మూవీస్‌వారి పవిత్ర బంధం నవయుగా ద్వారా ఫిబ్రవరి 25న విడుదలవుతుంది.

● రవీంద్రా ఆర్ట్సు పిక్చర్సు నిర్మించే పాసికాన్ని అక్కినేని సంజీవి డైరెక్టు చేస్తున్నారు. ఫిబ్రవరి 19న హైదరాబాద్ సారధిలో షూటింగు ప్రారంభమవుతుంది.

● చిత్ర కళా పిక్చర్సు నందమూరి సాంబశివరావు ఒక క్రయిమ్ చిత్రాన్ని ప్రారంభిస్తున్నారు. రమేష్ దర్శకత్వాన్ని, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తారు.

● కృష్ణా పిక్చర్సువారి నమ్మక ద్రోహులు షూటింగు ఫిబ్రవరి 6తో పూర్తి అయింది. ఈ చిత్రానికి కుటుంబరావు దర్శకుడు.

● మధుపిక్చర్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు.

## బరువు బాధ్యతలు తెలీని భార్యాబిడ్డలు

జగ్గయ్య, సావిత్రి దంపతులు. వాళ్ళ కడుపున రామ్మోహన్, రాజబాబు, లీలారాణి పుట్టారు. ముగ్గురు మూడు రకాలుగా పెరిగారు. తల్లిచాటున పెరిగిన, ఈ ముగ్గురికీ బరువు, బాధ్యతలంటే తెలియవంటారు. అవసరమయినప్పుడల్లా, తండ్రికి తెలియకుండా, తల్లివద్ద సహాయాన్ని పొందడం వీళ్ళకు అలవాటై పోయింది. ఆమెకూడా 'అయ్యో పాపం' అంటూ పిల్లలను గారాబంగా పెంచింది. కష్టపడి సంపాయించడం జగ్గయ్యగారి వంతు; ఆఆర్జనను విచ్చలవిడిగా ఖర్చు చెయ్యడం పిల్లల వంతు.

ఒకరోజు జగ్గయ్య ఆఫీసు ఫైల్సును తిరగేస్తూ, వరండాలో వచ్చేపోయే వాళ్ళకు సమాధానాలిస్తూ, పచార్లుచేస్తూవున్న సమయంలో మేడపైన కాకిగోల వినవచ్చింది.



"రాజకోట రహస్యం" లో జ్యోతిలక్ష్మి

## సినిమా

రాజబాబు, లీలారాణి పెద్దగా అరుస్తూ, అల్లరిచేస్తూ వుండడాన్ని జగ్గయ్య గమనించారు. 'ఏమిట్రా, మీకు యెన్నిసార్లు చెప్పేదిరా. కాలేజికి పొండి' అని గర్జించాడు. 'కట్' అన్నారు డైరెక్టరు సావిత్రి. ఈ దృశ్యం సావిత్రి కంబైన్స్‌వారి 'వింత సంసారం'లో కనిపిస్తుంది. సావిత్రి అండ్ దిడ్డి శ్రీహరిరావులు నిర్మించే ఈ విచిత్రమైన కథావస్తువుగొన్న చిత్రానికి మద్దిపట్ల సూరి మాటలను, కోదండపాణి సంగీతాన్ని, శేఖర్—శింగ్ ఛాయను నిర్వహిస్తున్నారు. ఈ చిత్రాన్ని విజయ పిక్చర్స్ విడుదల చేస్తారు.

## నాగేశ్వరరావుపై చెయ్యిచేసుకున్న జమున

రాజా (నాగేశ్వరరావు)కు జల్సాగా, జాలీగా, జీవించడం అలవాటు. ఆయన నివసించేది ఒక విలాస మందిరం. ఆ మందిరంలో సదా సర్వదా కొంగ్రొత్త అందగత్తెల ఆట పాటలు తప్ప మరొకటి వినిపించవు. ఎంతటి రతీదేవియైనా, రాజా ముందు దాసోహం గాక తప్పదు. ఒకరోజు రాధ (జమున)ను రాజా కళ్ళార్పకుండా చూసాడు. ఎన్నడూ, ఎవ్వరినీ పరికించి చూడని రాజా ఆ రోజు రాధను పదే పదే చూడడం అతనికే ఆశ్చర్యమేసింది. ఎలాగయినాసరే, రాధను తన విలాస మందిరానికి రప్పించాలనుకున్నాడు. ఆమె రానే వచ్చింది. రాజాను రిపేరు చేద్దామని వచ్చింది. రాధను రాజా చూసాడు. ఆమెలో కోటి చంద్రుల అందాన్ని వూహించుకున్నాడు. ఆమెను సమీపించాడు. రాధను చూడగానే, రాజాకు కవిత్వం పెల్లుబికింది.

'చిన్నారి చిలక రన్నో
చేరాయి కోరి నన్ను
అందాల రామ చిలక
అలరించె నేడు నన్ను'

అంటూ రాధను తాకబోయాడు 'ఫెల్ ఫెల్' అన్న శబ్దం వినిపించింది. అంటే రాధ రాజా చెంపకు పాటం చెప్పిందన్న మాట. 'కట్' అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మ. ఈ బిగువయిన సన్నివేశం విశ్వభారతి ప్రొడక్షన్స్‌వారి సాంఘిక చిత్రంలో కనిపిస్తుంది. జి. రాధాకృష్ణమూర్తి నిర్మి

## మీకు తెలుసా?

హీరో క్రిష్ణ తనబృందంతో ఫిబ్రవరి 8 న థార్ ఎడారికి బయల్దేరారు.

నటి లక్ష్మి త్వరలో తల్లి కాబోతూంది.

హిందీనటుడు జోహార్ బొంబాయిలో యిండిపెండెంట్ అభ్యర్థిగా ఎలెక్షన్‌లో పోటీ చేస్తున్నారు.

నటి సరోజాదేవి, హరనాథ్ కు భార్యగా విశ్వజ్యోతి పిక్చర్స్‌లో మొదటిసారిగా నటిస్తూంది.

ప్రముఖనటి జమున తను నటిస్తున్న చిత్రాల్లో పనిచేసే కళాకారులకు, దర్శక, నిర్మాతలకు, సాంకేతిక బృందానికి, జర్నలిస్టులకు 'విందు' నివ్వడానికి నిర్ణయించింది.

స్తున్న ఈ చిత్రానికి ముళ్ళపూడి రచన్ను, చలపతిరావు సంగీతాన్ని, రామక్రిష్ణారావు ఛాయను నిర్వహిస్తున్నారు. నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు ప్రధాన పాత్రలు పోషించే ఈ చిత్రం నవయుగ ద్వారా విడుదలవుతుంది.

## విజయనిర్మలకి పెళ్ళి చూపులు

గుమ్మడి చెల్లెలు విజయనిర్మల. విజయనిర్మల వదిన సావిత్రి; విజయనిర్మలను (పెండ్లి చూపులకు)చూడడానికి ముహూర్తం నిశ్చయం చేసారు. హాల్లో సావిత్రి, గుమ్మడి కూర్చుని లిస్టు వ్రాస్తూ వుంటారు. ప్రక్కింటి కాంతమ్మ వస్తుంది.

కాంత: రేపేనటగా పెండ్లివాళ్ళొచ్చేది. నిమ్మకు నీరెత్తినట్టు అలా వుండిపోయావే. (కాఫీ పొడి అడుగుతుంది.)

సావిత్రి తన భర్తతో కాఫీపొడి తేలేదేమిటని అడిగే సమయానికే కాంతమ్మ వెళ్ళిపోతుంది.

గుమ్మడి: కాఫీపొడి సంగతి వాకెప్పుడు చెప్పావే.

సావిత్రి: వూరుకోండి. మీకేమీ తెలియదు సరే, లిస్టు రాసుకోండి. వో పట్టు చీర మరీ ముదురుకాదు, మరీ లేత కాని నీలిమబ్బు రంగు; చూడండి. నక్షత్రా



"ప్రేమజీవులు" లో కృష్ణ, రాజశ్రీ.

ల్లాటి జరీ పూలుండాలి, ఆ సన్నాసిరాజు గారి కోడలు కట్టుకొచ్చింది చూడండి.

గుమ్మడి: అవునవును. మొన్న పేరం టానికి...

సావిత్రి: ఆఁ! మీరెందుకు చూశారు!

గుమ్మడి: మరి నాకేం తెల్సని చెబుతున్నావ్ ? అని బిక్కముఖం పెడతాడు. 'కట్' అన్నారు దర్శకుడు చంద్రశేఖరరెడ్డి. ఈ హాస్య ఘట్టం 'విచిత్ర దాంపత్యం' చిత్రంలో కనిపిస్తుంది. పి. చిన్నపరెడ్డి నిర్మిస్తున్న యీ చిత్రానికి ఉషశ్రీ రచనను, అశ్వత్థామ సంగీతాన్ని, ముఖదేవ్ ఛాయను నిర్వహిస్తున్నారు. శోభన్‌బాబు, సావిత్రి, గుమ్మడి, విజయనిర్మల, రాజబాబు ప్రధాన పాత్రలను ధరించే 'విచిత్ర దాంపత్యం' అనిల్‌ప్రభాన్ ద్వారా విడుదలవుతుంది.

## కళాత్మక దృష్టి

సినిమాను వ్యాపారంగా మాత్రమే గాక, కళాత్మకంగా కూడా పరిగణించేవారు నిర్మాతల్లో చాలా తక్కువమందే వున్నారు. అలాంటి కొద్దిమందిలో 'బంగారు తల్లి' నిర్మాత హరిబాబు ఒకరు. నీతి, న్యాయ నిరతి, భారతీయ సంస్కృతిని ప్రతిబింబింప చేసే చక్కటి చక్కటి కథావస్తువును యెన్నుకోవడం ఒక విశేషమయితే, ఆ కథకు కావలసిన సాధనసామగ్రిని, వాతావరణాన్ని యెప్పటికప్పుడు చేకూర్చడం మరొక విశేషమవుతుంది.

'బంగారు తల్లి' కథ మనకు కొత్తది కాదు 'మదర్ ఇండియా' చూసేవుంటారు మీరందరూ. కాని, హిందీ చిత్రంలో కానరాని కొన్ని బంగారు సన్నివేశాలను దర్శకుడు చాణక్య తను కల్పనాశక్తితో తెలుగు చిత్రంలో చొప్పించి, ఆ దృశ్యాల్లో మనచే కంట తడిపెట్టించే రీతిలో చిత్రీకరించారు

అనేక వ్యయప్రయాసలకోర్చి, భారీ యెత్తున, గ్రామీణ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించడానికి నిర్మాత, దర్శకుడు తీసుకున్న శ్రద్ధ ప్రతి ఫ్రేములో కనిపిస్తుంది ఈ చిత్రానికి నిర్మాత హరిబాబు రిలీజు లక్ష్మీ ఫిలింస్.

## దర్శకుడు రాసిన కథ

ప్రేక్షకుల అభిమానాన్ని విపరీతంగా చూరగొన్న సంస్థల్లో డి. వి ఎస్ కూడా ఒకటి మంచి కథలకోసం, రెండు సంవత్సరాలు వేచికున్నారు డి. వి. ఎస్ రాజు గారు. దర్శకుడు కె విశ్వనాథ్ వ్రాసిన కథ నిర్మాతకు, ముఖ్యనటుడు ఎన్. టి రామారావుకు నచ్చింది షూటింగు ఫిబ్రవరి 15 న నిశ్చయించబడింది. ఫిబ్రవరి 5, 6 తేదులు బాగున్నాయి అందుకే 5 న గృహ ప్రవేశం చేసిన డి వి. ఎస్ రాజు ఫిబ్రవరి 6 న మొదటిపాటను టి. వి. రాజు సంగీత సారధ్యంలో విజయా గార్డెన్స్‌లో రికార్డు చేయించారు

'సీతమ్మ తల్లికి సీమంత మమ్మా
శ్రీదేవి భూదేవి దీవింతురమ్మా'

—ఈ పాటను సుశీల పాడింది డి.వి. ఎస్. ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వపు బరువు కె. విశ్వనాథ్ గారిది ఈ చిత్రానికి సముద్రాల మాటలను, నారాయణరెడ్డి పాటలను సమకూర్చారు ఎన్ టి రామారావు, జగ్గయ్య, రాజనాల, అల్లు రామలింగయ్య, రాజబాబు, వాణిశ్రీ, దేవిక, శాంతకుమారి, రమాప్రభ ప్రధాన పాత్రలను పోషించే ఈ చిత్రం యొక్క ఛాయను ఎస్ ఎస్ లాల్, శిల్పాన్ని కళాధర్, సహాయ దర్శకత్వాన్ని దయాసాగర్ నిర్వహిస్తారు. డి వి ఎస్ రాజు నిర్మించే ఈ చిత్రాన్ని విజయపిక్చర్స్ విడుదల చేస్తారు షూటింగు ఫిబ్రవరి 15 నుండి జరుగుతుంది

## కొత్త కాంబినేషన్

ఆర్ట్ డైరెక్టర్ రాజేంద్రకుమార్ 'తారాశశాంకము' నిర్మాత సత్యనారాయణ కలసి స్థాపించిన విశ్వజ్యోతి పిక్చర్స్‌యొక్క షూటింగు ఫిబ్రవరి 5 న వీనస్ స్టూడియోలో కోలాహలంగా జరిగింది వి. సురేష్



"విచిత్ర సంసారం"లో ఈ ఇద్దరూ ఎవరో గుర్తు పట్టగలుగుతున్నారా!

షిఫ్ట్ ఆన్ చేసారు. శ్రీ. సుహాసిని క్లాప్ కొట్టింది. ఈ సాంఘికానికి రాజశ్రీ మాటలు, పెండ్యాల సంగీతాన్ని సమకూరుస్తున్నారు. హరనాథ్ — సరోజాదేవి కాంబినేషన్‌లో (ప్రేమికులుగా) తయారవుతున్న మొదటిచిత్రం యిది. సావిత్రి ప్రధానపాత్ర ధారిణి. సహాయ భూమికలను చంద్రమోహన్, సత్యనారాయణ, రాజబాబు, రావికొండలరావు, సాక్షి రంగారావు, రమాప్రభ, ఛాయాదేవి, అనిత, రుక్మిణి ధరిస్తున్నారు.

## సినిమా

గుహనాథన్ వ్రాసిన కథను ఆధారంగా తీసికుని నిర్మింపబడుతున్న ఈ చిత్రానికి వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, రాజేంద్రకుమార్ కళను, అంకిరెడ్డి కూర్పును నిర్వహిస్తున్నారు.

## సత్యభామగా వాణిశ్రీ

పూర్ణిమా పిక్చర్స్ నిర్మించనున్న 'శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం' చిత్రంయొక్క షూటింగు మే మాసంలో ప్రారంభించబడుతుంది. ఈ భారీ పౌరాణిక చిత్రానికి సముద్రాల మాటలను, టి. వి. రాజు సంగీతాన్ని సమకూరుస్తున్నారు. సి. ఎస్. రావ్ దర్శకత్వం నెరపనున్న ఈ పౌరాణికంలో కృష్ణునిగా ఎన్టీ రామారావు, సత్యభామగా వాణిశ్రీ నటించడానికి అంగీకరించినట్లు నిర్మాత డి. ఎస్. రాజు వెల్లడించారు.

## నెలకి నలభై పాటలు!

యువ గాయకుడు ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం అంబాసిడర్ కారును రోజుకి మూడుసార్లు ఏదేని స్టుడియోలో చూస్తున్నాను. ఎప్పుడు అడిగినా, రికార్డింగు వుందనే చెపుతుంటాడు. నెలకు ఎన్నిపాటలు పాడుతున్నారో చెప్పగలరా? అని అడిగాను. నెలకు సగటున 40 పాటలు పాడుతున్నాను, అని చెప్పాడు బిజీ సింగర్ ఎస్. పి. బి.

— టి ఆర్. ఎస్

## పల్లెసీమలు పైరుపంటలు

ప్రకృతి రామణీయకతతో వెల్లివిరిసే పల్లెసీమల అందచందాలను, పంట పైర్లను 'బంగారుతల్లి' చిత్రీకరణకు ప్రత్యేకశోభను తెచ్చిపెడతాయని అంటున్నారు. 'బంగారుతల్లి' పాత్రకోసం జమున పుట్టిందా లేక జమునకోసం ఆపాత్ర సృష్టించబడిందా అనేది భావం ఆమె నటింగ్‌లో ద్యోతకమవుతుంది. వేగొండి హరిబాబు, శ్యాము శేషగిరిరావులు నిర్మిస్తున్న ఈచిత్రం కృష్ణారావు నిర్వహణలో వేకడ్బందీగా తయారవుతూవుంది. శ్రీ పిక్చర్స్ ద్వారా విడుదలకానున్న చిత్రానికి పినిసెట్టి సంభాషణలను, రాజేశ్వరరావు సంగీతాన్ని, కమల్‌ఘోష్ ఛాయను నిర్వహిస్తున్నారు ముఖ్యభూమికలను జమున, జగ్గయ్య. శోభన్‌బాబు నాగభూషణం, అల్లు రామలింగయ్య, కృష్ణంరాజు, వెన్నిరాడై నిర్మల, రమాప్రభ, నిర్మల, సురభి బాల సరస్వతి ధరిస్తున్నారు. భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపచేసే వుత్తమ

## సినిమా

కథాంశంగల ఈ చిత్రం ప్రేక్షకులను మెప్పించే మంచి చిత్రంగా రూపొందించబడిందని పరిశ్రమలోని ప్రముఖులనేకులు భావిస్తున్నారు.

## వెండి తెరకు మరొక విలన్

ఇటీవల రవిత్రవారి 'రివాల్వర్ రాణి' రష్ చూశాను. అందులో ఒక దృఢకాయుడ్ని చూసాను. అతనిమాపు, నడక, వాచకం, నటన బాగా వున్నాయనిపించింది. పరిశ్రమకి మరొక విలన్ దొరికినట్టే. అతగాడు మీకేమీ కొత్తవాడు కాదు 'జగిత్‌కిలాడీలు' చిత్రంలో భయంకర్‌గా సాక్షాత్కరించిన రావు గోపాలరావే.

—శ్రీనివాస్ ●

**అవీ.. ఇవీ!**

### వివాహం

ఆంధ్రపత్రిక సహాయ సంపాదకులు (విజయవాడ) శ్రీ పి. ఎస్. ప్రకాశరావు కుమారుడు చి. శ్యామసుందరమూర్తికి, రెబ్బవరం గ్రామ వాస్తవ్యులు శ్రీ కొలిపాక రామచంద్రరావు కుమార్తె చి. సౌ. లక్ష్మీదేవికి ఫిబ్రవరి 12 వ తేదీ రాత్రి గం. 3—58 ని. లకి ఖమ్మం టౌన్ (మామిళ్లగూడెం)లో వైభవంగా వివాహం జరిగింది.

వివాహానికి ఆంధ్రపత్రిక ప్రచురణకర్త, ముద్రాపకులు శ్రీ శివలెంక నాగేశ్వరరావు, ఆంధ్రపత్రిక విజయవాడ కార్యాలయం మేనేజరు శ్రీ రమేష్‌బాబు, చెరుకూరి రాఘవేంద్రరావు (విజయా పిక్చర్స్) మొదలగు ప్రముఖులు, స్థానిక న్యాయవాదులు హాజరై వధూవరులని ఆశీర్వదించారు. —(ఒ. వి.)

### బరంపురంలో 'వికాసం'

బరంపురంలో ఈమధ్య కొంతమంది ఉత్సాహవంతులూ, సాహిత్యాభిలాషులూ కలిసి 'వికాసం' పేరుతో ఒక కొత్త తెలుగు సంస్థ నెలకొల్పారు. వీరు వారం వారం గాంధీనగరంలోని కార్యాలయంలో సమావేశమవుతున్నారు. చెప్పుకోదగ్గ విషయమేమంటే యీ సంస్థ కార్యకలాపాల్లో రాజకీయ, కుల, మత ప్రమేయం లేక పోవడమే. సర్వతోముఖమైన తెలుగు సాహితీ సంస్కృతీ వికాసమే ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

ఈ సంస్థకు కార్యవర్గ సభ్యులుగా శ్రీ అవసరాల రామకృష్ణారావు, మాస్టర్ రవి, శ్రీ బి.యల్.యన్. స్వామి, శ్రీ జి. దేవదాసు, శ్రీ యమ్. వి. అప్పారావు ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.

ఈ సంస్థ సభ్యులు రచించిన కథలతో ఒక కథా సంకలనం సాధ్యమయినంత త్వరలో ప్రచురించాలని వీరి ఆశయం.

ఆంధ్రదేశంలోనూ, ఇతర రాష్ట్రాలలోనూ ఉన్న తెలుగు సాహితీ సంస్థలన్నిటినించి యీ వికాసం సహాయ సహకారాల్ని ఆశిస్తోంది.

స్వామి, కార్యదర్శి, వికాసం.

* * *

ఇటీవల మదరాసులోని గ్లాక్సో లాబొరేటరీస్ వారి ఆఫీసు, గొడవునులో రంగులు వెయ్యవలసి వచ్చినప్పుడు కేవలం బ్లండెల్ ఇయోమయిట్ రంగులే వాడారు. అంతేకాక గ్లాక్సో అయివరీ అనే ప్రత్యేక వర్ణం ఒకదానిని కూడా తయారు చేశారు ఈ సందర్భంలో. [ఒ. వి.] ●

## ఎవరెవరు? ఎవరెవరికి?




మధ్యంతర ఎన్నికలు వస్తాయని మొదట ప్రకటించబడినప్పుడు అఖిల భారత చలనచిత్ర సీమలో ఎంతో కోలాహలం బయలుదేరింది.. అనేకమంది తారలు— ఈ ఎన్నికల్లో పోటీ చేస్తారనే వార్తలు వెలువడ్డాయి. ఎవరెవరు నిలబడుతారో చూద్దామనే ఉత్సాహం ప్రజల్లోను, సినిమా పరిశ్రమలోని వారికీ కలిగింది. దానిమీద అంతా వూహాగానాలు చేశారు. తీరా చివరికి నామినేషన్లు దాఖలు చేసేరోజున బయట పడింది— ఎవరూ ముగిసిముందుకు రావటం లేదని........

మద్రాసులో మామూలుగా ఎం.జి. ఆర్. డి. ఎం. కె. తరపున పోటీ చేస్తున్నారు. తెలుగుపరిశ్రమకు సంబంధించి ఎవరూ నించోవటంలేదు. పోతే శివాజీ సంస్థా కాంగ్రెస్ తరపున పోటీ చేస్తారని అనుకున్నారుగాని, ఆయనకా ఉద్దేశ్యమే లేనట్లు తేలిపోయింది. కాని, సంస్థా కాంగ్రెస్ తరపున బహిరంగ సభల్లో పాల్గొంటున్నారు.

ఇక బొంబాయిలో ఐ. యస్. జోహార్ ఇండిపెండెంట్ అభ్యర్థిగా దక్షిణ బొంబాయి నియోజక వర్గంనుంచి లోక్ సభకుపోటీ చేస్తున్నారు.

చెమ్మీన్ దర్శకుడు రాముకారియట్ కేరళలోని త్రిచూర్ నియోజక వర్గంనుంచి లోక్ సభకు పోటీ చేస్తున్నారు.

బొంబాయిలో చాలా మంది తారలు మొదట పోటీ చేసే ఉద్దేశ్యాన్ని ప్రకటించారుగాని— పోటీ మానేసి తమకు సన్నిహితులయిన అభ్యర్థులకు మద్దతు యిస్తున్నారు. తమ బంధువయిన విక్కీకపూర్ విజయంకోసం—అన్నదమ్ములు రాజ్ కపూర్ షమ్మీకపూర్ పాటు పడుతున్నారు. అలాగే పటవుడీ నవాబ్ నెగ్గటంకోసం—అతని భార్య ప్రముఖతార అయిన షర్మిలా టాగూర్, దిలీప్ కుమార్, రాజేష్‌ఖన్నాల తోడ్పాటుతో పని చేస్తున్నది. శివసేన అభ్యర్థులను వైజయంతి మాల సపోర్టు చేస్తున్నది.

* * *

ఇదంతా ఇలా ఉండగా............

ఒరిస్సాలోగల మొత్తం 140 అసెంబ్లీ, సీట్లలో—14 సీట్లకు సినిమాతారలు పోటీ చేస్తున్నట్టు ఒరిస్సా చలన చిత్ర నిర్మాతల సంఘం కార్యదర్శి ధీరేంద్రనాద్ బిశ్వాల్ ప్రకటించారు. ఇది కొంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఎందుకంటే ఎంతో పెద్దవైన బొంబాయి, మద్రాసు పరిశ్రమల నుంచి పోటీ చేయని విధంగా—బాగా చిన్నదయిన ఒరిస్సా చలనచిత్ర పరిశ్రమనుంచి 14 మంది తారలు పోటీ చేయుటం, గొప్పే మరి!

* * *

శివసేన సినిమారంగంలోకి బాగా ప్రవేశించింది. ఫిలిమ్ బ్రాంచిని ఒకదానిని చిత్రపటసఖ పేరుతో ప్రారంభించింది. బొంబాయి లోని సినిమా వాళ్లంతా, ఒక్కొక్కరుగా ఆశాఖలో సభ్యులుగా చేరుతున్నారు. ఆశాఖలో వీళ్లంతా అభిమానంతో చేరుతున్నారో లేక భయపడే చేరుతున్నారో తెలీదుగాని, మొత్తానికి సభ్యత్వం స్వీకరిస్తున్న మాట నిజం.

ఇందుకు ఉదాహరణగా ఈ మధ్య బొంబాయిలో ఎనమండుగురు సంగీత దర్శకులు— అంతా జంట సంగీత దర్శకులే, శంకర్—జైకిషన్, కల్యాణ్ జీ—ఆనంద్‌జీ లక్ష్మీకాంత్— ప్యారేలాల్, యస్. డి. బర్మన్— ఆర్. డి. బర్మన్‌లు చిత్రపటసఖలో చేరారు.

— మోహన్ కుమార్

# పుస్తకాలు

## 1. అంతుపట్టని మనిషి.

పాకెట్‌సైజు 168 పుటలు. వెల: రెండు రూపాయలు. రచయిత: మురళీధర్.

## 2. రాగి—యోగి

పాకెట్ సైజు 179 పుటలు. వెల: రెండు రూపాయలు. రచయిత పి. వి. కృష్ణమూర్తి

ఈ రెండు నవలలను ప్రకాశకులు యమ్. శేషాచలం అండ్ కో, మచిలీపట్టణము, మద్రాసు, సికింద్రాబాదు

ఈ రెండు నవలల్లోను మొట్టమొదటి నవల అంతుపట్టని మనిషి ఒక సరికొత్త పంథాలో నడిచిన రచన. అసలు దీనిలోని కథగమనమే గురుశిష్య సంవాద రూపంలో కొనసాగింది. అలాగని దీనిలో కథ లేదని చెప్పలేము. రామ్మూర్తి అన్న ఆసామీ జీవితంలో చెప్పుకోదగ్గ పెట్టుబడి ఏమీ లేకపోయినా బాగా సులువుగా తారాజువ్వలాగ పైకివచ్చి చుట్టూర చేరిన ఎంతమందికో ఉపాయాలు కలగిస్తాడు. స్వామి ఒక్క ఉపాయం అతన్ని ఆశ్రయించి, అలా పైకి రావడం లోగల అనుపానులు, సుళువు, బరువులు, అన్ని కూపీతీసి పట్టుకుంటాడు. అతగాణ్ణి ఆశ్రయించి ఇంకొక ఆసామి తాను నేర్చుకున్న కిటుకులన్నీ కొంతవరకు పాటకుల ముందుంచుతాడు. సంగ్రహంగా ఇది ఈ నవలలోని కథ.

ఇటీవల తెలుగులో ఇటువంటి ఉపహాసన రచనలు చాలా తక్కువగా వస్తున్నాయి. సామాన్యంగా మన నవలలో కానరాని సరికొత్త ఇతివృత్తంతో, వ్యక్తులతో, అపహేళన ప్రధానమయిన హాస్యధోరణితో సంఘంలో చలామణిగా కొనసాగుతున్న దురాచారాలు కొన్ని కులాసా రచనా ధోరణితో తూర్పార బట్టి రచయిత కృతకృత్యులయినారు. వీరి వ్యావహారిక రచన చాలా సహజంగా, చక్కని నుడికారంతో చరచరా సాగిపోతూ అడుగడుగునా పాటకులలో ఆసక్తి రేకెత్తిస్తుంది.

ఇక రాగి—యోగి లో కథానాయకుడు కుమారగిరి అను రాజగోపాలం చిన్నతనంలోనే ఇతగాడి తండ్రి చనిపోతాడు. తల్లి సుందరమ్మ కొడుకుతో కలిసి గురునాథం అన్న లాయరు పంచన చేరుతుంది. ఆ గురునాథంగారి ఏకైక పుత్రిక ఆశాలత. రాజగోపాలానికి, ఆశాలతకు మధ్య కొంత చనువేర్పడుతుంది. ఆపైన రాజగోపాలానికి ఆమె మీద ప్రేమ పెరుకుంటుంది. కాని ఆశాలత ఆ ప్రేమ నంగీకరించక తిరస్కరిస్తుంది. దానితో రాజగోపాలానికి జీవితం మీద విపరీతంగా విరక్తి కలుగుతుంది. స్వామి విజయానందభారతి ఆనందాశ్రమంలో కుమారగిరిఅన్నపేరుతోసన్యాసిగామారిపోతాడు.

కాని కథ అంతటితో ముగిసిపోలేదు. ఆనందాశ్రమం బహువిధాల పెంపొందించడానికని ఆశాలత నృత్య ప్రదర్శన ఏర్పాటవుతుంది. రాజగోపాలం ఆశ్రమం విడిచిపెట్టి ఆశాలతవెంట పడతాడు. నిజానికి ఆమె అతన్ని తిరిగి మంచిదారిలో పెట్టడానికే ప్రయత్నిస్తుంది. ఆ తరవాత ఆమె సికింద్రాబాదులో ఫస్టుక్లాసు మాజిస్ట్రేట్ జగన్మోహన రావు సతీమణి అవుతుంది. చిట్టచివరికి ఆమె ఆనందాశ్రమంలో ప్రవేశిస్తుంది. భ్రష్టయోగి కుమారగిరి కనసారిగా ఆశ్రమంలో ఆమెను సందర్శించి మరింత విరక్తితో వేరొక చోటికి తరలిపోతాడు. పూర్తిగా విరాగి అవుతాడు.

రాగి—యోగి లో కుమారగిరి మానసిక పరిణామానికి కొంతవరకు కారణాలేవో కొన్ని కన్పిస్తాయి కాని ఆశాలతలో పరిణామమే బాగా విడ్డూరంగా కనిపిస్తుంది. మొట్టమొదట ఆమె ఒక లాయరు కుమార్తె. ఆ తరువాత ఆమె అతి త్వరితంగా నర్తకీమణిగా, సినీతారగా, ఫస్టుక్లాస్ మాజిస్ట్రేట్ భార్యగా, ఆశ్రమ వాసినిగా మారిపోతుంది! ఈ మార్పులలో సహజతకాని, వాస్తవికతకాని క్రమపరిణామంగాని విస్పష్టంగా కనిపించవు. కుమారగిరిలో వచ్చిన చివరి మార్పుకూడా ఆకస్మికంగా వచ్చినట్టే కన్పిస్తుంది. అద్భుతమయిన విరక్తి వల్ల వచ్చిన సహజ పరిణతిగా స్ఫురించదు.

అయినా రచయిత శైలి, కథాకథన శక్తి పాఠకులకుత్కంఠ కలిగిస్తాయి. నవల కొనసాగుతూ చదివిస్తుంది. —శాస్త్రి

## ఉషస్సు: (ద్వితీయవార్షిక సంచిక)

ప్రచురణ: స్త్రీ సమాజం—శ్రీకాకుళం [ఆంధ్ర] వెల రూ. 2—

ఆలోచనను రేపే రచనలు. పట్టి చూడవలసిన వాటిలో అన్నదాతా సుఖీభవ — నవ్యాంధ్ర సాహిత్యంలో స్త్రీల పాత్ర పేర్కొనవచ్చు. నవ్వులు పువ్వులు ఒక చిన్న పరిశోధక రచన— కి. శే. నేదునూరి గంగాధర కవి స్మరణకు యిందులో మంచి స్థానం లభించింది. వ్యాసాల ఎన్నికలో విచక్షణ—వైవిధ్యం స్పష్టంగా కనుపిస్తోంది. ఈ ఉద్యమాన్ని నిర్వహిస్తున్న మహిళల కృషి మెచ్చతగింది ప్రోత్సహింప తగ్గది

## పంచవటి: (కథల సంపుటి)

88 పేజీలు—వెల రూ. 2. ప్రచురణ యువభారతి— 5—కింగ్స్‌వే— సికింద్రాబాద్—3.

పేరుకి తగ్గట్టు ఇదొక కొత్త మోడల్ ఎన్నాళ్ళబట్టి పాల్గొన్నవారు ప్రసిద్ధులు, చక్కటిటిప్ ప్రతి వస్తువుకీ బొమ్మా బొరుసూ వుంటాయి. అవతలి వైపు కూడా చూస్తేనే అచ్చమైన నిజాన్ని తెలుసుకోగలుగుతాం మంజుశ్రీ కథలో దైన్యం నిండిన కళ్ళతో, ద్రౌపదిలా బిక్కపోయి దిక్కులు చూస్తున్న మదరిండియాను శ్రీమతి లతగారు చూపించారు కథనాడీ— ముగింపు ఆమెదీ శీలా వీర్రాజుగారి మనోహరమైన కొత్తమలుపు. కొద్ది పేపైనా పేదతీర్చే మేపూల ఆ నీడలే ఒక్కొక్కప్పుడు పెనుభూతాలై ప్రళయాన్ని మోసుకు రావచ్చునంటారు అవసరాల రామకృష్ణారావు— ఈ నాటివరకూ జరిగి, జరుగుతూవుండి, జరుగబోతున్న సృష్టి రహస్యాన్ని అతి రమ్యంగా చిత్రీకరించారు శ్రీమతి **ఆనంటిరామం.**

సంపాదక వర్గం ఒక అపనిందను మోపారు! తెలుగువారికి పుస్తకాలు కొని చదివే అలవాటు చాలా తక్కువ అంటూ. ఇది మామూలు రోకటి పాట, అర్థంలేని అపోహ— విక్రయించగల నేర్పూ, సామర్థ్యమూ లేనప్పుడు ప్రచురణ ఎందుకు చేస్తారు? అనే ఎదురు ప్రశ్నకు వీరి జవాబు?—

—శివకుమారి

## సాహిత్యోద్యమం : మార్క్సిస్ట్ అవగాహన

రచన శ్రీ పొట్లూరి హనుమంతరావు ప్రచురణ మార్క్సిస్ట్ ప్రచురణలు, విజయవాడ—2. వెల 50 పైసలు

41 పేజీల కరపత్రం యిది. శ్రీశ్రీ షష్టిపూర్తి ఉత్సవాల సందర్భంగా సాహిత్యరంగంలో ఒక కలవరం ప్రారంభమయిందంటారు శ్రీ హనుమంతరావుగారు. విప్లవ పోరాటమున్న రచయితల మధ్య వాదోపవాదాల ప్రత్యుత్తరాలు నిజమే. అయితే ఇది మార్క్సిస్ట్ అవగాహన వచ్చినందువల్ల ఫలితమని అనగలమా?

సాహిత్య కృషిని లంచంగా వచ్చే పనుడు దిగుళ్ళనూ ఒక ఉద్యమంగా చిత్రించటం సాహిత్య దృష్టి అవుతుందా?

సగలెత్తుది ఇన్‌ఫాంటిలిజం అడ్వెంచరిజమ్ (17 వ పుట) అని స్పష్టం చేసిన శ్రీ శ్రీ ఆ వాదనే భుజాన వేసుకొన్న దిగంబరకవులతో మాత్రం విడగొట్టుకోలేరు. నిజమే. ఎందుకని?

ఈ కాలంలో అభ్యుదయ రచయిత మాత్రం మార్క్సిస్ట్ అయి ఉండాలని నిర్వచించుదామా? దానికి ఇబ్బందులు అనేకం ఉన్నాయి అంటారు (9 వ పుట) ఈ రచయిత. పోతే దిగంబర కవులు మార్క్సిస్ట్‌లు కారని నిరూపించే యత్నం యీ వ్యాసాలలో జరిగింది. దిగంబర సిద్ధాంతం పెట్టీ బూర్జువా బ్రెయిన్‌వేవ్ అంటారు హనుమంతరావుగారు 16 వ పుట. తమ కవిత్వంలోగల నిహిలిస్టు సారాంశాన్ని వారు తెలుసుకోనంతకాలం వారు మార్క్సిస్టు లెనినిస్టులు కాజాలరు (17 వ పుట) ధనికుల విలాసాలను—పేదల కష్టాలను పరిగణించనే సూత్రీకరించలేదు 22 వ పుట. ఇదే విధంగా కొడవటిగంటి కుటుంబరావుగారి అభిప్రాయాలమీద కూడా కొంత తర్జనభర్జన జరిగింది యీ వ్యాసాలలో. అభ్యుదయ రచనలు చేసేవారు మార్క్సిజం తెలుసుకున్నా తెలుసుకోక పోయినా మార్క్సిస్ట్ దృక్పథం కలవారేనని (27 వ పుట) కుటుంబరావుగారు అన్నారట. అభ్యుదయం అన్నది ఒక సిద్ధాంతం కాదు ఒక వ్యవస్థకే పరిమితమయినదీ కాదు అన్ని వ్యవస్థలలోనూ ఎప్పటికప్పుడు సమాజాన్ని ముందుకు తీసుకుపోయే ప్రతి వర్గాన్ని అభ్యుదయ వర్గంగా పరిగణిస్తాం. అటువంటి వర్గాలను ప్రోత్సహించి, ప్రతిఫలించే పూలపిచ్చే రచయితను అభ్యుదయ రచయిత అంటాం (28 వ పుట)

సాహిత్యోద్యమంపట్ల మార్క్సిస్ట్‌ల అవగాహనను తెలుసుకోవగోరే తెలుగు రచయిత లందరూ చదవవలసిన వ్యాస సంపుటి ఇది.—వి. ఎస్. అవధాని

and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

మీ పాపని జలుబుతో బాధపడనిస్తారా?

# విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కు-దిబ్బడ పోగొడుతుంది. ఊపిరి తేలిగ్గా తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కు-దిబ్బడ తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:



బయట-చర్మం మీద



లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందు ఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందు ఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కు-దిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

**ప్రత్యేక గమనిక**

సత్వరం, మంచిఫలితం కోసం, తగినంత విక్స్ వేపొరబ్ రాయండి... అంటే 19, గ్రా. సీసా, పిల్లలకు 7,8 సార్లు వస్తుంది; పెద్దలకు 3,4 సార్లు.



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి




12. గ్రాముల పెద్దడబ్బా




404

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.